శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీరామాయణశ్లోకరత్నావళి.

అనుసీయాంధ్రీతనిశ్లోకి

చిలకపాటి-వేంకటరామానుజశర్మచే

ముసురుపాకం

కిడాంబి-రంగాచార్యులవారిసహాయముచేత

ద్రావిడమునుండి తెలుఁగున వ్రాయఁబడి

కొమాండూరు

అనంతాచార్యులవారిచే

సరిచూడఁబడి

పాదర్తి-అక్కయ్యగారి

శ్రీమదుమామహేశ్వర

ముద్రాక్షరశాలయందు

ముద్రించిప్రకటింపఁబడియె.

౧౮౯౭ సం॥ ఏప్రల్ నెల.

Registered Copy Right.

# ప్ర క ట న.

ఇందు పునరావృత్తి చేయఁబడుపదములు () ఈ బ్రాకట్టులలోను నూతనములుగాఁ నుంచఁబడునవి [] ఈ బ్రాకట్టులలోను ఉంచఁబడియుండును.

దీనిక్రయం ర్పు. ౧-౦-౦. అంచెకూలి ర్పు. ౦-౧-౦.

వలయువారు నాపేరటికివ్రాసి తెప్పించుకొనవచ్చును.

చిలకపాటి - వేంకటరామానుజశర్మ.

తెలుఁగుపండితుఁడు, లండన్ మిషన్ హైస్కూలు.

అర్మినియన్ వీధి, మద్రాస్.

శ్రీరస్తు.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేత
శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.



# తనిశ్లోకియను శ్రీరామాయణశ్లోకరత్నావళి

## మంగళాచరణమ్.

శ్రీకృష్ణసూరిచరణౌ । శరణంభవతామ్మమానిశంకృపయా
తామరసోదరసాదర । మేదురశోభాఽభిరంజితౌకలయే ॥

విశ్వామిత్రమహర్షి సుబాహుమారీచులు తనయజ్ఞమునకు విఘ్నముసేయఁగా వారలఁజంపి తనయజ్ఞమును నిర్విఘ్నముగ సమాప్తినొందింపఁగోరి దశరథ చక్రవర్తియొద్దకేతెంచి శ్రీరాముని తనతోడ నంపుమనియడుగఁగా ఆదశరథునికిఁ గలిగెడు పుత్రవిషయికమగు ప్రేమాంధత్వమును బోఁగొట్టఁగోరి యీ క్రింది శ్లోకముచేత నారాముని మాహాత్మ్యము నుపపాదించుచున్నాఁడు.

ఈశ్లోకము శ్రీరామాయణము బాలకాండములోఁ బందొమ్మిదవసర్గములోనిది.

శ్లోకము॥ అహంవేద్మిమహాత్మానంరామంసత్యపరాక్రమం
వసిష్ఠోఽపిమహాతేజాయేచేమేతపసిస్థితాః.

టీ॥ అహం=నేను, రామం=శ్రీరాముని, మహాత్మానమ్ = మహిమగలవానిఁగాను, సత్యపరాక్రమం=యథార్థమగుపరాక్రమముగలవానిఁగాను, వేద్మి=తెలిసికొనుచున్నాను. మహాతేజాః-గొప్పతేజస్సుగలవాఁడగు, వసిష్ఠోఽపి=వసిష్ఠమహర్షియును, వేత్తి=ఎఱుంగుచున్నాఁడు. తపసి=తపస్సునందు, స్థితాః=నిష్ఠగలవారలు, యే=ఎవరుగలరో (తే) ఇమేపి=అట్టియీఋషులును, విదంతి=ఎఱుంగుచున్నారు.

తా॥ ఓదశరథుఁడా నేనురాముఁడు మహాత్ముఁడనియు, సత్యమగు పరాక్రమముగలవాఁడనియు నెఱుంగుదును. సర్వఋషుల బ్రహ్మతేజస్సుకంటె నెక్కుడగు బ్రహ్మతేజస్సుగల వసిష్ఠమహర్షియును రాముఁడు మహాత్ముఁడు, సత్యపరాక్రముఁడు అని యెఱుంగును. తపోనిష్ఠులైన యీ యితరమహర్షులునురాముఁడుమహాత్ముఁడు, సత్యపరాక్రముఁడు అనియెఱుంగుదురు. అని తాత్పర్యము.

## పెరియవాచ్చాన్పిళ్లగారిఉపన్యాసము.

[అవతారిక] శ్రీరామచంద్రునికిఁ బరువము పూర్ణముకాకుండుట వలన నీతని మగఁటిమి యెట్టిదోయని దశరథచక్రవర్తిమిక్కిలిశంకించుననుతలంపుచేత నారాముని పరాక్రమమును విశ్వామిత్రమహర్షి సాక్షిసహితముగనుపపాదించుచున్నాఁడు. [అన్వయము]అహంవేద్మి. వసిష్ఠోపివేత్తి. యేచేమేతపసిస్థితాః, తేపివిదంతి. [విశేషార్థము] ॥ శ్లో ॥ ౧ "నయుద్ధయోగ్యతామస్యపశ్యామి" అన్నట్లు ఆతనియయోగ్యతనుదెల్పెడివాఁడవు నీవొకఁడవే. ఆతనియోగ్యతను వెల్లడిసేయుటకు మేమిందఱమున్నారమని తెల్పుచున్నాఁడు. (అహంవేద్మి) ॥ శ్రు ॥ ౨ "నచక్షుషాగృహ్యతే

---

౧ అస్య=ఈశ్రీరామునికి, యుద్ధయోగ్యతాం=యుద్ధముసేయుసామర్థ్యమును, నపశ్యామి=కనుఁగొనను.

౨ చక్షుషా=మాంసపుఁగన్నులచేత, నగృహ్యతే=విషయీకరింపఁబడఁడు. (కింతు) మఱి, విశుద్ధేన = పరిశుద్ధమగు, మనసాతు=హృదయముచేత, గృహ్యతే = గ్రహింపఁబడుచున్నాఁడు,

మనసాతువిశుద్ధేన"అనియు॥ ద్ర॥౩ "ఎన్నైనుంగడక్కణ్ణాఱ్కాణాదవవ్వ
రువై, నెంజెన్నుముడక్కణ్ణేఱ్కాణుమునర్న్దు" అనియుఁ జెప్పఁబడియుండు
రీతిని యోగపరిశుద్ధమయిన యాంతరచక్షుస్సుచేత నేనెఱుంగుదును. బా
హ్యచక్షుస్సుచేతఁ జూచెడు నీవెఱుంగవు. (అహంవేద్మి) ॥శ్లో॥ ౪ "జ్ఞాన
వృద్ధామయారాజన్ బహవఃపర్యుపాసితాః" అనునట్లు పలుగు రాచార్యు
లకు సేవఁజేసిన నేనెఱుంగుదును గాని, జానపదులచేత సేవింపఁబడునట్టి నీవె
ఱుంగుదువా (అహంవేద్మి) ॥శ్లో॥ ౫ "కుశదర్భధరాః"అనునట్లు దర్భల
నుధరించిన యేనెఱుంగుదును గాని, ధనుస్సునుధరించిన నీవెఱుంగుదువా.
(అహంవేద్మి) శిరమునందు జడలుధరించిన యేనెఱుంగుదును గాని శిరం
బునఁ గిరీటంబు ధరియించిన నీవెఱుంగుదువా. (అహంవేద్మి) సాత్త్వికప్ర
కృతియగు నేనెఱుంగుదును గాని, రాజసప్రకృతివగు నీవెఱుంగుదువే.
(అహంవేద్మి)॥ శ్లో ॥ ౬ "నీచశయ్యాసనంచాస్యనిత్యంస్యాద్గురుసన్నిధౌ"
అని చెప్పఁబడినప్రకారము ఆసనము క్రిందనుండెడి యేనెఱుంగుదును గాని
శ్లో ॥ ౭ "సింహాసనేప్రభుః" అనునట్లాసనము మీఁదనున్న నీవెఱుంగుదు

---

౩ ఎన్నైనుమ్=ఎంతకాలమైనను, కడక్కణ్ణాల్ =కన్నని సెప్పఁబడు కంటిచేత, (అనఁగా ప్రత్యక్షపుఁబ్రమాణముచేత) కాణాదవవ్వరువై= చూడఁగూడని యా మూర్తిని (పరమాత్మను) నెజ్జైన్నుముడక్కణ్ణేల్ = హృదయమనియెడు నాంతరచక్షుస్సు, ఉణర్న్దు=ఎల్లప్పుడును భావనఁజేసి, కాణుమ్ = సాక్షాత్కరించును.

౪ విశ్వామిత్రవచనము. హేరాజన్=ఓదశరథరాజా, మయా= నాచేత, జ్ఞానవృద్ధాః=విశేషజ్ఞానముగలవారలు, బహవః = అనేకులు, పర్యుపాసితాః = ఉపాసింపఁబడిరి.

౫ కుశదర్భధరాః—కుశ=తెల్లును, ధర్భ=దర్భలను, ధరాః=ధరించినవారు. (ఋషులు)

౬ గురుసన్నిధౌ=ఆచార్యుని సమీపమందు. అస్య= ఈతనికి(అనఁగా శిష్యునికి) నిత్యం- ఎల్లప్పుడును, నీచశయ్యాసనం=అపకృష్టములగు శయ్యయును, పీఠమును స్యాత్ = ఉండవలయును. అనఁగా గురుసన్నిధియందు స్థానశయ్యాదుల విషయమున నీచుఁడై వర్తించవలయును. అనఁగా తగ్గియుండ వలయుననుట.

౭ సింహాసనే=సింగపుఁగద్దియందు. ప్రభుః = ప్రభువగువాఁడు=అనఁగా

వా. (అహంవేద్మి) యోగక్రమముల నెఱింగిన నేనెఱుంగుదునుగాని, భోగక్రమముల నెఱింగెడి నీవెఱుంగుదువే. (అహంవేద్మి) మోక్షకామేష్టిం జేసిన నేనెఱుంగుదునుగాని, పుత్రకామేష్టిచేసిననీవెఱుంగుదువో. (అహంవేద్మి)ధర్మమోక్షపరుండనైన నేనెఱుంగుదునుగాని,అర్థకామపరుండవైన నీవెఱుంగుదువో. (అహంవేద్మి) ఏనొకరుఁడనే నాయెఱుంగనివాఁడయింటివేని॥ శ్రు॥ ౮ "నేతినేతి" అనియు॥ శ్రు॥ ౯ "కఇత్థావేద" అనియుఁ జెప్పఁబడినరీతిని ప్రమాణభూతములగు వేదములుకూడ నెఱింగినవికావు. అదియునుంగాక॥ శ్లో॥ ౧౦ "బ్రహ్మరుద్రేంద్రభూతానాంమనసామప్యగోచరం" అనియు॥ ద్ర॥ ౧౧ "నాన్ముఖన్ శెంజడైయాన్ ఎన్ట్రివర్కళ్ ఎంబెరుమాన్ దన్నైయార్ అఱికిఱ్పార్" అనియుచెప్పఁబడినప్రకారముప్రమాతలగుబ్రహ్మరుద్రాదులునుఎఱిఁగినవారుగారు. అంతియకాదు॥ శ్రు॥ ౧౨ "సోఽంగవేద యదివానవేద" అనియు॥ ద్ర॥ ౧౩ "తనక్కుం తన్ తన్మైయఱివరియానై" అనియుచెప్పఁబడిన ప్రకారము, ప్రమేయభూతుఁడగు తానైననెఱిఁగిన వాఁడుగాఁడు. కాఁబట్టి వీరందఱు నెఱుఁగనే యెఱుఁగరు. (అహంవేద్మి)

---

సింహాసనమునందు వసియించి ప్రభువైయుండెడివాఁడు అనితాత్పర్యము.

౮ ఇతిన=ఇతిన, ఈప్రకారముగలవాఁడని చెప్పుటకువీలులేదు.

౯ కః = ఎవఁడు, ఇత్థా=ఈప్రకారము, వేద=ఎఱిఁగెను. ఇటువంటివాఁడని యెవఁడెఱింగెను.

౧౦ బ్రహ్మరుద్రేంద్రభూతానాం = బ్రహ్మయు రుద్రుఁడును ఇంద్రుఁడును, అనునధికారిపురుషులయొక్క, మనసామపి=హృదయములకును, అగోచరం=విషయముకానివానిని.

౧౧ నాన్ముఖన్=చతుర్ముఖుఁడును. శెంజడైయాన్=శివుఁడును. ఎన్ట్రివర్గళ్ = అనిచెప్పఁబడుచుండిరు, ఎంబెరుమాన్ దన్నై = మాయేలినవానిని, యార్ = ఎవ్వారలు, అఱికిప్పార్=తెలిసికొనఁగలరు.

౧౨ అంగ=ఓయి, సః=అతఁడు (అనఁగాపరమపురుషుఁడు) వేద=తెలిసికొనెనో. యదివా=అట్లుకాక. నవేద. తెలిసికొనలేదో.

౧౩ తనక్కుమ్=తనకును,తన్దన్మై=తనమాహాత్మ్యమును, అఱివరియానై=తెలిసికొనఁజాలనివానిని.

నేనెఱుంగుదును.॥ శ్రు॥ ౧౪ "యస్సర్వజ్ఞస్సర్వవిత్" అనియు॥ శ్రు॥ ౧౫ "స్వాభావికీజ్ఞానబలక్రియాచ" అనియుఁ జెప్పఁబడియుండు ప్రమాణముల నన్ను తనయందు సర్వజ్ఞత్వబుద్ధిని బాటించియొకయాచార్యునికైనను వినఁ బ్రముఁడైవినకుండుటవలన ప్రమేయ భూతుఁడైన తాను నెఱుంగఁడు. మఱి॥ శ్లో॥ ౧౬ "దదామిబుద్ధియోగంతం" అనియు॥ ద్ర॥ ౧౭ "మయర్వఱమదినల మరుళినన్" అనియు॥ శ్లో॥ ౧౮ "శ్రుతమాసీన్మరీచితః" అనియుఁ జెప్పఁబడిన ప్రకారము సంప్రదాయసిద్ధ జ్ఞానముగలవారలేగదా యెఱుఁగుదురు. కాననాలోపమునుబోఁగొట్టుకొనుటకొఱకై॥ శ్లో॥ ౧౯ "బ్రాహ్మణానాము పాసితా" అని చెప్పినప్రకారమాతఁడు జ్ఞానులయొక్క పాదమూల ములయందుఁ దొట్రుపడుచు సంచరింపవయ్యెను. (అహంవేద్మి) ॥ శ్రు॥ ౨౦ "తమేతం వేదానువచనేనబ్రాహ్మణావివిదిషంతి, యజ్ఞేనదానేనతపసా నాశకేన" అనియు॥ శ్రు॥ ౨౧ "శ్రోతవ్యోమంతవ్యోనిదిధ్యాసితవ్యః" అనియుఁ

---

౧౪ యః = ఎవఁడు, సర్వజ్ఞః = సర్వవిషయకమగుసామాన్యజ్ఞానముగల వాఁడో. సర్వవిత్ = సర్వవిషయకవిశేషజ్ఞానముగలవాఁడో.

౧౫ జ్ఞానబలక్రియాచ = జ్ఞానము శక్తి క్రియయును, స్వాభావికీ = స్వభావ సిద్ధములు.

౧౬ తం = అటువంటి, (అనఁగాభక్తిరూపాపన్నమగునట్టి) బుద్ధియోగం = జ్ఞానయోగమును, దదామి = ఇచ్చెదను.

౧౭ మయర్వఱ = మఱపుచెడునట్లు, మదినలమ్ = బుద్ధియోగమును, అరుళి నన్ = కృపచేసెను.

౧౮ మరీచితః = మరీచిబ్రహ్మఋషివలననుండి, శ్రుతమాసీత్ = వినఁబడిన దయ్యెను.

౧౯ బ్రాహ్మణానాం = బ్రహ్మజ్ఞానులను, ఉపాసితా = ఉపాసించెడువాఁడు.

౨౦ బ్రాహ్మణాః = బ్రహ్మజ్ఞానులు, తమేతమ్ = అటువంటివానిని, వేదానువచనేన = వేదాభ్యాసముచేతను, అనాశకేన = విపరీతఫలమునివ్వనిదియగు, యజ్ఞేన = దేవపూజచేతను, దానేన = సత్పాత్రప్రదానముచేతను, తపసా = ధ్యానముచేతను, వివిదిషంతి = ఎఱుంగఁగోరుచున్నారు.

౨౧ శ్రోతవ్యః = వినఁదగినది. మంతవ్యః = మననముసేయఁదగినది నిదిధ్యాసితవ్యః = పలుమాఱుతలఁచఁదగినది (అట్టిది పరమాత్మస్వరూపము.)

జెప్పఁబడిన ప్రమాణముల ప్రకారము నేనువాని నెఱుంగుట కనుభవించిన శ్రమను చెప్పశక్యమా. [మహాత్మానం అను పదమునకవతారిక] అట్లైనిలా నెఱింగిన ప్రకారమేదియనఁగా. (మహాత్మానం) తనకంటె హెచ్చైన వాఁడును తనకు సముఁడును లేనట్టి గొప్పతనము గలవాఁడని యెఱింగితి ననుట॥ శ్లో॥ ౨౨ "తేజసాంహి న వయస్సమీక్ష్యతే" అని చెప్పిన ప్రకారము శరీరము చిన్నదిగాఁ గనుపట్టినను పరత్వము ఊర్జితముగానుండును సుమీ. (మహాత్మానం) శ్లో॥ ౨౩ "ఆత్మా జీవే ధృతౌ దేహే స్వభావే పరమాత్మని। యత్నేఽర్కేఽగ్నౌ మతౌ వాతే" అను నిఘంటువచన ప్రకారము ఆత్మన్ శబ్దమునకు ఆత్మ, ధృతి, దేహ, స్వభావ, పరమాత్మ, యత్న, అర్క, అగ్ని, మతి, వాతములు పదియునర్థములుగాఁ గనఁబడుచున్నవి. అందులో మొదటిదైన జీవమర్థమగునప్పుడు (మహాత్మానం) అనఁగా॥ శ్రు॥ ౨౪ "యస్యాత్మా శరీరం" అనియు ॥ శ్రు ॥ ౨౫ "య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరః" అనియుఁ జెప్పఁబడియుండు ప్రకారము సర్వజీవాత్మలు దనకు శరీరములుగా నుండునట్లు సర్వాత్మ శరీరిగా నుండును అని యెఱుఁగుదు ననుట. లేక. రెండవదియగు ధృతియర్థమగునపుడు. (మహాత్మానం) అనఁగా॥ శ్లో॥ ౨౬ "ఆపద్యపి స్వకార్యేషు కర్తవ్యత్వస్థితిర్ధృతిః" అనెడి విధముగాఁ

---

౨౨ తేజసాం = అగ్ని మొదలగు తేజస్సులకు, వయః = కాలమువలనఁ గలిగెడు పరిణామము, న సమీక్ష్యతేహి = నిరూపింపఁబడదుగదా.

౨౩ ఆత్మా = ఆత్మన్ శబ్దము, జీవే = జీవునియందు, ధృతౌ = ధైర్యమునందు దేహే = శరీరమునందు, స్వభావే = స్వభావమునందు, పరమాత్మని = పరమాత్మయందు, యత్నే = ప్రయత్నమందు, అర్కే = సూర్యునియందు, అగ్నౌ = అగ్నియందు, మతౌ = బుద్ధియందు, వాతే = గాలియందు, (ప్రయోగింపఁబడును.)

౨౪ యస్య = ఏపరమాత్మకు = ఆత్మా = జీవాత్మలు, (జాత్యేకవచనము) శరీరం = దేహమో.

౨౫ ఆత్మని = జీవాత్మయందు, తిష్ఠన్ = ఉండినవాఁడగుచు, యః = ఏపరమాత్మ, ఆత్మనః = జీవాత్మలకు, అంతరః = అంతర్యామిగా. అనఁగా శరీరిగానున్నవాఁడో.

౨౬ ఆపద్యపి = ఆపత్తుకలిగినప్పుడును. స్వకార్యేషు = తనపనులవిషయమున, కర్తవ్యత్వే = చేయవలయుననుటయందు, స్థితిః = చిత్తస్థైర్యము, ధృతిః = ధృతియని

దాటకాతాటకేయ ప్రముఖులగు ప్రబలవిరోధి పరంపర లుండినను ॥ శ్లో ॥ ౨౭ "యజ్ఞవిఘ్నకరంహన్యాం" అని తాము చేయఁ బూనకొనిన కార్యమును నెఱవేర్చునట్టి నిలుకడ గలవాఁడుగా నుండునని యెఱుంగు దుననుట. మూడవదియగు దేహమర్థమగునపుడు (మహాత్మానం) అనఁగా॥ శ్లో॥ ౨౮ "నిత్యంనిత్యాకృతిధరం" అనియు,॥ శ్లో॥ ౨౯ "నతస్యప్రాకృతా మూర్తిర్మాంసమేదోస్థిసంభవా" అనియు॥ ద్ర॥ ౩౦ "మాశూణాచ్ఛుడ రుడంబాయు" అనియు చెప్పఁబడియుండురీతినిశత్రువులచేతనశింపఁజేయఁ గూడనియట్లు నిత్యనిరవద్యనిరతిశయౌజ్జ్వల్య విగ్రహుండై యుండువాఁ డు,, అని యెఱుంగుదుననుట. లేక. నాల్గవదియగు స్వభావమర్థమగున ప్పుడు॥ శ్లో॥౩౧"అభయంసర్వభూతేభ్యోదదామ్యేతద్వ్రతంమమ" అని యు॥ శ్లో॥ ౩౨ "పాశుపాల్యంహినోవృత్తిః" అనియుఁజెప్పినప్రకారము ఆపన్నజనరక్షణమే తనకుస్వభావముగాఁగలవాఁడనియెఱుంగుదుననుట. లేక.ఐదవదియగుపరమాత్మయర్థమగునప్పుడు॥"పరో మా యస్మాదితిప రమః"అనెడివ్యుత్పత్తిచేత॥శ్రు॥౩౩"యస్మాత్పరంనాపరమస్తికించిత్" చెప్పఁబడును.

---

౨౭ యజ్ఞవిఘ్నకరం=జన్నమునకు విఘ్నములనుజేయువానిని, హన్యాం= చంపుదును.

౨౮ నిత్యం= నాశరహితుఁడును, నిత్యాకృతిధరం=నిత్యమగునాకారమును ధరించినవాఁడును.

౨౯ తస్య= ఆపరమాత్మకు, మాంసమేదోస్థిసంభవా=మాంసము మెదడు ఎముకలు అనెడివానిచేనుత్పన్నమయి, ప్రాకృతా=ప్రకృతిసంబంధముగల, మూర్తిః =శరీరము,న=లేదు. అప్రాకృతదివ్యమంగళ విగ్రహుఁడు.

౩౦ మాశు=మైల, ఊణాద = సంబంధపడని, శుడర్ = తేజోవంతమగు, ఉడంబాయి=దేహముగలవాఁడై.

౩౧ సర్వభూతేభ్యః = ఎల్లప్రాణులకు, అభయం=రక్షణమును, దదామి= ఇచ్చెదను. ఏతత్=ఇది, మమ=నాయొక్క, వ్రతం=నియమము.

౩౨ పాశుపాల్యమ్ = చేతనసంరక్షణము, నః= మాయొక్క,వృత్తిర్హి = పనిగదా.

౩౩ యస్మాత్ = ఏపరమాత్మస్వరూపవస్తువుకంటె, పరం=ఉత్కృష్టమగు,

జెప్పఁబడిన ప్రమాణముల ప్రకారము నేనువాని నెఱుంగుట కనుభవించిన శ్రమను చెప్పశక్యమా. [మహాత్మానంఅనుపదమునకవతారిక] అట్లైని తానెఱింగిన ప్రకారమేదియనఁగా. (మహాత్మానం) తనకంటె హెచ్చైన వాఁడును తనకు సముఁడును లేనట్టి గొప్పతనము గలవాఁడని యెఱింగితి ననుట॥ శ్లో॥ ౨౨ "తేజసాంహినవయస్సమీక్ష్యతె" అనిచెప్పినప్రకారము శరీరము చిన్నదిగాఁ గనుపట్టినను పరత్వము ఊర్జితముగానుండునుసుమీ. (మహాత్మానం) శ్లో॥ ౨౩ "ఆత్మాజీవే ధృతౌదేహేస్వభావేపరమాత్మని। యత్నే ర్కేఽగ్నౌమతౌవాతే" అను నిఘంటువచన ప్రకారము ఆత్మశబ్దమునకుఆత్మ, ధృతి, దేహ, స్వభావ, పరమాత్మ, యత్న, అర్క, అగ్ని, మతి, వాతములు పదియునర్థములుగాఁ గనఁబడుచున్నవి. అందులో మొదటిదైనజీవమర్థమగునప్పుడు(మహాత్మానం)అనఁగా॥ శ్రు॥ ౨౪ "యస్యాత్మా శరీరం,, అనియు ॥ శ్రు ॥ ౨౫ "య ఆత్మనితిష్ఠన్నాత్మనోఽంతరః" అనియుఁ జెప్పఁబడియుండు ప్రకారము సర్వజీవాత్మలుదనకు శరీరములుగా నుండునట్లు సర్వాత్మ శరీరిగా నుండును అని యెఱుఁగుదు ననుట. లేక. రెండవదియగు ధృతియర్థమగునపుడు. (మహాత్మానం) అనఁగా॥ శ్లో॥ ౨౬ "ఆపద్యపి స్వకార్యేషు కర్తవ్యత్వస్థితిర్ధృతిః" అనెడి విధముగాఁ

---

౨౨ తేజసాం=అగ్ని మొదలగు తేజస్సులకు, వయః=కాలమువలనఁగలిగెడు పరిణామము, నసమీక్ష్యతేహి=నిరూపింపఁబడదుగదా.

౨౩ ఆత్మా= ఆత్మశబ్దము, జీవే=జీవునియందు, ధృతౌ=ధైర్యమునందు దేహే=శరీరమునందు, స్వభావే=స్వభావమునందు, పరమాత్మని=పరమాత్మయందు, యత్నే=ప్రయత్నమందు, అర్కే = సూర్యునియందు, అగ్నౌ = అగ్నియందు, మతౌ=బుద్ధియందు, వాతే=గాలియందు, (ప్రయోగింపఁబడును.)

౨౪ యస్య = ఏపరమాత్మకు=ఆత్మా = జీవాత్మలు, (జాత్యేకవచనము) శరీరం=దేహమో.

౨౫ ఆత్మని=జీవాత్మయందు, తిష్ఠన్=ఉండినవాఁడగుచు,యః=ఏపరమాత్మ, ఆత్మనః = జీవాత్మలకు, అంతరః=అంతర్యామిగా. అనఁగాశరీరిగానున్నవాఁడో.

౨౬ ఆపద్యపి=ఆపత్తుకలిగినప్పుడును. స్వకార్యేషు=తనపనులవిషయమున, కర్తవ్యత్వే = చేయవలయుననుటయందు, స్థితిః=చిత్తస్థైర్యము, ధృతిః=ధృతియని

దాటకాతాటకేయ ప్రముఖులగు ప్రబలవిరోధి పరంపర లుండినను॥ శ్లో॥ ౨౭ "యజ్ఞవిఘ్నకరంహన్యాం" అని తాము చేయఁ బూనకొనిన కార్యమును నెఱవేర్చునట్టి నిలుకడ గలవాఁడుగా నుండుననని యెఱుంగు దుననుట. మూడవదియగు దేహమర్థమగునపుడు (మహాత్మానం) అనఁగా॥ శ్లో॥ ౨౮ "నిత్యంనిత్యాకృతిధరం" అనియు,॥ శ్లో॥ ౨౯ "నతస్యప్రాకృతా మూర్తిర్మాంసమేదోస్థిసంభవా" అనియు॥ ద్ర॥ ౩౦ "మాశూణాచ్చుడరుడంబాయి" అనియు చెప్పఁబడియుండురీతినిశత్రువుల చేతనశింపఁజేయఁ గూడనియట్లు నిత్యనిరవద్యనిరతిశయౌజ్జ్వల్య విగ్రహుండై యుండువాఁడు,, అని యెఱుంగుదుననుట. లేక. నాల్గవదియగు స్వభావమర్థమగునప్పుడు॥ శ్లో॥౩౧"అభయంసర్వభూతేభ్యోదదామ్యేతద్వ్రతంమమ" అనియు॥శ్లో॥ ౩౨ "పాశుపాల్యంహినోవృత్తిః" అనియుఁజెప్పినప్రకారము ఆపన్నజనరక్షణమే తనకుస్వభావముగాఁగలవాఁడనియెఱుంగుదుననుట. లేక.ఐదవదియగుపరమాత్మయర్థమగునప్పుడు॥"పరో మా యస్మాదితిపరమః"అనెడివ్యుత్పత్తిచేత॥శ్రు॥౩౩"యస్మాత్పరంనాపరమస్తికించిత్"

---

చెప్పఁబడును.

౨౭ యజ్ఞవిఘ్నకరం=జన్నమునకు విఘ్నములనుజేయువానిని, హన్యాం= చంపుదును.

౨౮ నిత్యం= నాశరహితుఁడును, నిత్యాకృతిధరం=నిత్యమగునాకారమును ధరించినవాఁడును.

౨౯ తస్య= ఆపరమాత్మకు, మాంసమేదోస్థిసంభవా=మాంసము మెదడు ఎముకలు అనెడివానిచేనుత్పన్నమయి, ప్రాకృతా=ప్రకృతిసంబంధముగల, మూర్తిః =శరీరము,న=లేదు. అప్రాకృతదివ్యమంగళ విగ్రహుఁడు.

౩౦ మాశు=మైల, ఊణాద = సంబంధపడని, శుడర్= తేజోవంతమగు, ఉడంబాయి=దేహముగలవాఁడై.

౩౧ సర్వభూతేభ్యః = ఎల్లప్రాణులకు, అభయం=రక్షణమును, దదామి= ఇచ్చెదను. ఏతత్=ఇది, మమ=నాయొక్క, వ్రతం=నియమము.

౩౨ పాశుపాల్యమ్ = చేతనసంరక్షణము, నః= మాయొక్క,వృత్తిర్హి = పనిగదా.

౩౩ యస్మాత్ = ఏపరమాత్మస్వరూపవస్తువుకంటె, పరం=ఉత్కృష్టమగు,

అనియు, శ్రు॥౩౪ "నతత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే" అనియు॥ద్ర॥౩౫ "ఒత్తారైమిక్కారైయిలయాయమామాయ" అనియుఁజెప్పఁబడియుండుప్రకారము స్వేతర సమస్తదేవతలకంటెమేలైనవాఁడై, అంతర్యామిగా నుండెడివాఁడనియెఱుంగుదు ననుట. లేక. ఆఱవదియగు యత్నమర్థమగునప్డు(మహాత్మానం)యత్నమనఁగాఁబ్రయత్నము॥ శ్లో॥౩౬ "ప్రయత్నస్స్వాత్మధర్మస్స్యాదుత్సాహో భావనాచసః" అనువచనముచొప్పునఁబ్రయత్నముత్సాహమని చెప్పబడునుకాఁబట్టి॥శ్లో॥౩౭ "వినాశాయచదుష్కృతాం సంభవామి" అని చెప్పినప్రకారముదుష్కృద్వినాశము సేయుటయందుత్సహించువాఁడుఅనియెఱుఁగుదుననుట. లేక. ఏడవదియగుసూర్యుఁడర్థమగునప్పుడు (మహాత్మానమనఁగా)॥శ్లో॥౩౮ "రామదివాకరః" శత్రురక్షోమయంతోయముపశోషంనయిష్యతి,, అనెడివిధముగఆయుధనిరపేక్షముగా తమప్రతాపముచేతనే శత్రువులగు రాక్షసులనియెడినీరమును ఊటలతోఁగూడనింకింపఁజేయువాఁడుఅనియెఱుంగుదుననుట. లేక. ఎనిమిదవదగునగ్నియర్థమైనప్డు[మహాత్మానమనఁగా]శ్లో॥౩౯ "అభితఃపావకోపమం"

---

అపరం=ఇతరమగువస్తువు, నాస్తి=లేదో.

౩౪ తత్సమశ్చ= ఆపరమాత్మకుఁదుల్యమగువస్తువును, అభ్యధికశ్చ= అతిశయించినవస్తువును, నదృశ్యతే=కనఁబడదు.

౩౫ ఒత్తారై=సమానులును, మిక్కారై= అతిశయించినవారును, ఇలయాయ=లేనట్టి, మామాయ=మహామాయగలవాఁడా.

౩౬ ప్రయత్నః=ప్రయత్నము, స్వాత్మధర్మః=తనయొక్క యాత్మయందుండెడి ధర్మము. సః=అది, ఉత్సాహః=ఉత్సాహమనియు, భావనాచ = భావనయనియుఁజెప్పఁబడును.

౩౭ దుష్కృతాం = దుష్టకృత్యములు సేయువారియొక్క, వినాశాయచ= నాశము కొఱకును, (అనఁగాదుష్టులను సంహరించుటకు) సంభవామి = జనించుచున్నాను.

౩౮ రామదివాకరః = శ్రీరాముఁడనెడి సూర్యుఁడు, శత్రురక్షోమయం = శత్రువులగురాక్షసులనియెడి, తోయం= నీటిని, ఉపశోషంనయిష్యతి = ఎండింపఁజేయుఁగలఁడు.

౩౯ అభితః=అంతటను, పావకోపమం=అగ్నికిసమానుఁడును,

అనియు॥ శ్లో॥ ౪౦ "నిర్దహేదపికాకుత్థ్సః క్రుద్ధస్తీవ్రేణచక్షుషా" అనియు॥ ద్ర॥ ౪౧ 'అనలురువిఱ్ఱికఱ్ఱుంశోదితన్నురువాయు' అనియుఁ జెప్పఁబడియుండె డిప్రకారము శత్రుశరీరములనెల్ల వానిఁగాల్చి భస్మము సేయఁగలవాఁడు, అని యెఱుంగుదుననుట. లేక. తొమ్మిదవదియగు మతి యర్థమగునపుడు శ్లో॥ ౪౨ "సర్వశాస్త్రార్థతత్వజ్ఞః" అనియు॥ శ్లో॥ ౪౩ "బుధ్యాహ్యష్టాంగయాయుక్తః" అనియుఁ జెప్పఁబడినప్రకారము ఉన్నచోటనేయుండి శత్రువులునశించునట్టియుపాయములను వెదకఁగలవాఁడు అని యెఱుంగుదుననుట. లేక. పదవదియగువాతమర్థమైనపుడు (మహాత్మానం) అనఁగా. శ్లో॥ ౪౪॥ "తస్మై వాతాత్మనే నమః" అనియు॥ ద్ర॥ ౪౫ "కాలాయి త్తీయాయి" అనియుఁ జెప్పెడి రీతిగా మహావాతహతంబగు తూలరాశివలె శత్రువులు పోయ్చెడుచోటు నెఱుంగకుండునట్లు చేయఁ గలవాఁడు, అని యెఱుఁగుదు ననుట. లేక- "మృతసంజీవనంహి రామవృత్తాంతం" అన్న ప్రకారము సర్వప్రాణి ప్రాణనహేతువగు గాలివలె ననుకూలుర నుజ్జీవింపఁజేయ శక్తుఁడగువాఁడు అని యెఱుంగుదు ననుట. లేక. (మహాత్మానం) అనఁగా వేత్తి వేదయతియను వ్యుత్పత్తిచేతఁ దానెఱింగి పరులకు నెఱింగించునట్టి వేదమును॥ శ్రు॥ ౪౬ "వేదాహమేతంపురుషం" అని తానెఱిం

---

౪౦ కాకుత్థ్సః=శ్రీరాముఁడు, తీవ్రేణ=ఉగ్రమగు, చక్షుషా= కంటిచేత, నిర్దహేదపి=దహించును.

౪౧ అనలురువిల్ = అగ్నియొక్కరూపముకంటె, తికఱ్ఱుం=అధికముగఁ బ్రకాశించెడి, శోదితన్నురువాయ్=జ్యోతిస్వరూపమయి.

౪౨ సర్వశాస్త్రార్థతత్వజ్ఞః=సమస్తములగు శాస్త్రములయందలి విషయములయథార్థముగ నెఱింగినవాఁడు.

౪౩ అష్టాంగయా=గ్రహణ ధారణస్మరణాదులయినయెనిమిదంగములతోఁ గూడికొన్నదియగు, బుధ్యా=బుద్ధితోడ, యుక్తః=కూడికొన్నవాఁడు.

౪౪ వాతాత్మనే= వాయుస్వరూపియగు, తస్మై=ఆభగవంతునికై, నమః= నమస్కారము.

౪౫ కాలాయి=వాతస్వరూపియయి, తీయాయి=అగ్నిస్వరూపియయి.

౪౬ అహం= నేను, ఏతం= ఈ, పురుషం=పురుషుని, మహాంతం= మహాత్ము

గీ, నట్లు తెలుపుచున్నది. తానెఱింగినవిధమేమనఁగా॥ ద్ర॥ ౪౭ "అఱిందవేదవరుంబారుళ్ నూల్కళఱిందనకొళ్ళవరుంబారుళాదల్" అను ప్రకారము మహాంతమని యపరిచ్ఛిన్నమని చెప్పినదంతియేకదా.॥ శ్రు॥ ౪౮ "యస్యామతంతస్య మతంమతంయస్యన వేదసః" అన్న ప్రకారము ఆవస్తువు నెఱుఁగుటయనఁగా నదియపరిచ్ఛిన్నమనివాస్తవాకారముగ నెఱుంగుటయే. [వేదాహమేతంపురుషంమహాంతం అను శ్రుతివాక్యమునకును, అహంవేద్మి మహాత్మానమనుకవివాక్యమునకు నైకకంఠ్యమును దెల్పుచున్నారు] అహం వేద్మియనునితిహాసవాక్యము॥ శ్రు॥ "వేదాహమేతం" అను వేదవాక్యము నుపబృంహించుచున్నది. [ఆయర్థము నేచక్కఁగా దెల్పుచున్నది] అచ్చటి వేదయనునదియెయిచ్చట వేద్మియనియు అచ్చటిఅహంఅనునదియెయిచ్చటఅహం అనియు చెప్పఁడియున్నది. ఏతంఅనేడి సౌలభ్యసూచకమగు నేతచ్ఛబ్దార్థమెయిచ్చట రామంఅనిని ర్దేశింపఁబడినది. అచ్చటిపురుషశబ్దముచేతనిర్దిష్టములగుశౌర్యవీర్యాదులుఇచ్చటిసత్యపరాక్రమ మనుపదముచేఁ దెల్పఁబడుచున్నవి. అచ్చోమహాంతం అనునదియె యిచ్చోట మహాత్మానమని తెల్పఁబడెను. ఇందువలన వేదపురుషునియొక్కయు వైదిక పురుషునియొక్కయు వాక్యములు ఆతని విషయమందు భేదములేక యేకరూపముగానే యుండుట దెల్పఁబడియున్నది. [రామపదమునకవతారిక] ఈ ప్రకారము మహాత్మానమని చెప్పఁబడువస్తువు దేశాంతరంబుననుండునదిన్నై యెందుకొనుటకు వీలుపడదో యనఁగా (రామం) శ్లో॥ ౪౯ "పితరంరోచయా

నిఁగా, వేద=ఎఱుంగుదును

౪౭ వేదవరుంబారుళ్ నూల్కళ్=వేదములు మొదలగురహస్యార్థ ప్రతిపాదకములగు శాస్త్రములు, అఱిందన = ఎఱిఁగెను. (ఎల్లెఱింగెననఁగా) "అరుంబారుళాదల్=అరుదగువస్తువన్నికోళ్క-తెలిసికొనుఁడు" (అని) అఱిందన=ఎఱింగెను.

౪౮ యస్య = ఎవనిమతమందు, అమతం= పరబ్రహ్మ-జ్ఞానవిషయముకాదని సమ్మతమో. తస్య = వానియొక్కమతమందు, మతం=జ్ఞానవిషయము. యస్య=ఎవ్వనికి, మతం. జ్ఞానవిషయమనిమతమో, సః. వాఁడు, నవేద-ఎఱింగినవాఁడుకాఁడు

౪౯ పితరం=తండ్రి యగునటుల, రోచయామాస=రుచింపఁజేసెను, (అనఁగా సమ్మతింపఁజేసెను) ఆతనిసమ్మతింపఁజేసికొని యాతనికిఁదానవతరించెననుట.

మాస" అన్నట్లు నిన్ను సమ్మతింపఁజేసి రామరూపముగావచ్చి యవతరిం
చిన యీతఁడు ఆ పరవస్తువేయనుకొనుమీయనుచున్నాఁడు. (రామం)
పర వస్తువనియెంచి నీవును నేనునుమనసున జంకునట్లుమనలను ఉదాసీను
లఁజేసి తాను దూరముగా నిలువకయు, నాకు చేతిబంటువలెఁ బిలువఁదగి
యు, నిన్ను సింహాసనంబుపైఁ గూరుచుండఁబెట్టి తాను క్రిందనిలిచియు
నుండుటవలన నీకుఁదెలియలేదు. అనియనుకొనుము. [రామం మహాత్మా
నమని రామ శబ్దానంతరము మహాత్మశబ్ద మనుసరింపఁబడి యుండుటకు
తాత్పర్యము దెలుపుచున్నారు] (రామంమహాత్మానం)॥ శ్రు॥ ౫౦ "సఉ
శ్రేయాన్ భవతిజాయమానః" అన్నట్లు ఆతఁడు తన్నుఁగ్రిందుపడఁజేసి
కొని జనియించిన తోడనే వానికి మహత్త్వమొప్పినది. నీవెకద రామం అని
చెప్పినది. [సత్యపరాక్రమం అనుపదమున కవతారిక దెలుపుచున్నారు]
ఆకారమునందలి క్రొత్తమెఱుఁగు ఇంకను మాసినదికాదు. శ్రమపడకుం
డుటచేత నీతనిశరీరము దృఢపడినదిగాదు. అట్లుండనీతఁడు పరాక్రమిం
చుటకు శక్తుండగునా, అనఁగాఁ దెలుపుచున్నాఁడు. (సత్యపరాక్రమం)
ఈతని గుణములు కావలసినప్పుడు శరీరమువలె స్వీకరింపను బరిత్యజిం
పను దగియుండునట్టివికావు. అవి నిత్యములుగానేయున్నవి. (సత్యపరా
క్రమం)॥ శ్రు॥ ౫౧ "సదైకరూపపరాక్రమం. సదైకరూపరూపాయ"
అనియు ॥ శ్రు ॥ ౫౨ "తఇమే సత్యాఃకామాః" అనియు ॥ శ్రు ॥ ౫౩
"ఏతాంశ్చ సత్యాన్ కామాన్" అనియు ॥ శ్రు ॥ ౫౪ "స్వాభావికీ

---

౫౦ జాయమానస్సన్ = జనించెడివాఁడై, సఉ=వాఁడే, శ్రేయాన్=మిగు
లనుత్కర్షముఁబొందినవాఁడుగా, భవతి=అగుచున్నాఁడు

౫౧ సదా=ఎల్లప్పుడు, ఏకరూపపరాక్రమం= వికారముఁజెందకయుండెడి
పరాక్రమముగలవానిన్ ✻ సదా=ఎల్లప్పుడును, ఏకరూప=వికారముఁజెందకయుం
డెడి, రూపాయ=స్వరూపముగలవానికై.

౫౨ తఇమే = అట్టియీపరమాత్మగతములయిన, కామాః = సంకల్పాది
గుణములు, సత్యాః= నిత్యములైయుండునవి.

౫౩ ఏతాన్-ఈ, సత్యాన్-నిత్యములగు, కామాంశ్చ-సంకల్పాది గుణములను.

౫౪ జ్ఞానబలక్రియాచ = జ్ఞానము బలము క్రియయు, స్వాభావికీ =

జ్ఞానబల క్రియాచ" అనియుఁ జెప్పఁబడియుండు ప్రకారము ఈతనికి విగ్రహం బైచ్ఛికంబై గుణములు నిత్యంబులై కదా యుండుట. శ్రీపరాశరబ్రహ్మర్షి యును॥శ్లో॥౫౫ "ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః" అనుటచేత విగ్రహమైచ్ఛికమని చెప్పి॥ శ్లో॥ ౫౬ "తేజోబలైశ్వర్యమహావబోధసువీర్యశక్త్యాదిగుణైకరాశిః" అనుటచేత గుణములు స్వాభావికములనియు చెప్పిరి. (సత్యపరాక్రమం)॥ శ్లో॥ ౫౭ "అవ్యవస్థాహిదృశ్యేతే యుద్ధేజయపరాజయౌ" అన్నట్లు లోకులవలెనీతనియొక్క గమనము అవ్యవస్థితముకాదు. మఱియెట్టిదనిన॥ శ్లో॥ ౫౮ "నావిజిత్యనివర్తేత" అనియు॥ శ్లో॥ ౫౯ "అభియాతాప్రహర్తాచ" అనియు॥ ద్ర॥ ౬౦ "శెన్ఱుకొన్ఱువెన్ఱికొండ" అనియు చెప్పఁబడి యుండురీతిని, ఈతఁడు చెలరేఁగెనేని శత్రువుల నాక్రమించుకొని వారలం దలమెత్తనీయక అణఁచివేసికానిమానఁడు. (సత్యపరాక్రమం)॥ శ్రు॥ ౬౧ "తస్మిన్ దృష్టే పరావరే" అనియు॥ద్ర॥ ౬౨ "శివనయ

---

స్వభావసిద్ధములు.

౫౫ ఇచ్ఛా=తనయిచ్ఛచేత, గృహీత = పరిగ్రహింపఁబడినవయి, అభిమత =సమ్మతింపఁబడిన,ఉరు=గొప్పవియగు, దేహః=శరీరములుగలవాఁడు-చేతనులకు వలె కర్మపరతంత్రములగుశరీరములుగాక తనయిష్టానుగుణమగుశరీరముగలవాఁడు.

౫౬ తేజః= తేజస్సు, బల=బలము, ఐశ్వర్య= అష్టైశ్వర్యములు, మహావబోధ=సర్వజ్ఞత్వము, సువీర్య= మంచివీర్యము, శక్తి=సామర్థ్యము ఆది= మొదలగు, గుణ=గుణములకు, ఏకరాశిః=ముఖ్యసముదాయరూపుఁడగు.

౫౭ యుద్ధే=యుద్ధమునందు, జయపరాజయౌ= జయాపజయములు, అవ్యవస్థాహి= సందేహింపఁదగినవికదా.

౫౮ అవిజిత్య=జయింపక,ననివర్తేత=మరలఁడు-జయించియేమరలుననుట,

౫౯ అభియాతా=ఎదిరించువాఁడు, ప్రహర్తాచ= సంహరించెడువాఁడు.

౬౦ శెన్ఱు = శత్రువులనెదిరించిపోయి, కొన్ఱు = చంపి, వెన్ఱి=జయమును కొండ=కొన్నట్టి.

౬౧ పరావరే = పరులమని తలంచుకొనియున్న బ్రహ్మాదులకంటెఁబరమైన, తస్మిన్=ఆపరమాత్మ, దృష్టే=దర్శన సమానాకార జ్ఞానవిషయముకాఁగా.

౬౨ శివన్ = రుద్రుఁడు, అయన్=బ్రహ్మ, ఇందిరన్= ఇంద్రుఁడు, ఇవర్ మొదల్=వీరుమొదలగు, అనత్తోర్ దైవక్కూట్టాంగళ్ =ఎల్ల దేవతలయొక్క సమూ

నిందిరనివర్ మొదలనత్తోర్ దైవకుట్టాంగళ్ కైత్తొழுకిఱ్ఱండ" అనియు చెప్పఁబడినట్లు తామే పరములని తమ హృదయములయందు దలంచియుండు బ్రహ్మరుద్రాదులనుగూడ నధఃకరించి పరమైయుండు వస్తుప్రత్యుద్రులగు శత్రువులను విడుచునా. (సత్యపరాక్రమం) సత్యులగుపరుల నాక్రమించువాఁడనియు వ్యుత్పత్తి వివక్షింపనగును. ప్రకృతిసంబంధ నిబంధనముచేఁ బ్రాతికూల్యముచేయునట్టివారు నొకవేళమరలనను కూలింతురో యనిమెంచి॥ శ్లో॥ ౬౩ "యదివా రావణస్స్వయం" అనియు॥ శ్లో॥ ౬౪ "గచ్ఛానుజానామి" అనియు॥ ద్ర॥ ౬౫ "ఉళందొట్టు" అనియుఁ జెప్పినట్లు రక్షణోన్ముఖుఁడైనప్పుడును రక్షణమునకుఁ జోటియ్యక ప్రాతికూల్యమునందే కడవఱకు నిలుకడగా నుండెడివారిని ముగింపుసేయుననుట. [రామంఅను పదమును సత్యపరాక్రమ మనుపదముతోఁజేర్చి తాత్పర్యము నుపపాదించుచున్నారు] (రామంసత్యపరాక్రమం) ఆక్రమించునప్పుడు త్రివిక్రముని వలె చేప్పినదివేఱు చేసినదివేఱుగాక యేక రూపముగా నుండు ననుట. (రామం సత్యపరాక్రమం) ఇతరులనుజంపునప్పుడు ఈతఁడాయుధమెత్తవలయుననునది లేదు. పరాక్రమించవలయుననునది లేదు॥ శ్లో॥ ౬౬ "హతాన్యేకేనరామేణ" అనియు॥ శ్లో॥ ౬౭ "రామబాణాభిహతోభృశార్తశ్చా

హాములు, కైత్తొழுకిఱ్ఱండ = స్తుతియింపఁగా వెలుఁగుచున్న. (ఇట్టివిపరమాత్మ.)

౬౩ యదివా = లేనియెడల = స్వయం = తాను, రావణః = రావణుఁడు-అనఁగా రావణునితమ్ముని మాత్రమేకాదు రావణుఁడేవచ్చి శరణుచొచ్చినను రక్షింతును. అనిరామునివాక్యము.

౬౪ అనుజానామి = అనుజ్ఞ యిచ్చుచున్నాను. గచ్ఛ = పొమ్ము. శ్రీరాముఁడు యుద్ధమునందునిరాయుధుఁడైన రావణునిఁజూచి చెప్పినవచనము.

౬౫ ఉళఁదొట్టు = అనుకూలించునేమోయనిహృదయపరిక్షచేసి.

౬౬ ఏకేన = ఒక్కరుఁడగు, రామేణ = శ్రీరామునిచేత, హతాని = (పదునాలుగువేలరాక్షసులసమూహములు)చంపఁబడెను. రాక్షసులుపదునాలుగువేలమందిగా ఉన్నప్పటికిని రాముఁడొక్కరుఁడేవారలసంహరించెననుట.

౬౭ వీరః = శూరుఁడగురావణుఁడు, రామబాణాభిహతః = శ్రీరామునిబాణములచేత ప్రహరింపఁబడినవాఁడై, భృశార్తః = మిక్కిలి పీడితుఁడై, చచాల = సంచ

లు చాపంచ ముమోచవీరకః" అనియు ॥ శ్లో ॥ ౬౫ "శ్రీమాన్ సుఖసుప్తఃప రంతపః" అనియు చెప్పఁబడియుండు ప్రకారము సౌందర్యమును ప్రయత్నమును సాధనములుగాఁ గొనియే వారల నశింపఁ జేయును. [వసిష్ఠోపి యనుపదమున కవతారిక దెల్పుచున్నారు] ఏవిధముగానైన సీతనఁదీసికొని పోవుటకొఱకే ప్రయత్నించుటవలన మిగుల పొందికగాఁ జెప్పునట్టి యీమాట విశ్వసనీయమాయనఁగాఁ జెప్పుచున్నాఁడు. (వసిష్ఠోపి) సర్వజ్ఞుఁడైపరమర్షి యగు శ్రీవసిష్ఠభగవానుఁడునుఎఱుంగును. (వసిష్ఠః) స్వకార్యపరుఁడనైవచ్చిననన్నుఁగాక॥శ్లో॥౬౬ "సతేహంపితురాచార్యః" అన్నట్లునీకార్యమునకు పురుషకారిన్యైనిలిచినీకాప్తుఁడునైయుండువసిష్ఠునినడుగరాదా (వసిష్ఠః) వసియనునదిసప్తమ్యంతమగునేని ॥ శ్లో॥ ౭౦ "కులగురుర్భగవాన్వసిష్ఠః" అని చెప్పియుండుటవలన నాయెడలస్నిగ్ధుఁడైమీయొక్క హితమునందు నిలుకడగానుండెడు వాఁడుకాఁడా॥ శ్లో ॥ ౭౧ "ఇదంహోయాజ్యానాం" అని మురారి చెప్పియున్నాఁడుగదా. [వసిష్ఠపదమునకు క్రియఁగూర్చి యుపన్యసించుటకై యవతారిక] నీవును ఇక్ష్వాకుకులజాతుఁడైనందున నీకునందులో నంతర్భావము సంభవించునేయనఁగాఁజెప్పుచున్నాఁడు (వసిష్ఠోపివేత్తి) ఆమర్యాదఁజెఱుపుకొని యాతనిపుత్రాదులనుజంపి యాతనిసురభిని పట్టుకొనిపోయి యాతనితోయుద్ధముచేసి పరిభవము నొంది విరోధము సంపాదించుకొనియుండు నాకుఁగానచ్చియబద్ధముచెప్పఁడు. అట్టివానినడిగి తెలిసికొనుము. అపిశబ్దమునేనే కాను ఈతఁడును ఎఱుంగును అనిసముచ్చయమునుదెల్పును. లేక. అపిశ

---

లించెను (అంతియకాక) చాపంచము మోచ=ధనుస్సును కూడ వదలిపెట్టెను.

౬౫ శ్రీమాన్ = శ్రీమంతుఁడగు రాముఁడు, సుఖసుప్తః=సుఖముగానిద్రించుచు, పరంతపః=శత్రువులనునశింపఁజేయువాఁడు.

౬౬ సః=అట్లుప్రసిద్ధుఁడగు. అహం=నేను, తే = నీయొక్క, పితుః=తండ్రికి, ఆచార్యః=గురుఁడను.

౭౦ భగవాన్ = త్రికాలజ్ఞానసంపన్నుఁడగు, వసిష్ఠః=వసిష్ఠుఁడు, కులగురుః= ఇక్ష్వాకు కులమునకు కులక్రమాగతుఁడైన గురువు.

౭౧ ఇదంహోయాజ్యానాం = యజ్ఞముసేయుమీకులముగౌరవముఁజెందుట ఈవసిష్ఠునివలనఁగదా అనిభావము.

ద్ధము విరోధమును దెల్పుచున్నది. అట్లయ్యేనేని నాకువిరోధియగునీతఁ డు నెట్లంగుననుట. [మహాతేజాః అనుపదమున కవతారిక] ఇతరులగు ఋషులకంటె వీనికాధిక్యమేమనఁగా (మహాతేజాః) సరస్వతికి వల్లభుఁడగు బ్రహ్మకుఁబుత్రుఁడై స్వయోగసిద్ధజ్ఞానముగలిగి యందువలన సంపాదితమగు గౌరవము గలవాఁడనుట. (మహాతేజాః) లోకనాథుండగుపురుషోత్తముండును దనపాదములయందు వ్రాలునట్టి మాహాత్మ్యము గలవాఁడు. (మహాతేజాః) ॥ శ్లో ॥ ౭౨ "కౌశికోయశసాంనిధిః" అన్నట్లు లోకులపొగడికలకువిషయమగు నేనును। శ్లో॥ ౭౩ "వసిష్ఠోమామేవంవదతు" అనియు ॥ శ్లో॥ ౭౪ "సత్యంచకారబ్రహ్మర్షిరేవమస్త్వితిచాబ్రవీత్" అనియుఁజెప్పినట్లు ఆతనివాక్కుచే బ్రహ్మర్షి పట్టమును బహుమానమును బొందినవాఁడననెడి విశేషగౌరవముగలవాఁడు. ఈవిధముచేత నీకంటెఁ బెద్దయయినను॥ శ్లో॥ ౭౫ "తేషాంతేజోవిశేషేణ ప్రత్యవాయోనవిద్యతే" అని చెప్పి యుండుటంబట్టి నీకొఱకబద్ధము చెప్పినను చెప్పవచ్చునేయనఁగా (మహాతేజాః)॥శ్లో॥ ౭౬ "సత్యధర్మపరాయణః" అనియు॥ శ్రు॥ ౭౭ "సత్యం వదధర్మంచర" అనియుచెప్పినట్లు తాను సత్యమును హితమును అనుష్ఠించి పరులచే ననుష్ఠింపఁజేయునట్టి మహాతేజస్వియై పెద్దతపస్వియగునంతటివాఁడు తేజోహానికలుగునటులఅసత్యముపల్కునా. [మహాతేజాః] ॥శ్లో॥ ౭౮ "ధిగ్బలంక్షత్రియబలంబ్రహ్మతేజోబలంబలం" అనునట్లు నిరవధిక బ్రహ్మతేజ

---

౭౨ కౌశికః=విశ్వామిత్రమహర్షి, యశసాం=పొగడికలకు, నిధిః-ఉనికిపట్టు.

౭౩ వసిష్ఠః=వసిష్ఠమహర్షి, మాం=నన్ను, ఏవం-ఇట్లు-అనఁగా బ్రహ్మర్షి యఁగా, వదతు=వచియించుఁగాత.

౭౪ బ్రహ్మర్షిః=బ్రహ్మర్షి యగువసిష్ఠుఁడు, సత్యం=యథార్థముగ, చకార=చేసెను, ఏవమ్=ఇట్లు, అస్తు=అగుఁగాక, ఇతిచ=ఇట్లనియు, అబ్రవీత్=చెప్పెను.

౭౫ తేషాం=అట్టివారలకు, తేజోవిశేషేణ=మాహాత్మ్యాతిశయముచేత, ప్రత్యవాయః=బాధకము, నవిద్యతే=లేదు.

౭౬ సత్య=సత్యమందును, ధర్మ=ధర్మమందును, పరాయణః=తత్పరుఁడు.

౭౭ సత్యం=యథార్థమును, వద-చెప్పుము. ధర్మం=ధర్మమును, చర=నడుపు.

౭౮ క్షత్రియబలం=క్షత్రియులయొక్కబలము, ధిక్ బలమ్=ఉపయోగములేని

స్సుగలవాఁడు. [యే చేమే తపసిస్థితాః అనువాక్యమునకు తాత్పరిక] అట్లు పెద్ద వాఁడు గానుండినను నాకు నీకును వివాదము కలిగెనేని తనకుహానిసంభవించునటులుండినను ॥ శ్రు ॥ ౨౯ "యద్బ్రాహ్మణశ్చా బ్రాహ్మణశ్చప్రశ్నమేయాతాం బ్రాహ్మణాయాధిబ్రూయాత్" అనియు॥ శ్లో॥ ౩౦ "బ్రాహ్మణార్థే గవార్థే వా సమ్యక్ ప్రాణాన్ పరిత్యజేత్" అనియు చెప్పఁబడి యుండునట్లు బ్రహ్మఋషియగు నీపక్షముగ మాటలాడుదునుగాని క్షత్రియుఁడగు నాపక్షముగ మాటలాడుదునా, అని యంటివేని (యే చేమే తపసిస్థితాః) రాజుయొక్క గౌరవమునుగాంచి వారలయిష్టానుగుణముగా సుఖప్రీతి మాటలుచెప్పెడునట్టి వారమగుమమ్మునుగాక శుష్కపత్రభోజనులగువీరలనడుగుము. (ఇమేతపసిస్థితాః)॥ శ్లో॥ ౩౧ "ఊనషోడశవర్షః" అన్నట్లు ఆతనికివయఃపరిపూర్తి లేమింజేసి ఆతని యోగ్యతనుగుఱించి సందేహింపవలవదు॥ శ్రు॥ ౩౨ "తస్యధీరాః పరిజానంతియోనిం" అనినట్లు ఆతనియొక్క జన్మరహస్య జ్ఞానము గలవారగు వీరిని యడుగుమనిభావము. (ఇమే) పులస్త్యుఁడు, అగస్త్యుఁడు, పరాశరుఁడు, పారాశర్యుఁడు, అని చెప్పగాఁ బ్రసిద్ధులయి యాచార్యపదము నిర్వహించుకొనుచుఁ దిరుగుచున్నవారలుగాక వీరని నిర్దేశించిచెప్పుటకుఁగూడ నైతిలేనటులు ఏకాంతశీలురగుచుఁ బ్రసిద్ధిలేక యుండువారలు. నేనును శ్రీవసిష్ఠ భగవానులు

---

బలను, బ్రహ్మతేజోబలం = బ్రహ్మతేజస్సువలనఁ గలిగిన బలము, బలమ్ = శ్రేష్ఠమగు బలము.

౨౯ బ్రాహ్మణశ్చ = బ్రాహ్మణుఁడును, అబ్రాహ్మణశ్చ = బ్రాహ్మణభిన్నుఁడును యత్ ప్రశ్నమేయాతాం - ప్రశ్ననుగుఱించియేతెంచిరేని, బ్రాహ్మణాయ = బ్రాహ్మణునికొఱకు, అధిబ్రూయాత్ . అధికముగ చెప్పనగును.

౩౦ బ్రాహ్మణార్థే = బ్రాహ్మణునికొఱకును, గవార్థేవా = గోవుకొఱకును సమ్యక్ = బాగుగా, ప్రాణాన్ = ప్రాణములను, పరిత్యజేత్ = విడువనగును.

౩౧ ఊన = తక్కువైన, షోడశవర్షః = పదునాఱుసంవత్సరములుగలవాఁడు.

౩౨ తస్య = ఆతనియొక్క, యోనిం = జగత్కారణత్వమును, ధీరాః = పండితులు, పరిజానంతి = చక్కగానెఱుంగుదురు.

మాత్రమేగాక వీరలు నెఱింగియున్నారు. అనిభావము. (ఇమే) వీరియొక్క వైలక్షణ్యమునేనుపపాదింపవలయునా? నరసినతలలును, వంగికేడుగడ్డములును, నీరసమైనతోలును, శుష్కించిన దేహములును, ఎంచేడువ్రేళ్లును, జపించెడినోరును, కాఱుచున్నకన్నీరును, మాఱనిభగవదనుసంధానమును, పులకాంకితదేహములును గలిగియుండెడి యునికిం జూడఁగాఁ దెలియదా? ॥శ్లో॥ ౮౩ "ఆహ్లాదశీతనేత్రాంబుఃపుళకీకృతగాత్రవాన్। సదా పరగుణావిష్టో ద్రష్టవ్యస్సర్వదేహిభిః" అన్నట్టిరీతిగలవారుగదా వీరు. (ఇమే) వీరలీవిధముగ నిదంశబ్దముచేతనంగుళీనిర్దేశముచేసి చూపఁదగువారుగానివారుకుఁ-చేతఁజెప్పుటకువాఙ్మనస్సులకునుగోచరులుగారు. (ఇమే)॥ ద్ర ॥ ౮౪ "శిరియనెన్ను ఎన్నిళం శింగత్తైయుకప్పేల్ కండాయిశిరుమైయిన్ వార్తైమావలియుడచ్చెన్నుకేళ్" అన్నట్లు దూరస్థుఁడగు నాకుఁనివద్దకుఁ బోయియడుగ నావశ్యకత లేకుండునటులు ఇచ్చటనె సన్నిహితులయియుండఁగంటిమికదా. (ఇమే) మహాబలివలెనాసురప్రకృతులుగాకపరమ సత్త్వనిష్ఠులైన ఋషులుగానుండఁగంటిమే. (ఇమే) నావలెను శ్రీవసిష్ఠ భగవానునివలెను ఒకరిద్దఱుగాక ॥ శ్లో ॥ ౮౫ "భూయసాంస్యాద్బలీయస్త్వం" అనునట్లు వీరుపలుగురుగా నుండుటయు నీకు విశ్వాసహేతువు

---

౮౩. ఆహ్లాద = సంతోషముచేతఁగలిగిన, శీత = చల్లనైన, నేత్రాంబుః = కన్నీళ్లు గలిగిన వాఁడును, పుళకీకృత = పులకలుగ్రమ్మిన, గాత్రవాన్ = శరీరము గలవాఁడును, సదా = ఎల్లప్పుడును, పర = పరమాత్మయొక్క, గుణ = గుణముల యొక్క, ఆవిష్టః = ఆవేశముగలవాఁడును అగుపరమైకాంతి, సర్వదేహిభిః = ఎల్ల శరీరధారులచేతను, ద్రష్టవ్యః = చూడఁదగినవాఁడు — గౌరవింపఁదగినవాఁడనుట.

౮౪. శిరియనెన్ను = చిన్నవాఁడని, ఎన్నిళంసింగత్తై - నాచిన్ని బాలసింహమును. (అనఁగా సింగపుపిల్లవంటి నాచిన్నికృష్ణుని) ఇకప్పేల్ కండాయి = అలక్ష్యముసేయవద్దు. శిరుమైయిన్ వార్తై = చిన్నవానివృత్తాంతము, మావలియుడచ్చెన్ను = మహాబలి చక్రవర్తివద్దకుఁబోయి, కేళ్ = అడుగుము.

౮౫. భూయసాం = అనేకులకు, బలీయస్త్వం = ప్రాబల్యము, స్యాత్ = అగును. అనఁగానేకులుచెప్పినదిదృఢమనుట.

గా దా. [తపస్సిద్ధితాః అను వాక్యమునకు అవతారిక] వీరుపలుగురగుట వలనఁ బ్రయోజన మేమి అసత్యమాడనట్టి ధార్మికులుగానుండ వలయునే యనఁగా. (తపస్సిద్ధితాః) అనుచున్నాఁడు॥ శ్లో॥ ౧౬ "తపోదానంతపస్స త్యంతపోధర్మః ప్రతిష్ఠితః" అన్నప్రకారము ఎల్లప్పుడు తపఃపరులయినం దునఁబరమధార్మికులగుదురనుట. (తపస్సిద్ధితాః) భగవదీయమైనిత్యమగు నాత్మవస్తువునకుహితమును వెదకుచుఅల్పమునస్థిరమునగుశరీరమునందాశ లేనివారు. (తపస్సిద్ధితాః)॥ శ్లో॥ ౧౭ "హుతమిష్టంచతప్తంచధర్మశ్చాయం కులస్యతే। గృహాత్ప్రతినివర్తంతేపూర్ణకామాయదర్థినః" అన్నట్లు అతి థులను అభ్యాగతులను సంతోషపఱుచుటయె ధర్మమనియుండెడి వారల నుట. (తపస్సిద్ధితాః) తపశ్శబ్దవాచ్యంబగు నర్థత్రయమందును నిష్ఠగలిగి యుండు వారలనుట. ఎట్లనిన తపసంతాపే అనుటచేత సంతాపమర్థమ గునప్పుడు॥ శ్రు॥ "యజ్ఞేనదానేనతపసా" అనియు॥ శ్లో॥ ౧౮ "కర్మయో గస్తపస్తీర్థదాన యజ్ఞాదిసేవనం" అనియుఁ జెప్పఁబడినప్రకారము జ్ఞాన భక్తుల కంగమగు కర్మయోగమందు నిష్ఠితులగువారని భావము. లేక. తపఆలోచనేయనుటచేత ఆలోచనయర్థమగునప్పుడు॥ శ్లో॥ ౧౯ "ఆత్మానం

---

౧౬. దానం=ఈవి, తపః=తపస్సు. సత్యం = సత్యము, తపః=తపస్సు. ప్రతిష్ఠితః=నిలుకడగానుండెడి, ధర్మః=ధర్మము, తపః=తపస్సు. అనిచెప్పబడును.

౧౭. అర్థినః = యాచకులు, పూర్ణకామాః = పరిపూర్ణమనోరథులయి, గృహాత్ = ఇంటినుండి, ప్రతినివర్తంతే ఇతియత్ = మరలుచున్నారనునదియేది కలదో. (తత్=అది,) హుతం=హోమమును. ఇష్టంచ=యాగమును, తప్తంచ =తపస్సును, అయం=ఈ, తే=నీయొక్క, కులస్య=వంశమునకు, ధర్మశ్చ=ధర్మ మును, అగును.

౧౮. తపః=తపస్సు, తీర్థ= పుణ్యక్షేత్రవాసము, దాన = సత్పాత్రములకు నిచ్చుటయును, యజ్ఞాదిసేవనం = యజ్ఞములు మొదలగునవిచేయుటయును, కర్మ యోగః=కర్మయోగమగును.

౧౯. ఆత్మానం=జీవాత్మను,తత్వతః=యథార్థముగ—అనఁగాప్రకృతివిలక్ష ణుఁడనియు జ్ఞానానందమయుఁడనియు, జ్ఞాత్వా=ఎఱిఁగి,

తత్వతోజ్ఞాత్వా" అనియు ॥ శ్లో ॥ ౯౦ "ఆత్మయాథాత్మ్యజ్ఞానపూర్వకం" అనియుఁజెప్పెడిరీతిని ఆత్మజ్ఞానరూపమగు జ్ఞానయోగమునందు నిష్ఠితులనియు భావము. లేక. తప ఐశ్వర్యే అనుటవలన ఐశ్వర్య మర్థమగు నప్పుడు॥ శ్లో॥ ౯౧ "ప్రశాసితారంసర్వేషామ్" అనియు॥శ్రు॥౯౨ "యేచేమేరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే" అనియు ॥ శ్రు ॥ ౯౩ "పరమం యోమహత్తపః" అనియుఁజెప్పెడిప్రకారము సర్వమును నియమించువాఁడయి తపశ్శబ్దవాచ్యుఁడగు పరమాత్మవిషయమందు జ్ఞానభక్తియోగనిష్ఠగలవారనియు భావము. లేక.(తపస్స్థితాః) వాచికతపోరూపమగు స్వాధ్యాయమందు నిష్ఠితులనియు భావము. లేక.(తపస్స్థితాః)* పరభక్తిపరజ్ఞానపరమభక్తులుగలవారనియు భావము. లేక (తపస్స్థితాః) అనఁగా॥శ్లో॥ ౯౪ "తస్మాన్న్యాసమేషాం తపసామతిరిక్తమాహుః" అనియు॥శ్లో॥౯౫ "తేషాంతు తపసాం న్యాసమతిరిక్తం తపశ్శ్రుతం" అనియుఁజెప్పఁబడినరీతిగా అన్నిటిని మించిన తపస్సగు ప్రపత్తి నిష్ఠగలవారు అని భావము. ఈశ్లోకము చేత ఊనషోడశవర్షః అనెడిశ్లోకమునకుఉత్తరమియ్యఁబడెను. పశ్యామి

---

౯౦. ఆత్మయాథాత్మ్యజ్ఞాన=జీవాత్మ అనన్యార్హశరణత్వమును, అనన్యభోగ్యత్వమును గలది యనియెడియెఱుకయొ, పూర్వకం= పురస్సరముగనుండునట్లు.

౯౧. సర్వేషాం=ఎల్లవారికి, ప్రశాసితారం = నియామకుఁడైనవాని.

౯౨. అరణ్యే = అడవియందలి, యేచేమే = ఏయిట్టిఋషులు, శ్రద్ధా = శ్రద్ధాశబ్దవాచ్యమగు పరమాత్మను, తపఇత్యుపాసతే= తపస్సనియుపాసించెదరో.

౯౩. యః=ఏపరమాత్మ, పరమం=సర్వోత్కృష్టమగు, తపః=తపస్సో.

శ్లో. * పరభక్తిరదృష్టార్థప్రత్యక్షాభినివేశనం
పరజ్ఞానంతుతస్యైవసాక్షాత్కారపరిస్ఫుటః
పునర్విశ్లేషభీరుత్వంపరమాభక్తిరుచ్యతే

౯౪. తస్మాత్ =అట్లగుటచేత,ఏషాంతపసాం= ఈతపస్సులలోపల, న్యాసం = ప్రపత్తిని, అతిరిక్తం=అతిశయించినదిగా, ఆహుః=చెప్పుదురు.

౯౫. తేషాంతపసాంతు=ఆతపస్సులలోపల, న్యాసం=ప్రపత్తి, అతిరిక్తం= అతిశయించినదియగు , తపః=తపస్సుగా, శ్రుతం= వినికిచేయఁబడినది—అనఁగా చెప్పఁబడెనుట.

యని బాహ్యచక్షువుచేతనీవుచూచునది ప్రత్యక్షముకాదు. యోగపరిశుద్ధ మగు నాంతరచక్షువుచేత నేను చూచునది ప్రత్యక్షము. అని అహంవేద్మి యనుటచేఁజెప్పఁబడెను. ఊనషోడశవర్షః అనిపరువమునుగుఱించిచుల కనగానెంచవద్దు. విరోధినిరసనక్షముఁడగుటవలనఁ బెద్దవాఁడే యగునని మహాత్మానమనుటచేఁజెప్పఁబడెను. మేరామః అని నీయొక్క మమకార ములో నాతనినడఁగించుకొనుటకు శక్యముగాదు॥ శ్లో॥ ౯౬ "లోకాభి రామః" అనిసర్వలోకశరణ్యుఁడయ్యెగదాయాతఁడుండుననుట కేవలరామ మనుటచేఁజెప్పఁబడెను. రాజీవలోచనః అనిప్రొద్దుపోవుటకుముందే నిద్రిం చువాఁడునిశాచరులతోఁబోరుటకుధీరుఁడు గాఁడనితలఁచియుండవద్దు॥ శ్లో॥ ౯౭ "సుఖసుప్తఃపరంతపః" అన్నట్లుఆనిద్రయేశత్రులనునాశముసేయు నట్లు నిత్యపరాక్రముఁడుగానుండుననిసత్యపరాక్రమమనుటచేతఁ జెప్పఁబ డెను. అస్యరాక్షసైః అన్నట్లు ఈతఁడో ఒక్కరుఁడు, వారలనేకులు, ఈతఁడుమనుష్యుఁడు, వారలురాక్షసులు అనితలఁపవలదు ॥ ద్ర ॥ ౯౮ "ఉదుక్కైయశురరుయిరెల్లాముండవొరువన్" అనియు॥ద్ర॥ ౯౯ "తిణ్ణొళ శురరై త్తేయవళర్కిన్డాన్" అనియు చెప్పఁబడియుండుప్రకారము కోటి మంది రాక్షసులకును ఈతఁడొకఁడే తగియుండుననుట వీనిలోనేకవచ ముచేతను ధర్మినిర్దేశముచేతను దెల్పఁబడుచున్నది. పశ్యామియను నేకవ చనముచేత నీవొక్కరుఁడవే యీతనియయోగ్యతను దెల్పుటకుఁదగియుం డెదవు అనియు వసిష్ఠోపి యేచేమే తపసిస్థితాః అని చెప్పుటచేత నాతని యోగ్యతను దెల్పుటకు అనేకులు గుంపులుగానున్నారనియుఁ దెల్పఁబడు

---

౯౬. లోక=జనులకు, అభిరామః=మనోహరుఁడు.

౯౭. సుఖసుప్తః = సుఖముగనిద్రించుచున్నవాఁడై, పరంతపః = శత్రులను తపింపఁజేయువాఁడు.

౯౮. ఉదుక్కై=అంతస్సారముగల, అశురర్=రాక్షసులయొక్క, ఉయిరెల్లాం=ప్రాణములనన్నింటిని, ఉండ=పరిగ్రహించిన, ఒరువన్=ఒక్కరుఁడు.

౯౯. తిణ్ణోళ్=ధృఢముగల, అశురరుయిర్=రాక్షసులప్రాణములు, తేయ=నశించునటులు, వళరుకిన్డాన్=వృద్ధిఁబొందుచున్నవాఁడు.

చున్నది. ఏతావతా ఈప్రకారముగ నీశ్లోకము ఆ శ్లోకమునకును త్తరము గానున్నది. శ్రీకృష్ణసూరిచరణౌ శరణంప్రపద్యే.

ఇది తనిశ్లోకీయను శ్రీరామాయణశ్లోకరత్నావళియందుఅహంవేద్మియను శ్లోకముయొక్క యుపన్యాసముసంపూర్ణము.





శ్రీరామభద్రాయనమః.

విశ్వామిత్రమహర్షి రాక్షసులను సంహరించుటకు శ్రీరామునిఁదనతోడనంపుమనియడుగఁగా ధశరథుఁడుమిగులసంకటపడి రామునంపఁదగదని యీక్రింది శ్లోకముచేతనాతనికిఁదెల్పుచున్నాఁడు ఇది శ్రీరామాయణములో నిరువదవ సర్గములోనిది.

శ్లోకము॥ ఊనషోడశవర్షోమేరామో రాజీవలోచనః।
నయుద్ధయోగ్యతామస్యపశ్యామిసహరాక్షసైః॥ ౨॥

టీ॥ మే=నాయొక్క, (కుమారుఁడగు) రామః=శ్రీరాముఁడు,ఊన...ర్షః= ఊన=కొఱవడిన, షోడశవర్షః=పదునాఱు సంవత్సరములుగలవాఁడు. కొంచెము తక్కువగా పదియాఱేండ్లప్రాయమువాఁడు అనఁగావ్యవహార జ్ఞానముపదియాఱేండ్లకుఁ బిమ్మటనేకాని కలుగదుగనుక వ్యవహారజ్ఞానములేని పసివాఁడనుట. రాజీవలోచనః=తామర ఱేకులవంటికన్నులుగలవాఁడు. అస్య = ఈతనికి, రాక్షసైః= రక్కసులతోడ, యుద్ధయోగ్యతాం=యుద్ధముచేయుసామర్థ్యమును, నపశ్యామి= కనుఁగొనను —అనఁగా లేదని యెంచెదననుట.

[ఈశ్లోకమునకవతారిక] విశ్వామిత్రమహర్షి ॥ శ్లో ॥ ౧ "యజ్ఞవిఘ్నకరంహన్యాం" అనియొడి శ్రీరాముని సంకల్పము నెఱింగిన వాఁడుగానతనయొక్క యజ్ఞవిఘ్నములనుఆతనిఁగొని తొలఁగించుకొనవచ్చునని యెంచి శ్రీరామచంద్రునియుద్ధమున కంపవలయుననిదశరథుని బ్రార్థింపనాతఁడును శ్రీరామునియందలి వాత్సల్యముచేత నంతరంగముగలంగి ॥ ద్ర॥ ౨ "మయంగుమాల్" అన్నట్లు ప్రేమాంధుఁడై వ్యాకులతఁ జెంది

౧. యజ్ఞ=యాగమునకు, విఘ్నకరం= విఘ్నముసేయువానిని, హన్యాం= చంపెదను.

౨. మయంగుం= మోహించును. ఆల్ = ఆశ్చర్యము.

"అహంవేద్మిమహాత్మానం" అని ఋషియుగ్గడించి చెప్పిన శ్లోకమువిన స్నవకుఁ దగులకయు కుమారునియొక్క పరువమునందలి మాధుర్యమును గాంచి యాతనివిడువలేక సంభ్రమించు చున్నాఁడు.

(ఊనషోడశవర్షః)ఇంతకాలమువరకు పదునాఱేండ్లునిండినవికావు. శ్లో॥ 3॥ "క్షీరకంఠశ్చరామభద్రః" అన్నట్లుపాలుగాఱు పరువమునందే యొకఁడు యుద్ధము సేయశక్తుండగునేయని చెప్పుచున్నాఁడు. (ఊనషోడశవర్షః) శ్లో॥ ౪ "బాలఆషోడశాద్వర్షాత్ పౌగండశ్చేతికీర్త్యతే" అనియెడి మన్వాదివచన ప్రకారము పదునాఱు సంవత్సరములకు లోపడి యుండువాఁడు బాలుఁడును అప్రాప్తవ్యవహారుండునై యుండుటంజేసి మఱియొకని సహాయ మపేక్షించునుగాన ॥ శ్లో ॥ ౫ "చతురంగసమాయుక్తం మయాసహచతంనయ" అన్నట్లు నన్నును చతురంగ బలములను గూర్చుకొని పోదువుగాని యితనినొంటరిగాఁ గొనిపోకుము. అట్లు కొని పోతివేని ప్రయోజనములేదు. (ఊనషోడశవర్షః)॥ శ్లో ॥ ౬ "బాలోహ్యకృతవిద్యశ్చనచ వేత్తిబలాబలం । నచాస్త్రబలసంపన్నోనచయుద్ధవిశారదః" అన్నట్లు ఈతనిపరువమోబాల్యము. మఱిధనుర్వేదమధికరించినవాఁడునుగాఁడు. సేనలోని యెక్కువతక్కువలను ఎఱుంగఁడు. ఈతఁడూరకుండినను ఈతనిశక్తి యపేక్షించక తనకుఁదానె పనులు నెఱవేర్చుకొని పోఁగల గొప్పయస్త్రముల యుపదేశముఁ బొందినవాఁడునుగాఁడు. మఱియు

---

3. రామభద్రః= శ్రీరాముఁడు, క్షీరకంఠశ్చ = కంఠమునందు తల్లిపాలు మాఱక యుండెడివాఁడు—అనఁగాఁ దల్లివద్ద చనుఁగుడుచుపరువముగలవాఁడు అనిభావము.

౪. ఆషోడశాత్ వర్షాత్ = పదునాఱుసంవత్సరములవరకు, బాలః= బాలుఁడు పౌగండశ్చేతి = పౌగండవయస్సు గలవాఁడనియు, కీర్త్యతే = చెప్పఁబడుచున్నాఁడు.

౫ చతురంగసమాయుక్తం = చతురంగబలముతోఁగూడినవానిఁగా, మయాచసహ= నాతోఁగూడ, తం= ఆరాముని, నయ= కొనిపొమ్ము.

౬. బాలోహి == శ్రీరాముఁడు బాలుఁడుగదా, అకృతవిద్యశ్చ = ధనుర్విద్యను నేర్చుకొననివాఁడు, బలాబలం = బలముగలదానిని బలములేనిదానిని,

యుద్ధముఁజేసియు వ్యూహములను దీర్చియు వాడుకపడినవాఁడుగాఁడు. ఈతనినాయుద్ధమునకుఁ గొనిపోవ నుద్యోగించెదవు. ఇదియేమియఘటితఘటనసేయయత్నించితివి. (ఊనషోడశవర్షః) పదునారుసంవత్సరములు పూర్ణములగుటకింకను గొన్నిసంవత్సరములు జరగవలసియున్నది. అన్ని సంవత్సరములయిన యనంతర మీఋషివచ్చియడిగనేని యేవిధమైననెప ముచెప్పియు తప్పించుకొనఁగూడదు. అట్లు సంప్రాప్తషోడశ వయస్కుని నశక్తుఁడనియుఁ జెప్పఁగూడదు. కానఁ దీసికొనియే పోవ్రను. అట్లు కాకుండుటచేత నింతటితో మనము తప్పించుకొని బ్రతుకఁగంటిమి. (ఊనషోడశవర్షః) ఊనశబ్దము ఆపరువమునందుఁ గొంచెము తక్కువను గనుపఱచు చున్నది. కనుక పదునైదున్నరయని యైనను పదునైదు ముప్పాతికయనియైనను గ్రహింపనగును. అనఁగాఁగొంచెమెచ్చు తక్కువగాఁ బదునారు సంవత్సరములనిభావము. ఈపదునారు సంవత్సరములును ॥ శ్లో ॥ ౭ "సమాద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే । భుంజానా మానుషాన్ భోగాన్సర్వ కామసమృద్ధినీ" అన్నట్లు వివాహమయినయనంతరము పండ్రెండు సంవత్సరములును గూడఁగా ఇరువదెనిమిది సంవత్సరములని తోచుచున్నది. అరణ్యమునకుఁబోయినప్పుడు॥శ్లో॥ ౮ "భర్తామమమహాతేజా వయసా పంచవింశకః । అష్టాదశహివర్షాణి

---

నచవేత్తి=ఎఱుఁగనుఎఱుఁగఁడు, అస్త్ర=బ్రహ్మాస్త్రాదులయొక్క, బల = బలము యొక్క, సంపన్నః =కలిమిగలవాఁడు— బ్రహ్మాస్త్రాదులగురుముఖముగనభ్యసించియందువలనఁగలిగినపరిపూర్ణబలముగలవాఁడు, నచ =కాఁడు, యుద్ధ=యుద్ధమునందు, విశారదః=సమర్థుఁడును, నచ= కాఁడు.

౭- తత్ర=ఆ యయోధ్యానగరమునందు, అహం= నేను, ద్వాదశసమాః = పండ్రెండేఁడ్లు, రాఘవస్య=శ్రీరామునియొక్క, నివేశనే= ఇంటియందు, మానుషాన్ భోగాన్=మనుష్యులవియైనభోగములను, భుంజానా=అనుభవించుచున్నదానను, సర్వకామసమృద్ధినీ=ఎల్లకోరికలనింపుగలదానను (అయిఉంటిని.)

౮. మహాతేజాః = గొప్పతేజస్సుగలవాఁడగు. మమ=నాయొక్క, భర్తా= పెనిమిటి, వయసా = ప్రాయముచేత, పంచవింశకః = ఇరువదేనింటినిగలవాఁడు (అనఁగానిరువదియైదేండ్లప్రాయముగలవాఁడనుట) మమ- నాయొక్క, జన్మని= ఉత్ప

మమజన్మనిగణ్యతే” అని శ్రీసీతాదేవియొక్క వచనమునుగనఁబడుచున్నది॥ శ్లో॥ ౯ “దశసప్తచవర్షాణితవజాతస్యపుత్రక। ఆసితానిప్రకాంక్షంత్యా మయాదుఃఖపరిక్షయం” [ఓశ్రీరామ] నీవు జన్మించినది మొదలుకొని నీవు కిరీటముధరించు పర్యంతము పదునేడు సంవత్సరములు క్లేశము తీరునను కొనుచుంటినియని శ్రీకౌసల్యాదేవియొక్క వాక్యమును గనఁబడుచున్నది. ఇరువదెనిమిదనుటకును ఇఱువదియైదనుటకును పదునేడనుటకును సామరస్యోపపత్తియెట్లనఁగా? ఇచ్చటకొందఱు దశసప్తచ యనువచనమును గొనిసమాధానము చెప్పిరి. అదియెట్లనఁగా ॥ శ్లో ॥ ౧౦ “ఏకాదశేషురాజన్యం” అను విధివాక్యముండుటవలనఁ బదునొకండవ సంవత్సరమునందు రాజకుమారునికుపనయనమగుటంజేసిద్విజన్మత్వముకలుగునుగాననదియు నొకజన్మమగుటచే నంతకుముందటి పదియునుద్రోపుడుచేసినఁ బదునేడు సంవత్సరములగును. అని నిర్వహించిరి, అట్లుచెప్పఁదగదు. ఏలయనఁగా ఈవాక్యము పుత్రప్రవాసజనితమైన దుఃఖముచేత నిర్విణ్ణురాలగుస్త్రీయొక్కవచనముగాన జన్మముమొదలుకొనిప్రథమజన్మమేదీనివలనఁ బోధింపఁబడును. శోకదశలోనొకస్త్రీ మిక్కిలి యవహితయై ధర్మశాస్త్రమను సంధించి పదింటినిత్రోపుడుచేసి ద్వితీయజన్మమును వివక్షించుననుటయనుచితముగాఁగను పట్టుటవలనను, ఇవియొకయాఱును పండ్రెండును పదు

---

త్తియందు, అనఁగాపుట్టినది మొదలు, అష్టాదశహివర్షాణి= పదునెనిమిదిసంవత్సరములు, గణ్యతే=లెక్కింపఁబడుచున్నవి అనఁగానేను పుట్టిపదునెనిమిది సంవత్సరములయ్యెననుట.

౯. పుత్రక = అనుకంపనీయుఁడగు నాకొడుకా, జాతస్యతవ = పుట్టినట్టి నీవిషయమై (అనఁగానీవు పుట్టినది మొదలు నీవిషయమయి) దుఃఖపరిక్షయం = దుఃఖములునశించుటను, ప్రకాంక్షంత్యా= ప్రతీక్షించుచున్న, మయా=నాచేత, దశ= పదియును, సప్తచ=ఏడును, వర్షాణి=వర్షములు, ఆసితాని, అధిష్ఠింపఁబడినవాయెను, జరపఁబడినవనుట అనగానీవుపుట్టినదిమొదలునాదుఃఖమెప్పుడుతొలఁగునోయని యీజరిగిన పదియేడేండ్లుకనుపెట్టి యుంటినని భావము.

౧౦. రాజన్యం = రాచకులమునందుఁ బుట్టినవానికుమారుని, ఏకాదశేషు = పదకొండవ సంవత్సరమందు (ఉపనీతునిఁ జేయవలయును.)

నెనిమిదియైదు పదునేడింటి కధికమగుటవలనను సరిపోసఁగదు. ఊనషోడశ యనుపదునాఱును సమాద్వాదశయను పండ్రెండునుగూడఁగానిరువదెని మిదియగును. ఉపనయనమయినపదునొండవసంవత్సరము మొదలుఆఱును సమాద్వాదశయను పండ్రెండును ఉపనయనమునకు మునుపటిపదియును చేరఁగా నిరువదెనిమిదగును. ఈ రెండును సామరస్యముగలవియైకనఁబడు టవలన నిరువదియైదను దానినిత్రోపుడుచేయవచ్చునే యనఁగా సామా న్యముగాఁగనఁబడుచున్నయూనషోడశశబ్దము "బాలోద్వాదశవర్షీయం" అనుసపవాద వచనముగలదియై యన్యథా సిద్ధమగుటచేతను "వయసా పంచవింశకః" అనువచనము సన్యాసిప్రతిపత్తిచే గౌరవ్యునిఁగా నెంచి యుపహితమై చెప్పిన సీతాదేవి వచనమగుటచేతను దశసప్తచయను వాక్యము తనతో విరోధించుటచేతను ఇరువదెనిమిదిని దృఢీకరించి యిరు వదియైదింటిని తృణీకరింపఁగూడదు. మఱియెట్లనఁగా ఇరువదేనింటిదెల్పు పంచవింశకఃఅనుదానినిసిద్ధాంతీకరించి ఊనషోడశయనుదానిని దశసప్త చయనుదానిని ఈవాక్యమునకుఁ దగినటుల యోజించుచున్నారము. ఎట్ల నఁగా. ఊనశబ్దము షోడశసంఖ్యా వైకల్యమును మాత్రమే చూపుచు వికలసంఖ్యయిదియనివిశేషించి తెలుపలేనిసామాన్యశబ్దమైయున్నది. దానికి విశేషాకాంక్ష సేయఁగా పండ్రెండవసంవత్సరమని తెలిసికొనవలయును. ఎట్లనఁగా రావణునికి హితముబోధించెడి మారీచుఁడు శ్రీరామునిబలము వెల్లడిసేయుప్రకరణములో "తానువిశ్వామిత్రుని యాగమునకు భంగము సేయ నా ఋషితనయాగమును రక్షించి కొనుటకు దశరథునివద్ద కేగి రామలక్ష్మణులఁ బంపుమని వేఁడఁగా ఆదశరథుండు తనచిన్ని కుమారులకు వయఃపరిపూర్తిలేమిని దెల్పఁగోరి బాలోద్వాదశవర్షోయ మకృతాస్త్రశ్చ రాఘవః అనిచెప్పెను. అట్టి బాలప్రాయమునందే శ్రీరాముఁడు నాత మ్మునిఁజంపి నన్నునుసముద్రములోనఁ గ్రోకెఱను" అని మారీచుఁడు చెప్పియున్నాఁడు. ఈవాక్యమువలనతకుఁ-వయగు సంవత్సరములునాలు గని యర్థము వివక్షింప వలసియున్నది. ఇట్లు నాలుగుసంవత్సరములచే

గాఁ ఇంతయగు పదునాలుసంవత్సరములును (అనఁగా పంద్రెండు సంవత్స
రములును) వివాహమైన యనంతరము సమాద్వాదశయను వాక్యముం
బట్టి పంద్రెండువర్షములును చేరి యిరువది నాల్గు వత్సరములుగడవఁగా
నిరువదియైదవది జరగుచున్నది యనియు దశసప్తచయను వాక్యములో
దశయనునది పదింటిని సప్తయనునది యేడింటిని చ యనును క్తసముచ్చా
యకము మఱియొక యేడింటిని దెల్పుచున్నవి. పదియేఁబదునాలుగునిరు
వది నాలుగుగడచి యిరువదైదవది జరగుచున్నది యనియు వ్యాహతము
లుగాఁదోఁచినమూడుచోట్లును ప్రమాణ యుక్తులచేత నవ్యాహతము
లయిసమరసను లగుచున్నవియనిసిద్ధాంతము. అయితేమిక్కిలి యెగుడు
దిగుడుగా ఊనషోడశవర్షః అని షోడశవర్షప్రసంగమేల? ఈతఁడే బాలో
ద్వాదశ వర్షోయం అనియు బాలోహ్యకృతవిద్యశ్చ యనియు కాకపక్ష
ధరం బాలం అనియు అనేకస్థలములయందుఁ జెప్పలేదా అనఁగా అట్లువచిం
యించుట నయుద్ధయోగ్యతామస్యపశ్యామి యని యుద్ధమునకుశక్తుఁడు
గాఁడనుట దెల్పుట కని యెంచ నగును. వాల్మీకి మహర్షి ॥ శ్లో ॥ "బాల
ఆషోడశాత్ వర్షాత్ పౌగండశ్చేతికీర్త్యతే" అనియెడి మను వచనమును
స్మరించి పదునాలువత్సరములునిండి ప్రాప్తవ్యవహారుఁడైన వానికిగదా
ప్రమాణముచేసి యుండు మేరకు వీనికి వీఁడు తగినవాఁడని యెఱుంగు
టయువీనికిఁగ్రిందటివాఁడువీఁడని తెలిసి కొనుటయు ఇతరసహాయమపే
క్షింపక మఱియొకయూరికిఁ బోవుటయు స్వతంత్రముగా యుద్ధమునకు
వెడలుటయును సంభవించును. అవి నిండనివానికిసంభవించవుగదా. అట్టి
వయఃపరిపూర్తిలేనివాని గుఱించియోయన్నవీనికి పెద్దలుఇతరులనియువీఁ
డువీనికుమారుఁడనియు పెద్దలనుపురస్కరించియే చెప్పవలసియున్నది. అట్ల
గుటవలన చతురంగ సమాయుక్తంమయాచ అన్నట్లునన్నునిర్వాహకుని
గాఁగూడఁ గొనిపొమ్ము వీనికిస్వతంత్రవ్యాపారక్షమత్వసిద్ధికానికాలము.
అని విశ్వామిత్రునకెఱింగించుకొనుటకై దశరథుఁడు చెప్పినట్లుఊనషోడశ
యనిచెప్పిరి. కానఉచితమే. (ఊనషోడశవర్షః) ఒకబుగ్గనదుమగా మఱియొక

బుగ్గను పాలుగారెడుపరువముగదా యిప్పుడీరామునకు. ఇట్లు॥ శ్లో॥ ౧౧ "కృతంతత్ క్షీరకంఠేన" అని బాల రామాయణమునందును జెప్పఁబడి యున్నది. మురారియును॥వ॥ "క్షీరకంఠశ్చ రామభద్రః" అని చెప్పియుండ లేదా. (ఊనషోడశవర్షః) మగవానికి యౌవనారంభసూచకమగు శ్మశ్రు రేఖయు నింతవరకీతని మొగంబునఁ గానరాదు. కూఁకటియుముడికందక యున్నది॥శ్లో॥౧౨ "కాకపక్షధరంవీరం" అనునటులనీవే చెప్పినరీతిని చలించుచున్న పిల్లజుట్టును దానందాల్చియున్న పుష్పమాలికలునుగలయీతని నా యుద్ధమునకుఁగొనిపోవుటయంటివేని॥ శ్లో॥ "తేజసాంహినవయస్సమీక్ష్యతే" అనియు॥ ద్ర॥ "శిరియనెన్ఱు ఎన్ణిళంశింగ త్తైయికక్షేల్ కండాయి" అనునట్లు పరువము బాల్యముగా నున్నదని యితని నశక్తునిఁగా నెంచవద్దు. నిప్పు కొంచెముగానున్నను కాల్చుటకు సమర్థమేగదా॥ శ్లో॥ ౧౩ "శక్తోహ్యేషమయాగుప్తోదివ్యేనస్వేనతేజసా" అవతారము నందుం డెడి ప్రీతిచేత స్వాభావికమగు తేజస్సును జాఱవిడిచి యున్నవాఁడైనను ఆదశయందు నేను సస్నేహముగ మంగళాశాసనము సేయఁ దేజః ప్రభావముచేతఁ దామసులనిరసించుటయందుశక్తుఁడైయుండును అనఁగా (మేరామః) అనుచున్నాఁడు. పరశుహస్తుఁడై ముయ్యేడుమారులుక్షత్రియశిరశ్ఛేదము సేయుచుఁ దిరిగిన మోటు పరశు రామునిఁగాఁ దలంచినాఁడుగదే. (మేరామః) నాయొక్క మమకారవిషయముండురీతియిట్టిది (మేరామః) ప్రబలమగునాఁకలిచే నన్నముతినఁబూనినవానిని చేయిపట్టుకొనువానివలె

---

౧౧. క్షీరకంఠేన = క్షీరకంఠుఁడగు రామునిచేత, (క్షీరకంఠుఁడు = తల్లిపాలుగొంతుక్రిందికిఁగూడదిగనిబాలప్రాయముగలవాఁడు) కృతం = చేయఁబడెను. అట్టియద్భుతకృత్యము పసివాఁడుగానుండియే చేసెననుట.

౧౨. కాకపక్ష = పిల్లజుట్టును, ధరం = ధరించినవాఁడును, బాలం = బాలుఁడునగు శ్రీరాముని.

౧౩. ఏషః = ఈరాముఁడు, మయా = నాచేత, గుప్తః = రక్షింపఁబడినవాఁడై, దివ్యేన = దేవసంబంధమయి, స్వేన = స్వకీయమగు, తేజసా = తేజస్సుచేత = శక్తోహి = రాక్షసులనిరసింపసమర్థుఁడగునుగదా.

శ్లో॥ ౧౪ "దుఃఖేనోత్పాదితశ్చాయం." అనియు ॥ ద్ర॥ ౧౫ "నెడుంగా లముంగణ్ణన్ సీణ్ మలర్ పాదంపరవి పెర్ఱ" అనియు చెప్పఁబడియుండురీతి యిరువదివేలయేండ్లు తాళియుండియొకకుమారుని గనిసుతముఖ కమలావలోకనము అనుభవించుచున్ననన్నుఁగాంచియు నీవీతనివేఱుచేసి తీసికొనిపోవుటధర్మమా (మే రామః) ౧౬ "అనుపహతాంవృత్తించరేత్" అనిగదా ఋషులకుఁ జెప్పి యున్నది. అయినందున నామమకారముచేత దూషితమగువస్తువునీకగునా (రామః) మూర్ధమునందుండుటయేస్వభావముగాఁగలయిందీవరమాలికను బిసికియెండలోఁబెట్టెడువారివలె॥ శ్లో॥ ౧౭ "ఏతదేవామృతందృష్ట్వాతృప్యంతి" అనియుఁ ॥ శ్లో॥ ౧౮ "నందామిపశ్యన్నపిదర్శనేన" అనియుఁ జెప్పినట్లు ఈవస్తువును కంటికింపుగాఁజూతురుగాక యుద్ధమునకుఁ గొనిపోవు వారునుగలరా. ఋషి - కొఱంత యేమియున్నది ॥ శ్లో॥ ౧౯ "రంజనీయస్యవిక్రమైః" అనియు॥ శ్లో॥ ౨౦ "రామమక్లిష్టకర్మాణమ్" అనియును ఈతఁడు యుద్ధము సేయునప్పుడు కొప్పు నఁదుఱిమిన పూలువాడకయు మొగమున చిఱుచెమటబిందువులు పొటమరింపకయు పగతులు వెనుకదీయునటులుశరీరసౌందర్యమొకవన్నెయధి

---

౧౪. అయం = ఈరాముఁడు, దుఃఖేన = కష్టనుచేత, ఉత్పాదితశ్చ = పుట్టింపఁబడెను. అనఁగా వ్రతోపవాసాదికష్టములనుభవించికన్నట్టికుమారుఁడనుట.

౧౫. నెడుంగాలం = బహుకాలము, కణ్ణన్ = కృష్ణమూర్తియొక్క, నీణ్ మలర్పాదం = నిడుపులైనట్టిపాదకమలములను, పరవి = స్తుతించి, పెర్ఱ = కన్నట్టి.

౧౬. అనుపహతాం = దోషరహితమయిన, వృత్తిం = వ్యాపారమునందు, చరేత్ = నడవవలయును.

౧౭. ఏతదేవ - ఈ, అమృతం = అమృతస్వరూపమును, దృష్ట్వా = చూచి, తృప్యంతి = తృప్తిఁబొందుచున్నారు.

౧౮. పశ్యన్నపి = చూచుచుండినను, దర్శనేన = ఇప్పుడుచూచుటచేత, నందామి = సంతోషించుచున్నాను.

౧౯. విక్రమైః = పరాక్రమములచేత = రంజనీయస్య = సంతోషింపఁదగినట్టివాఁడు (రాముఁడు)

౨౦. అక్లిష్టకర్మాణం = క్లేశములేకపనులుజరపెడు, రామం = శ్రీరాముని.

కమునై కనుపట్టుచుండుటమేమొకనియున్నారముగదా యనఁగా- రాజు-
రాజీవలోచనః అనుచున్నాఁడు. ఎండఁ జూడఁగానే విరిసి మొగ్గపగిలి
యల్లలాడుచున్నకన్నులతోడనెండలోనిల్చి పోరుటకుశక్తుఁడాయీతఁడు.
ఋషి - రాజీవలోచనః అని నీవే చెప్పితివిగదా. ఎండను గాంచఁగానే
తామర వికసించునటుల సేనను జూడఁగానే శ్రీరాముఁడు నుల్లసించిన
వాఁడైయుండునుగదా- రాజు- రాజీవం రక్తపద్మంస్యాత్ అనియున్నది
గాన నెఱ్ఱదామర రాజీవపదమునకర్థము. అదికంది యెఱ్ఱనై యుండును.
ఋషి-ఆయెఱుపా "రామో రక్తాంతలోచనః" అని॥ శ్లో॥౨౧ "కించిత్
భ్రూభంగలీలానియమితజలధిం"అనియుసముద్రమునీ రెండి మెరక నేలయగు
నట్లుకడకన్నులెఱ్ఱగాఁగాపగతులఁజంపునట్టి యెఱుపుగదాయది. రాజు-
(ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః)అవియున్నియు పరువమునిండి
ననగుఁగానిఇప్పుడు కాఁజాలవు.ఋషి-చాలనియెడలయెండచల్లారఁగానే
రాత్రియుద్ధము సేయుచున్నారము-రాజు-(రాజీవలోచనః)ప్రొద్దుపోవుట
యును సహింపకతత్క్షణమున మూసికొనునుగదా. ఈతఁడు బాల్యము
వలననిద్రింప వారలు నిశాచరులగుటంజేసి స్వతఃమాయ యధికమగును
గదా? ఇట్లుసంఘటింపఁ జేయుటయుక్తమా ॥ ద్ర ॥ ౨౨ "కింకిణివాయి
చ్చెయిదతామరైప్పూప్పోలే శెంగణ్ శిరుచ్చిరుదేయెమ్మేల్ ః ప్పరియావో"
అన్నట్లు నిద్రార్థకషాయరూషితములయిన యీనయనములకుఁ దామే
లక్ష్యమగునటులుప్రయత్నింపవలయునంతియకాక యిట్టిసౌందర్యముగల
యీతని యుద్ధమునకుంగొనిపోవువారునుగలరా?(రాజీవలోచనః) నీటఁ
బాసిన కమలము ఎండుసటులు నాయొక్క- అండవదలిపోయెనేని యాతని

---

౨౧. కించిత్ భ్రూభంగలీలానియమితజలధిం= కొంచెపుఁగనుబొమసైగచేతనె స్తంభించఁబడిన సముద్రముగలవాఁడు (రాముఁడు.)

౨౨. కింకిణివాయ్ = చిఱుగంటయొక్క నోటివలె, చెయిద= వికసించిన తామరైప్పూప్పోఁలే= తామరపువ్వువలె, శెంగణ్ = ఎఱ్ఱనైనకన్నులను, శిరుచ్చిరుదె = కొంచెముకొంచెము, ఎమ్మేల్ = నామీఁద, ః ప్పరియావో= ప్రసరింపఁజేయవా.

ముఖసౌందర్యము తగ్గిపోవును-ఋషి-॥ శ్లో ॥ ౨౩ "జితం తేపుండరీకాక్ష" అనియు ॥ ద్ర ॥ ౨౪ "తామరైక్కణ్ గళ్ కొండీరిదియాలో" అనియుఁజెప్పెడి ప్రకారముశత్రువులనోడింపఁజేయుటకుఁబరికర మచ్చటయున్నదే. అనఁగా- రాజు- (నయుద్ధ యోగ్యతామస్యపశ్యామి) అనుచున్నాఁడు. ఆకన్నుల యందమునం దనుకూలవర్గము ప్రేమించునుగాని యసుర వర్గ మనురాగపడునా. ఋషి- అసుర ప్రకృతియగు శూర్పణఖ పుండరీక విశాలాక్షుఁడని ప్రేమింపలేదా. అదియట్లుండమఱియొక పరికరముంగొని యిప్పుడునాపని కుపయోగింప అడ్డిమేమియనఁగా (అస్యయుద్ధయోగ్యతాంనపశ్యామి) అనుచున్నాఁడు. ఆశ్రయముండిననేగదా పరికరములపేక్షింపవలయు. (అస్య) పరువమునందలి మౌగ్ధ్యమాయిది శరీరమునందలి సౌకుమార్యమా యిట్టిది. ఇట్లుండెడి యీతనికిని యుద్ధమునకును ఏమియనుకూలతఁ గనిపెట్టితివి.(అస్య) ఇదంశబ్దము సన్నిహితమగు దేశముననుండి వర్తమానకాల సంబంధముగలదియగువస్తువును దెల్పును. ఆతఁడు దేశాంతరముననుండి యేనికూడ నసత్యములగు సాకులుచెప్పుచున్నానని యెంచవద్దు. ఇంటియందే సన్నిహితుఁడై యున్నవాఁడు ఆతని రప్పించిచూడుము అనుచున్నాఁడు. (అస్యయుద్ధయోగ్యతాం నపశ్యామి) శ్లో॥ ౨౫ "స్వపుత్రంమూర్ధ్న్యుపాఘ్రాయ"అన్నట్లుఅంకతలంబునఁగూరుచుండఁబెట్టుకొని యాదలముద్దిడుటకుఁదగినవాఁడు గానీయుద్ధమునకుం దగినవాఁడా (నయుద్ధయోగ్యతాంపశ్యామి)శ్లో॥౨౬ "బాలఃక్రీడనకైరివ"

---

౨౩. పుండరీకాక్ష = తెల్లదామరలవంటికన్నులుగలవాఁడా, తే=నీకు, జితం =జయముగలుగుఁగాక.

౨౪. తామరైక్కణ్ గళ్ కొండు=తామరరేకులవంటికన్నులఁగొని, ఈరిదియాలో=హింసించెదవో.

౨౫. స్వపుత్రం=తనకుమారుని, మూర్ధ్ని=ఔదలయందు, ఉపాఘ్రాయ= ఆఘ్రాణించి.

౨౬. బాలః=పసివాఁడు, క్రీడనకైరివ = ఆటలాడుకొనుటకుసాధనములగు బొమ్మలుమొదలగువానిచేతవలెనే.

అని చెప్పఁబడినట్లు క్రీడా పరికరములను గొనివిహరించు పరువము అంతియకాని ఇప్పుడీ రామచంద్రునికి యుద్ధము సేయఁదగిన పరువమాః (నపశ్యామి) ॥ శ్లో ॥ ౨౭ "అభినివేశవశీకృతచేతసాం బహువిదామపి సంభవతిశ్రమః" అన్నట్లు స్వకార్యపరుఁడైనందున నీకుఁ దోఁచదుగాన నాకన్నులు పెట్టుకొనిచూడుము తెలియును. (యుద్ధయోగ్యతాంనపశ్యామి) యుద్ధయోగ్యతనుగనఁబడుచి లేదనిమరలనసత్యమును చెప్పుచున్నాఁడవు. శ్లో॥౨౮ "రామో వ్రజతిసంగ్రామం గ్రామార్థేనగరస్యవా। గత్వాసౌమిత్రిసహితో నావిజిత్యనివర్తతే" అనియు! శ్లో॥౨౯ "సంగ్రామాత్పునరాగమ్య" అనియుఁ జెప్పఁబడి యున్నదిగాన ఆతఁడుపోని యుద్ధమునుగలదా యనఁగా (సహరాక్షసైః) విశేషనిషేధము చేసితినిగాక సామాన్య నిషేధము చేసితినాయనుచున్నాఁడు (రాక్షసైః) ॥ శ్లో॥ ౩౦ "కూటయుద్ధాహి రాక్షసాః" అన్నట్లు రాక్షసులుకపటయుద్ధముగాని చేయరు. ఈతఁడుధర్మయుద్ధముగాని చేసియెఱుఁగఁడు. కాన వీలుపడదని యనుచున్నాఁడనని యెఱుంగుము. [అస్య అనుచోట ఆపదమునకును ఏక వచనమునకును రాక్షసైఃఅనుచోటబహు వచనమునకును స్వారస్యముఁ దెల్పుచున్నారు] (అస్యరాక్షసైః) ఈతఁడోమనుష్యుఁడు. వారలోరాక్షసులు. ఈతఁడో ఒక్కఁడు. వారలో అనేకులు. అట్లగుటవలనను యోగ్యతలేదు.

శ్రీకృష్ణసూరిచరణౌశరణంప్రపద్యే.

---

౨౭. అభినివేశ = ఒకకార్యచేయవలయుననుముఖ్యమయినతలంపుచేత, వశీకృత = స్వాధీనముచేయఁబడిన, చేతసాం = హృదయముగలవారలగు, బహువిదామపి = విశేజ్ఞులగు వారలకును, శ్రమః = కష్టము, సంభవతి = కలుగుచున్నది.

౨౮. రామః = శ్రీరాముఁడు, గ్రామార్థే = గ్రామమునకొఱకైనను, నగరస్యవా = పట్టణముకొఱకైనను, సంగ్రామంవ్రజతి = యుద్ధమునకుఁ బోవుచున్నాఁడు, సౌమిత్రిసహితః = లక్ష్మణునితోఁగూడినవాఁడయి, గత్వా = పోయి, అవిజిత్య = జయింపక, ననివర్తతే = మరలఁడు.

౨౯. సంగ్రామాత్ = యుద్ధమునుండి, పునః = మరల, ఆగమ్య = వచ్చి.

౩౦. రాక్షసాః - రాక్షసులు, కూటయుద్ధాహి - కపటయుద్ధము సేయువారలుగదా.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణశ్లోకరత్నావళియందు ఊనషోడశయను శ్లోకముయొక్క యుపన్యాసముసంపూర్ణము.





శ్రీరామభద్రాయనమః.

వసిష్ఠమహర్షి చెప్పినంతట దశరథుఁడు సమాహితమనస్కుండై రామ
లక్ష్మణుల విశ్వామిత్రుని కర్పింపనాతఁడు వారలందీసికొని
పోయి సరయూతీరంబున నారాత్రిగడపిమఱునాటి
యుదయమున శ్రీరాముని ఈక్రిందిశ్లోకముచేత
నిద్రలేపుచున్నాఁడు. ఇదిబాలకాండ
ములో నిరువదిమూడవ
సర్గములోనిది.

శ్లోకము॥ కౌసల్యాసుప్రజారామపూర్వాసంధ్యాప్రవర్తతే।
ఉత్తిష్ఠనరశార్దూలకర్తవ్యందైవమాహ్నికం॥ 3॥

టీ॥ కౌసల్యా = కౌసల్యాదేవియొక్క, సుప్రజాః= మంచికుమారుఁడగు, రామ= ఓ శ్రీరాముఁడా, పూర్వాసంధ్యా = మొదటిసంజ, ప్రవర్తతే= ప్రవర్తించుచున్నది. నరశార్దూల= పురుషశ్రేష్ఠుఁడా, దైవం= దేవతాసంబంధమగు, ఆహ్నికం = దినకృత్యము, కర్తవ్యం= చేయఁదగినది. కాన. ఉత్తిష్ఠ = లెమ్ము= నిద్రనుండిలెమ్మనుట

తా॥ కౌసల్యాదేవియొక్కమంచికుమారుఁడగు శ్రీరాముఁడా తెల్లవారిప్రాతస్సంధ్య జరగుచున్నయది. ఓపురుషశ్రేష్ఠుఁడైన రామా ప్రతిదినము చేయఁదగిన సంధ్యావందనాదికృత్యములు చేయవలసి యుండుటచేత నిద్రలెమ్ము అనితాత్పర్యము.

శ్రీరాముఁడు తండ్రియగు దశరథచక్రవర్తి తల్లియగు శ్రీకౌసల్యాదేవి వీరిరువురును చేసిన తపస్సునకు ఫలమైయుండవిశ్వామిత్ర మహర్షి కౌసల్యా సుప్రజా రామయని చెప్పినందుకు హేతువేమి యనఁగా॥ శ్లో॥ ౧ "మాతాపుత్రస్యభూయాంసి కర్మాణ్యాలభతే" అన్నట్లు ధర్మశాస్త్రమునందు పుత్రుని విషయమునఁ దల్లికే ప్రయత్నమధికము అని

---

౧- పుత్రస్య= పుత్రునివిషయమునందు, మాతా= తల్లి, భూయాంసి= అనేకములగు, కర్మాణి= కృత్యములను, ఆలభతే= పొందుచున్నది, పుత్రునివిషయమునందు తల్లికిప్రయత్నమధికమనిభావము.

చెప్పఁబడి యుండుటచేతను॥ శ్రు॥ ౨ "మాతృదేవోభవ" అని యెడిశ్రుతి
వాక్యము తల్లియే ప్రధానభూతయనిచెప్పుటవలనను ॥ శ్లో ॥ ౩ "కైకే
య్యాః ప్రియకారణాత్" అని మాతృసపత్నియగుమాతకు నిష్టమగుచు
దుష్కరకృత్యము సేయుటచేతను ఈశ్రీరామునికి మాతృవృత్తి యధిక
మను తలంపుచేతను అఱువదివేలయేండ్లుగొడ్రాలైనిలిచియుండియరుదు
గాఁగన్న కుమారుని దశరథచక్రవర్తి విశ్వామిత్రాధ్వరమును రక్షించుట
కెట్లుపంపుదునని సంశయించునపుడు మాతృత్వప్రయుక్త సంబంధమును
గాని నిషేధించకయెతనవెనువెంటనంపెననియెడియుపకార స్మృతిచేతను
కౌసల్యయొక్క మంచి కుమారుఁడా యనుచున్నాఁడు. (సుప్రజాః)
మాతృపితృవాక్య పరిపాలన మొనర్చుటయు వారలకుఁ బ్రియహితంబుల
నొనఁగూర్చుటయుసత్పుత్రలక్షణమనిలోకులెఱుంగునటులు॥శ్లో॥౪ "మద్వి
ధావాపితుఃపుత్రాః" అని తనపుత్రభావమును తానే కొనియాడునటుల
పుత్రధర్మములననుష్ఠించిచూపుటవలనను॥ శ్లో॥ ౫ "కౌసల్యాశుశుభేతేన"
అనియు॥ద్రా॥౬ "తాయెక్కుడల్విళక్కంశెయిదదామోదరనై" అనియు
ఇట్టివానిని గన్న కడుపు గలదియని యందఱునంతట స్తుతియింపనొప్పి
యుండు పుత్రభావమువలనఁ గన్నతల్లిని ప్రకాశింపఁ జేయుటచేతను
మంచికుమారుఁడా యనుచున్నాఁడు. (రామ) రూపౌదార్యాది గుణ
చేష్టితములచేత మనంబునకుఁ బ్రీతుఁడై యెల్లప్రాణులను వశీకరించెడి
దేహసౌందర్యముగల వాఁడాయనుచున్నాఁడు.(రామ)॥ శ్లో॥ ౭ "దేవో

---

౨- మాతృదేవః=తల్లియేదేవతగాగలవాఁడవు, భవ=కమ్ము.

౩- కైకేయ్యాః=కైకేయియొక్క, ప్రియకారణాత్=ఇష్టముచేయవలయు
ననియెడిహేతువుచేత.

౪- పితుః=తండ్రికి, మద్విధాః=నావంటి, పుత్రాః=పుత్రులుకలరు.

౫. తేన=ఆరామునిచేత, కౌసల్యా=కౌసల్య, శుశుభే=ప్రకాశించెను.

౬. తాయెక్కుడల్=తల్లియుదరమును, విళక్కంశెయిద=పరిశుద్ధిఁజెందఁ
జేసిన, దామోదరనై=త్రాటఁగట్టఁబడిన యుదరముగలవానిని కృష్ణుని.

౭. దేవః=పరమాత్మ, నామసహస్రవాక్=వేయినామములుగలవాఁడు.

నామసహస్రవాన్" అనుటచేతనట్టి సహస్రనామములకును సదృశమై చతుర్విధపురుషులకును జప్యమై సర్వాభీష్టప్రదమగు నామమును చెప్పుచున్నాఁడు. (కౌసల్యాసుప్రజారామ) అనియనుపాస్యులగు పరశురామాదులనువ్యావర్తించుచున్నాఁడు. (నరశార్దూల) తనయొక్క యజ్ఞమును గావఁగల పురుషవ్యాఘ్రమాయనుచున్నాఁడు. (పూర్వాసంధ్యా) ఆతని ప్రథమ కటాక్షమునకుయోగ్యమై ఆతనిచేఁ దనవిరోధులను బోఁగొట్టుకొనుటకును అనువై జ్ఞానోద్బోధకమగు కాలమును జెప్పుచున్నాఁడు. ఈతఁడాచార ప్రధానుఁడు. సామాన్యముగ సకల ధర్మములననుష్ఠించును. ప్రాతస్సంధ్యననుష్ఠింపకయ నిద్రింపవచ్చునాయనిభావము. (ప్రవర్తతే) మిక్కిలి వర్తిల్లుచున్నది. ఇచ్చట వర్తమానముగఁ జెప్పుటవలన ఈమంచి స్వరూపమే ప్రతిదినముండవలయుననుచున్నాఁడు. (కర్తవ్యం దైవమాహ్నికం) ఈశ్వరునిచేవిధింపఁబడిన నిత్యనైమిత్తిక రూపములయిన ఆహ్నికములగు ధర్మముల నెల్లను అనుష్ఠింప వలయును గాన (ఉత్తిష్ఠ) అని విశ్వామిత్ర మహర్షి నిద్రలేపుచున్నాఁడు. కౌసల్యాసుప్రజారామ పూర్వాసంధ్యాప్రవర్తతే । ఉత్తిష్ఠనరశార్దూల కర్తవ్యందైవమాహ్నికం. శ్రీకృష్ణసూరిచరణౌ శరణం ప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు
కౌసల్యాసుప్రజాః అను శ్లోకముయొక్క యుప
న్యాసము సంపూర్ణము.



శ్రీరామభద్రాయనమః.

శ్రీ జనకచక్రవర్తి వివాహవేదికయందు సీతాదేవిని అగ్ని సమక్షమున
నిల్పి శ్రీరామాభిముఖుండై యీ క్రిందిశ్లోకముచేత సీతను
పాణిగ్రహణము చేసికొనుమని చెప్పు చున్నాఁడు.
ఇది శ్రీరామాయణము బాలకాండములో
ముప్పదియేడవ సర్గములోనిది.

శ్లోకము॥ ఇయంసీతామమసుతా । సహధర్మచరీతవ
ప్రతీచ్ఛచైనాంభద్రంతే । పాణింగృహ్ణీష్వపాణినా॥౪॥

టీ॥ ఇయం=ఈమె, సీతా=సీతయనుపేరుగలది—నాఁగేటిచాలునుండియు ద్భవించినదిగనుక ఆపేరేగలది—అయోనిజయనుట. మమ=నాకు, సుతా=కూఁతురు. తవ=నీకు, సహధర్మచరీ=కూడనుండిధర్మమునడపునది. ఏనాం=ఈమెను, ప్రతీచ్ఛచ = ఆదరపూర్వముగాఁ బరిగ్రహించి కోరినభోగాదులనిమ్ము. తే=నీకు, భద్రం=మంగళమగుఁగాత. పాణిం=సీతాదేవియొక్కశ్రీహస్తమును, పాణినా= నీశ్రీహస్తముచేత, గృహ్ణీష్వ=పట్టుకొనుము.

తా॥ ఓరాముఁడా యీమెసీత. నాకుఁగూఁతురు. నీవుఁజేయుఁబూనుధర్మము సహాయురాలయి నడపఁదగినది. ఈమెను మిక్కిలి యాదరముతోఁ బరిగ్రహించి యామెకు వాంఛితములగు భోగాదులనిమ్ము. మీకిరువురకునుమంగళమగుఁగాత. ఈమె శ్రీహస్తమును నీశ్రీహస్తముచేఁ బట్టికొనుమనితాత్పర్యము.

శ్రీరామచంద్రుఁడుశివ ధనుర్భంగమొనరించి పారతంత్ర్యప్రీతిముతో వినీతుఁడై నిభృతుఁడైనిల్వఁగాఁ శ్రీజనకచక్రవర్తితానుచింతార్ణవమునుండి గట్టెక్కినహర్షాతిశయమునవధూవరులిరువురొకపీఁటమీఁద నుండఁగాఁ జూచిగాని తాళఁజాలనందుచేతను, వారలంగూర్చుట తనకు పరమోద్దేశ్యమైనందుచేతను, ఘటకకృత్యముముందుగాఁజేయవలసినదగుటచేతను, శేషియొక్కయిష్టము ముందుగానెఱవేర్చుటస్వరూపమగుటచేతను శ్రీరాముని చేతికి సీతాదేవినిచ్చి కృతకృత్యుఁడగుచున్నాఁడు. ఈతఁడు పురుషకారమునకును పురుషకారమగుచున్నాఁడుగదా. (ఇయంసీతా) ॥ శ్లో॥ ౧ "చంద్రకాంతాననంరామ మతీవప్రియదర్శనం । రూపౌదార్యగుణైః పుంసాందృష్టిచిత్తాపహారిణం" అని చెప్పఁదగిన దేహసౌందర్యముగలనాయెడలనందఱును వ్యామోహితులగుచున్నారనినిన్నుమాత్రముచూచుకొని

---

౧. చంద్ర=చందరునివలె, కాంత=అందమైన, ఆననం=మొగముగలవాఁడును, అతీవ=మిక్కిలి, ప్రియ=ఇష్టమైన, దర్శనం=చూపుగలవాఁడును, రూపౌదార్యగుణైః—చక్కఁదనము ఉదారత్వముఅనెడి గుణములచేత, పుంసాం=పురుషులయొక్క, దృష్టి=కన్నులను, చిత్త=హృదయమును, అపహారిణం=అపహరించెడువాఁడునగు, రామం=శ్రీరాముని,

గర్వింపవలదు. ఈమెనుకూడ చూడుము. అనియనుచున్నాఁడు॥ శ్లో॥ ౨ "తుల్యశీలవయోవృత్తాం" అన్నట్లు వేఱువిషయములేకుండుటచేతనీకిచ్చుచున్నాఁడననియనుకొనుము. అట్లైన నీమెకతిశయమేమియని రామునభిప్రాయముగాఁదలఁచి జన్మమందాధిక్యముఁదెల్పుచున్నాఁడు (సీతా) అభిజాత్యమును గర్భవాసముచేయని యాధిక్యమును గనఁబఱచుచున్నాఁడు. (సీతా) బంగారుతీగెవలె బంగారముత్పన్నమగుట భూమియందేకదా. ఈమెయును హిరణ్యవర్ణగదా. అందమునాకు వెల్లడియగుచున్నయది. అయిన నాభిజాత్యమకుఁరలేదాయనుతలఁపు రామునికిఁగలిగినదని యెంచి జన్మమువలనఁ గలిగిన యాధిక్యము దెల్పుచున్నాఁడు. (మమసుతా)॥ శ్లో॥ ౩ "మిథిలాయాంప్రదీప్తాయాంనమేకించిత్ప్రదహ్యతే" అని చెప్పినయేనభిమానించునటులుజనియించినది॥ ద్ర॥ ౪ "వెళ్లిమరుంగుల్ ఎందనైమడైమాఙ్" అనుచోటతల్లితనకొమార్తయొక్కవైలక్షణ్యముపపాదించినటులుపుట్టుకయందునుపుట్టుకలేమియందునాధిక్యముగలదు॥ ద్ర॥ ౫ "ఒరుమకళ్ దన్నై ఉడయేఙ్, ఉలకంనిఱైందపుకళ్దాల్ తిరుమకళ్ పోల్ వళర్తేఙ్" అనుచున్నాఁడు॥ శ్లో॥ ౬ "జనకానాంకులేకీర్తిమాహరిష్యతిమేసుతా." [సహధర్మ

---

౨. తుల్య=సమానములగు, శీల=స్వభావమును, వయః = ప్రాయమును, వృత్తాం=నడతయునుగలిగిన వైదేహినిగ్రహింప రాఘవుఁడేతగినవాఁడు. ఈమెయు నాతనికేతగియుండును.

౩. మిథిలాయాం=మిథిలానగరము, ప్రదీప్తాయాం = మండుచున్నదగుచుండఁగా, మే=నాయొక్క వస్తువు, అనఁగా జ్ఞానభక్తివైరాగ్యాదిరూపవస్తువు, కించిత్=కొంచెమైనను, నప్రదహ్యతే=కాల్పఁబడినదికాదు.

౪. వెళ్లి=స్పృహణీయమగు, మరుంగుల్=నడుముగల, ఎందఙ్=నాయొక్క, మడైమాఙ్ = భీరుత్వాది గుణములుగలజింక. ద్రావిడభాషలోమాఙ్ అను పదము శృంగారిణిని బోధించునదిగా నుపయోగించుటగలదు.

౫. ఒరుమకళ్ తన్నై=ఒకకుమార్తనే, ఉడైయేఙ్-కలిగియున్నాను, (అట్టినేను) ఉలకం=లోకము,నిఱైంద=నిండిన. పుకళ్దాల్, పొగడికచేత=తిరుమకళ్ పోల్=లక్ష్మీదేవివలె, వళర్తేఙ్=పెంచితిని.

౬. మే=నాయొక్క, సుతా=కూఁతురు, జనకానాంకులే=జనకులకులము

చరితవయనుటకవతారిక] వైలక్షణ్యామునకేమియు కొఱంతలేదు. అయిన మాతలంపుననుండునదియదికాదు. మేమధికరించెడుకార్యమునకుసహకారిణిగావలయునేయనఁగా(సహధర్మచరితవ)అందునునీకగ్రేసరమే యనుచున్నాఁడు॥ శ్లో॥ ౭ "సత్యాజేయం * ఏతద్వ్రతంమమ" అనియేకదదేవరవారివ్రతము॥ శ్లో॥ ౮ "భవేయం శరణంహివః *అలమేషాపరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్ ... పరాధ్యతి * క్షాంతిస్తవాకస్మికీ" అనిచెప్పినట్లు అందునునీకంటె ముందు నిలుచునదేయనుచున్నాఁడు. ఈతఁడుశ్రీనంద గోపకుమారునివలె స్వతంత్రుఁడు కాఁడుగదా. నేనిందులకుస్వతంత్రుఁడనుగాను. అయ్యగారును, అమ్మగారును, వసిష్ఠాదులునుగదాయనఁగా (ప్రతీచ్ఛ) నీపాదములాశ్రయించినయీమెను ఏమిసేయ నీమనంబునఁ దలంచితివి. అను గ్రహింపుమనుచున్నాఁడు. పురుషార్థమైయుండవలయునేఃతుల్యశీలవయోవృత్తమైనను ప్రయోజనములేదే యనఁగా (ప్రతీచ్ఛ) వచ్చినవలదనను పోయిన వెదుకను అనియుండవలదు॥ ద్ర॥ ౯ "ఇహైయముకలుకిల్బిష" అని యీమెయుండునటులునీవును॥శ్లో॥ ౧౦ "నజీవేయంక్షణమపి" అనియుండవలయు

---

నందు, కీర్తిం=యశస్సును, అహరిష్యతి=కలుగఁజేయుచున్నది.

౭. సత్యాజేయం=శరణుసొచ్చినవానివిడువను. * ఏతత్=ఈయాశ్రితరక్షణము, మమ=నాకు, వ్రతం=వ్రతము.

౮. వః=ఓరాక్షసస్త్రీలారామీకు, శరణం=రక్షకురాలనుగా, భవేయం=కాఁగలను. అనఁగారాముఁడు రాక్షసులనుసంహరించునప్పుడు మిమ్మునుగూడవానరులు సంహరించుటకు చోటివ్వక కాపాడెదననుట,

* ఏషా=ఈసీతాదేవి, పరిత్రాతుం=రామునిబారినలననుండిరాక్షసీగణములనుతప్పించుటకు, అలం=సమర్థురాలు.

*** కశ్చిత్=ఒక్కరుఁడును, నాపరాధ్యతీతిన=అపరాధముసేయకున్నవాఁడుకాఁడు. లోకమునందెల్లవారు నపరాధులేయగుదురు. వారలనెల్లరసంహరింపవీలగునా? కావుగాన యీరాక్షసస్త్రీలు అపరాధముచేసియున్నను క్షమించవలయును. ఇది సీతావచనము. *తవ=నీకు,క్షాంతిః=ఓర్పు,ఆకస్మికీ=స్వాభావికము

౯. ఇహైయుం=ఒక్కక్షణకాలమైనను, అకలుకిల్బిష=ఎడఁబాయఁజాలను.

౧౦. (ఆయసితేక్షణయగుసీతలేక) క్షణమపి=క్షణకాలమైనను, నజీవేయం=బ్రతుకను.

ననుచున్నాఁడు. (ఏనాం) సిరిరాఁగా మోకాలడ్డమిడక స్వీకరింపుము. శ్రీరాముఁడు తండ్రితోఁగూడ సమ్మతించి నిలువఁగానంతటితో సీతనికిఁదృప్తి లేక యూరునాడు నెఱుంగునట్లు మంచివేడుకతో పెండ్లిచేసికొని తగునట్లు పాణిగ్రహణము చేసికొనవలయుననియాశించి (పాణింగృహ్ణీష్వ) కంకణాదిభూషితమగు శ్రీహస్తమునుబట్టికొనుమనుచున్నాఁడు. సురక్షితముగా నుంచుకొనవలయుననియుకొఱఁతలేని సౌఖ్యములనియ్యవలయుననియు నపేక్షించుచున్నాఁడు. (గృహ్ణీష్వ) ఎవరి ప్రయోజనమునకై వేచి యుండెదవు. (ఏనాంపాణింగృహ్ణీష్వ) ఈవేఁపాకుసీటినిగదానిన్నుత్రాగుమనిచెప్పుచున్నాను. పాలుద్రాగుటకుఁగూడ పాదములుపట్టుకొనవలసివచ్చెనే. పాలజాఱుబోలు లీలావచనములు గలదిగదా యీమె. ఈమె మధురగదా. (భద్రంతే) మిథునమునుజూడఁగా నేమంగళాశాసనముసేయుచున్నాఁడు. ఈవిషయమునకుఁగూతుంగనియిచ్చినవారి కెల్లమంగళాశాసనముసేయఁబోలుగదా !! ద ॥ ౧౧ "నన్టునన్టునరయూరర్కే". అయిన నిప్పుడు చేయవలసినదేమియనఁగా (పాణింగృహ్ణీష్వపాణినా) చేతఁజేయిపట్టుము. ప్రణయాపరాధమందు శిరముచేతఁ బాదములను పీడింతువుగాక. ఇప్పుడుహస్తముచేహస్తముపట్టుము. అశ్మారోపణసమయమందు హస్తముచేఁ బాదములుపట్టుదువు. ఇప్పుడు హస్తముచేతహస్తమునుబట్టుము. పాణిగ్రహణమయిన యనంతరము హస్తముబట్టికొని ప్రదక్షిణముచేయునప్పుడుగదా శ్రీహస్తములచేత పాదములంటి యశ్మారోపణను చేయునది. [పాణిం అనుపదమును ముందుచెప్పి పాణినాయనుపదమును వెనుకజెప్పుటకు సారస్యమును దెల్పుచున్నారు] ద॥ ౧౨ "శెమ్మైయుడయతిరు

---

౧౧. నరయూరర్కే = నరయూరనుదివ్యదేశముననుండెడి ఈశ్వరునికే, నన్టునన్టు = మేలుమేలు.

౧౨. శెమ్మైయుడయ = మేలిమిగల, తిరుక్కైక్కే మేల్ = శ్రీహస్తమునకుమీఁద, ఎన్ కై = నాయొక్కహస్తమును, వైత్తు = ఉంచి, భగవంతుఁడుతనహస్తముమీఁద నాచేయియుంచి పాణిగ్రహణముచెసికొనెననినాయికావచనము-

కై(క్కిల్ మేల్ ఎన్ కై వైత్తు" అనుప్రకారముసీతాదేవియొక్క శ్రీహస్తమం దుభోగ్యతయతిశయించి యుండుటచేత(పాణినాపాణింగృహ్ణీష్వ) అని చెప్పక పాణింగృహ్ణీష్వపాణినాయనిచెప్పెను. ఉభయవిభూతియు నొక మూలననణగునట్టిపెద్దబాహుచ్ఛాయగల॥ ద్ర॥ ౧౩ "దయరథన్ పెత్తమర కతమణి త్తడముం మెల్లియల్ తోళ్ తోయిందాన్" అన్నప్రకారము దశరథ కుమారరూపమగు మరకతమణిమయ తటాకమును తనకు శ్రమహరమగు నని యవగాహించునట్టి సౌందర్యమునుభోగ్యతయును అతిశయించియేక దాయీమెచాహులతలున్నవి. మఱియు॥ శ్లో॥ ౧౪ "శత్రుహంతారంపరి షస్వజే" అన్నట్లుఖరశరాగ్నిచేఁగలిగిన తాపమును భగవత్స్వాతంత్ర్య రూపమగు తాపము నుపశమింపఁజేసి యిట్లు చేతనేశ్వరులిరువురకు నిలుచు నీడయయివంశలతలంబోలి లలితంబులయియీమెమృదుల బాహు వులున్నవి (పాణింగృహ్ణీష్వపాణినా) ॥ ద్ర॥ ౧౫ "కై త్తలంప త్తక్కనా కక్కండేన్" అన్నట్లు ఈమెయుకలగనియున్నది.

శ్రీకృష్ణసూరిచరణౌశరణంప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణశ్లోకరత్నావళియందు ఇయంసీతాఅను శ్లోకముయొక్క యుపన్యాసముసంపూర్ణము.

---

౧౩. దయరథన్=దశరథుఁడు, పెత్త=కన్నట్టి, మరకతమణి త్తడముం= మరకతమణిమయమగుతటాకమును (ఇచ్చటతటాకముగారూపణను సేయుట "గ్రీ ష్మేశీతమివహ్రదం, అనువచనమునుబట్టి. అనఁగా గ్రీష్మతప్తులకుతటాకము శ్రమ పరిహారకమగునటులు సంసారతాపతప్తులకు శ్రమహరుఁడనిభావము.) అట్టివాఁడు ను, మెల్లియల్ తోళ్ = మేలిమిగలసీతాదేవి బాహులతయందు, తోయిందాన్= లీనుఁడైయున్నవాఁడు. అనఁగానాబాహువుయొక్క భోగ్యతార్ణవమునమునిఁగి గట్టెక్కలేకయున్నాఁడనిభావము.

౧౪. శత్రుహంతారంపరిషస్వజే=రాముఁడుఖరాదిశత్రువులనుచంపి పర్ణ శాలకురాఁగానే యాతనియొక్క దేహమునందు శత్రువుల బాణములచేఁగలిగిన తాపము ఉపశమించునటులును వ్రణములుమానిపోవునటులును సీతాదేవి తనభర్త ను గాఢాలింగనము చేసికొనెను.

౧౫. కై త్తలం=నాచేతిని, పత్త=పట్టినట్లు, కనాక్కండేన్=కలఁగంటిని, ఇదిశ్రీయాండాళ్ వాక్యము.

శ్రీరామభద్రాయనమః.

శ్రీదశరథచక్రవర్తి తనజ్యేష్ఠకుమారుఁడగు శ్రీరామునికి పట్టాభిషేకముచేసి
తాను విశ్రాంతినొందవలయునని యెంచి పౌరజనులనురప్పించి
వారలసమ్మతినడుగఁగా వారలు ఈక్రిందిశ్లోకముచేత
సమహృదయంబులందలియర్థమును వెల్లడిసేయుచున్నారు.

ఇది రామాయణముఅయోధ్యాకాండములో రెండవసర్గములోనిది.

శ్లోకము॥ ఇచ్ఛామోహిమహాబాహుంరఘువీరంమహాబలం।
గజేనమహతాయాంతంరామంఛత్రావృతాననం ॥౫॥

టీ॥ (వయం=మేము) మహాబాహుం = పృథులములగుబాహువులుగలవాఁడును, రఘువీరం=రఘువులయొక్కకులమందుజనియించినవారలకంటె మిక్కిలివీరుఁడును, మహాబలం=గొప్పజ్ఞానశక్తిగలవాఁడును, మహతా=గొప్పదియగు, గజేన=ఏనుఁగుచేత, యాంతం=రాజవీధివెంటనేతెంచువాఁడును, ఛత్ర=తెల్లనిగొడుగుచేత, ఆవృత=కప్పుకొనఁబడిన, ఆననం =మొగముగలవాఁడునగు, రామం=శ్రీరాముని, (చూచుటకు) ఇచ్ఛామః=కోరుచున్నాము.

తా॥ ఓదశరథుఁడా దీర్ఘములై పృథులములగు బాహువులు గలవాఁడును రఘుకులమందుఁ బుట్టినరాజులకంటె వీరుఁడును విశేషమగు జ్ఞానశక్తి గలవాఁడును అగు శ్రీరామునికి నీవు పట్టాభిషేకముసేయ తోడనయారాముఁడు గజారూఢుఁడై రాజచిహ్నమగు శ్వేతఛత్రను ముఖమండలమావరింప రాజవీధియందు వేంచేయఁగా ఆతనిఁజూచియెల్లవారము ఆనందమునొందఁగోరుచున్నాములనిభావము.

చక్రవర్తి తానుబరిణతవయస్కుఁడైనందువలనను, పగతురమీఁద దండెత్తివారల జయించుటకశక్తుఁడైనందువలనను, తానుండు నప్పుడే శ్రీరామునిపట్టాభిషిక్తునిచేసి ప్రజలతోఁగలసిమెలసి ప్రవర్తింపఁ జేయుట కుఁదలంపుగలవాఁడగుటవలనను ॥ శ్లో॥ ౧ "గళితవయసామిక్ష్వాకూణామిదంహికులవ్రతం" అన్నట్లు ఈవంశమునందు జన్మించినవారు తమయొక్కకుమారులు సంప్రాప్తవయస్కులయిరేని వారికిఁబట్టముగట్టి యుప

---

౧. గళితవయసాం = గడచినతారుణ్యముగలవారలగు, ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకుకులమునజనియించిన రాజులకు, ఇదం=సంప్రాప్తవయస్కుఁడై కుమారునికిఁబట్టముగట్టితాము వనవాసముచేయుటయనునిది, కులవ్రతంహి = కులమునందుఁ బుట్టినవారలెల్ల చేయవలసినవ్రతముగదా.

శాంతులగుటయె కులక్రమాగత మగుటచేతను, శ్రీరామునికిఁ బట్టముగట్టి
రాజ్యధురంధరునిఁగాఁ జేయఁగోరియట్లు చేయునప్పుడు॥ శ్లో॥ ౨ "పాం
డురస్యాతపత్రస్య చ్ఛాయాయాం జరితంమయా" అన్నట్లు నేనింతవఱకు
దండయాత్రమీఁద దండయాత్రగాఁ దిరిగి యీజనులకొక యుపద్రవము
రాకుండ రక్షించు చున్నవాఁడ నయితిని. ఈజానపదులును రక్షింపఁబడు
చున్నవారైరి. అట్లుండతటాలున రాముని రాజ్యాభిషిక్తునిఁ జేసితినేని యీ
జానపదులు "దశరథుఁడిదివఱకు బాగుగా రాజ్య పరిపాలనము సేయుచు
వచ్చి దానియందేదో స్వల్పపుకొఱంత గలుగునట్లుండఁగాఁ దటాలున నొక
బాలునికొప్పగించి మాయెడల నుపేక్షచేసెను. ఇది మెట్టి రాజ్యము సేయు
క్రమము" అనితనవిషయమునలోపంబుగణియింతురు కాన వారలనుగూడ
సమ్మతింపఁజేసియే యీకార్యము నెఱవేర్చుట మేలనితలఁచి యాపౌరు
లను ఆజానపదులను గుంపుగాఁజేర్చి॥ శ్లో॥౩ "గతక్లేశోభవిష్యామిపుత్రే
స్మిన్ సన్నివేశ్య" అనియు ॥ శ్లో ॥ ౪ "సోహంవిశ్రమమిచ్ఛామి పుత్రంకృ
త్వాప్రజాహితే" అనియు చెప్పఁబడినట్లు ఓమహాత్ములారా మేమిమ్ము
బహుకాలముగ రక్షించుచుంటిమి. ఇప్పుడు మమ్మును ముసలితనము ఆక్ర
మించినయది. ఇఁకమిమ్మురక్షించుట మాకుమిగుల నశక్యముగానున్నది.

---

౨. కృత్స్నస్య=సమస్తమగు, లోకస్య=లోకమునకు, హితం=మేలు, చర
తా=చేయుచున్నట్టి, మయా = నాచేత, ఇదంశరీరం = ఈనాయొక్క శరీరము,
పాండురస్యఆతపత్రస్యచ్ఛాయాయాం= తెల్లగొడుగునీడయందు, జరితం=ముసలి
తనముగలదిగాఁజేయఁబడెననుట. లోకమునురక్షించుటకై రాజచిహ్నమగు తెల్ల
గొడుగుక్రిందనుండియే నేనునాకాలముగడపితిని. అట్లుగడపియె నాశరీరమును
జరాగ్రస్తమయ్యెను, అనిభావము.

౩. అస్మిన్ పుత్రే = ఈనాపుత్రుఁడగురామునియందు, సన్నివేశ్య= రాజ్య
భారమునుంచి, గతక్లేశః= శ్రమమెడలినవాఁడను, భవిష్యామి= కాఁగలను.

౪. సోహం=అట్టినేను, ప్రజాహితే = జనులయొక్క హితమగురాజ్యభరణ
మందు, పుత్రం= కుమారుఁడగురాముని, కృత్వా= స్థాపించి, విశ్రమం= విశ్రాంతిని,
ఇచ్ఛామి= కోరుచున్నాను,

అట్లగుటచే॥ శ్రు॥ ౫ "ఆత్మావై పుత్రనామాసి" అన్నట్లు మాతోనిర్విశేషుఁడగు మాకుమారునికిఁ బట్టాభిషేకముచేసి వానిని మీరక్షణమునందు నియోగించి మేమువిశ్రమింపఁబ్రతీక్షించుచున్నారము॥ శ్లో॥ ౬ "భవంతో మేను మన్యంతాం" ఇందుకుమీరును ఒప్పుకొనవలయునని చెప్పఁగా వారును ఆదశరథునిమాట విన్నతోడనేమిక్కిలిప్రీతిచేసి॥ శ్లో॥ ౭ "విమానంకంపయన్నివ" అన్నట్లు దశరథుఁడుండెడిమిద్దెయదురునటులు గొప్పకోలాహలధ్వనిచేయుచు హర్షపరవశులయి॥ శ్లో॥ ౮ "అనేకవర్షసాహస్రోవృద్ధస్త్వమసిపార్థివ। సరామంయువరాజానమభిషించస్వపార్థివం" ఓరాజా నీవు వృద్ధుఁడవైతివి.బహుకాలమునుండి మమ్ము రక్షించుచువచ్చితివి. ఇంకరామునిరాజ్యాభిషిక్తునిఁజేయుము. అని ఆతఁడడిగినందుకుత్తరమిచ్చి యంతటఁబోకతమతలంపులను వెల్లడిసేయుచు రామచంద్రునియొక్క రాజ్యభరణయోగ్యతనుబ్రకాశింపఁ జేయుచున్నారు. (ఇచ్ఛామః) పుష్పమాలికలు ధరించికిరీటము శిరంబునంగ్రాల మాకన్నులకు నెదుటగానఁబడవలయునని మిగులఁ గోరుచున్నారము. (ఇచ్ఛామః) మాకుఇచ్ఛమాత్రమేకలిగియున్నదిగాని అట్లుచేయుటకు మేముశక్తులము కాముగదా.

---

౫. ఆత్మావై = స్వయముగానీవే, పుత్రనామా = పుత్రుఁడవుగా, అసి= అగుచున్నావు.

౬. భవంతః=మీరలు, మే=నావిషయమున, అనుమన్యంతాం=అంగీకారముసేయుదురుగాక. నేను చక్కగానాలోచించి రాముని పట్టాభిషిక్తునిఁజేయవలయునని చెప్పిన విషయముమీరొప్పుకొనవలయుననిభావము.

౭. విమానం=చక్రవర్తియుండెడిసౌధమును, కంపయన్నివ=సంచలింపఁజేయుదానివలె, జనఘోషముకలిగెను. శ్రీరామునికిపట్టాభిషేకముచేసెదనన్నమాటవినఁబడినంతనె జనులుహర్షపరవశులయి గొప్పకోలాహలముసేయఁగా నందువలన దశరథచక్రవర్తియుండెడిసౌధము కంపమునొందునటులుండెననిభావము.

౮. పార్థివ = ఓదశరథమహారాజా, త్వం=నీవు, అనేక = పెక్కులగు, వర్ష=సంవత్సరములయొక్క, సాహస్రః=వేయింటినిగలవాఁడగు, వృద్ధః=ముసలివాఁడవు, అసి-అగుచున్నావు. సః=అట్టినీవు, యువరాజానం = యువరాజగు, పార్థివం=రాజుగా, రామం=రాముని, అభిషించస్వ=పట్టాభిషేకముసేయుము.

కిరీటముధరియింపఁజేయుటకు శక్తుఁడవు నీవుకదా. ఇట్లు ఇచ్ఛించుటమా తలంపులనున్నది॥ శ్లో॥ F "శ్రేయాంసిబహువిఘ్నాని" అన్నట్లు ఈమహా ఫలముమాకు లభింపనున్నదో లేదో. (ఇచ్ఛామః) అదిలభింపనిమ్ము లభింపక పోనిమ్ము. మంచివిషయముఁ జూడనాశించుట వాడుకగాదే? (ఇచ్ఛామః) నిరపాయముగా మమ్మురక్షించుచువచ్చిన నీ మనంబునందు వికల్పముదోఁ చునేమోయని నోటఁజెప్పక హృదయంబునమాత్రమే కోరుచుంటిమి. అట్లైననిప్పుడు పలుకనగునాయనియనిన॥ శ్లో॥ ౧౦ "భావంవిజ్ఞాయసర్వ శః" అన్నట్లు ఆతని భావమెఱింగి చెప్పుచున్న వారలుగాన నిప్పుడును (ఇచ్ఛామః) అనిచెప్పుటకు అడ్డులేదు ఈకోరిక కొందఱకుఁ గలిగి మఱి కొందఱకులేదో యనఁగా (ఇచ్ఛామః) మేమున్నచోటనయుండి ఝుది నెఱవేర్పఁగంటిమేయని మిమ్మును స్తుతియించుచున్నారము. మీహృద యములోనుండునది మేమెఱుంగుటయెట్లనఁగా (హి) ఈకార్యమెల్ల వార లకు నిష్టమనుట పరులు చెప్పవలసియున్నదా॥ శ్లో॥ ౧౧ "జనఘోషోమ హానభూత్" శ్లో॥ "విమానంకంపయన్నివ" అనియుచెప్పఁబడినట్లుజాన పదులుచేసిన కోలాహలముచే నదురుచున్నమీయింటి విమానములను గాంచి తెలిసికొనఁగూడదా (హి)॥ శ్లో॥ "అకామయతమేదినీ" అన్నట్లు నీవు నిర్వాహకుఁడవై యుండఁగా నేభూమితాను రాముని స్వయంవరము చేసి పుష్పహారమువేసి నప్పుడే నీవెఱుంగలేదా¶(అకామయత)¶నీవుకర గ్రహణమొనర్చి యేలుచుండినను వావివరుసలువదలి వరగ్రహణముచేయ లేదా యీభూమి. కాముకీజనమునకు క్రమము వివక్షితముకాదుగదా?

---

F. శ్రేయాంసి = మేలులు, బహువిఘ్నాని = అనేకవిఘ్నములుగలవి. అనఁగామంచికార్యములకు విఘ్నములు మెండుగాఁగలుగునని భావము.

౧౦. సర్వశః= అన్నివిధములచేతను, భావం= రాజుయొక్క తలంపును, విజ్ఞాయ= ఎఱింగి,

౧౧. మహాన్= గొప్పదియగు, జనఘోషః = ప్రజలయొక్క మ్రోఁత, అభూత్ = కలిగెను.

¶(శ్లో॥ ౧౨"లోకపాలోపమంనాథమకామయతమేదినీ")¶శ్లో॥౧౩"లోక పాలోపమః * విష్ణునాసదృశః" అన్నట్లు సర్వేశ్వరునింబోలి యుండుట చేత భూమి తానేపైఁబడి కౌఁగిలించుకొనెను. ఇందుకు కారణము తాను మేదినియగుటవలననే యనియెఱుంగునది. అదెట్లనఁగా భూమిమధుకైట భులయొక్క వసావిస్రగంధముచేత నుపహతమైయున్నతన్ను॥ శ్రు॥౧౪ "సర్వగంధః" అన్నట్లు వెలుఁగుచుండెడి యాతనిసౌగంధ్యముచేత వాసి తఁగాఁజేసికొనుటకై యట్లురాముని వరియించెను. ఇది గ్రంథాంతరము నను జెప్పియున్నారు॥ శ్లో॥ ౧౫ "మధుకైటభదానవేంద్రమేదః ప్లవవిస్రా మిషమేవమేదినీయం।అధివాస్యతి" అని మురారిచెప్పియున్నాఁడు. కర్పూ రచందనాదులవలెనా ఉపకరణమై శేషకోటిలో నవతరించినదియనఁగా (నాథం) ఏతాదృశగంధమే ప్రయోజనము కాకుండ నందఱను రక్షించు వాఁడై యసౌగంధ్యసౌగంధ్యములు తానేయనుభవించునటులు నిరుపాధి కశేషియయియున్నవానిననుట. సత్యముగ మీకందఱకునిష్టముండెనేని యే నిప్పుడే శ్రీరామభద్రుని నభిషిక్తుఁజేసెదను. ఆతఁడు దేశమును వశీకృత ముఁజేసికొని యేలఁగల సామర్థ్యముగలిగినవాఁడేనా? యనఁగా (మహా బాహుం) అతనిబాహు వైశాల్యమునకు సమస్తముగునీచిన్నమెత్తుమన్ను

౧౨. మేదినీ=మధుకైటభులనియెడి రాక్షసులయొక్క మెదడుచేతఁగ్రన్ను కొనఁబడినదైనభూమి, లోకపాలోపమం=దిక్పాలకులతోసమానుఁడును, నాథం= సర్వలోకేశ్వరుఁడునగు, రామం=శ్రీరాముని, అకామయత=కామించెను.

౧౩. లోకపాలోపమః = దిక్పాలకులతోసమానుఁడును. * విష్ణునా= వెన్నునితో, సదృశః=సమానుఁడును.

౧౪ సర్వగంధః=ఎల్లసువాసనలుగలవాఁడు—పరమాత్మ.

౧౫. ఇయం=ఈ, మేదినీ=భూమి, మధుకైటభదానవేంద్ర=మధుకైటభు లనియెడిరాక్షసశ్రేష్ఠులయొక్క, మేదః=మెదడుతో, ప్లవ=తేలుచుండెడి, విస్రా- అపక్వగంధముగల, ఆమిషమేవ=మాంసమునే, అధివాస్యతి=పరిమళింపఁజేయుచు న్నది. సర్వగంధుఁడగు నీతనిబొందుటచే నట్లుచేయుచున్నదనిభావము.

ఒకవస్తువా? ‡(మహాబాహుం)॥ శ్లో॥ ౧౬ "శక్తస్త్రైలోక్యమప్యేవ భోక్తుం కిన్ను మహీమిమాం" అన్నట్లు కోసలరాజ్యము కేట (?) టియేకాకలంకా రాజ్యమును గూడఁ బరిగ్రహింపఁదగిన బాహువులు గలవాఁడు. (మహాబాహుం) ॥ శ్లో॥ ౧౭ "ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః" అనియు॥ శ్లో॥ "ఆజానుబాహుం" అనియుఁ జెప్పఁబడినట్లు మరియుం జేడి యాతని సాముద్రిక లక్షణములను జూచి కూడ యితరుల నడుగవలయునా?॥ ద్ర॥ ౧౮ "పొంగోతం శూళ్ందపువనియుం విణ్ణులగు మాంగా తుంశోరామేయాళ్కిన్ఱ" అన్నట్లు ఉభయ విభూతులను భరించు నట్టి బాహువులు గదా యివి. (మహాబాహుం) మమ్ము రక్షించుటకు ఆ బాహువులు గావలయునా?॥ శ్లో॥ ౧౯ "బాహుచ్ఛాయామవష్టభ్య యస్య లోకో మహాత్మనః" అన్నట్లు అతని బాహుచ్ఛాయ చాలదా? ॥ శ్లో॥ ౨౦ "రరక్ష

---

౧౬. ఏవః = ఈ రాముఁడు, త్రైలోక్యమపి = ముల్లోకములను, భోక్తుం = భుజియించుటకు అనగా పరిపాలించుటకు, శక్తః = సమర్థుఁడు. అట్లుండగ ఇమాం మహీం కిన్ను = ఈ భూమిని పాలించుట కడగవయునా ? అట్టివాని కీ భూమి పాలించుట యొకపనిగాఁ దోఁచదనుట, వా. రామానుజదాసు

‡ * ఇచ్చట భోజరాజును॥ శ్లో॥ అథ దశరథః పుత్రం రామం స్వత స్త్రిజగత్పతిం స్వవిషయమహీమాత్రే కర్తుం పతిం విదధే మతిం । భువనభరణే కల్యం కల్యాణభూధర మాదరాత్ । స్వగృహపటలీ ధుర్యస్తంభం విధాతుమనా ఇవ॥ అని చెప్పియున్నాఁడు.

౧౭. బాహవః = రాముని బాహువులు, ఆయతాశ్చ - దీర్ఘములుగాను, సువృత్తాశ్చ = గుండ్రములుగాను, పరిఘోపమాః = గుదియలతో సమానములుగాను ఉన్నవి. * ఆజానుబాహుం = మోఁకాళ్లవఱకు వ్రేలాడెడి బాహువులుగలవాఁడు.

౧౮. పొంగు = పొంగుచున్న, ఓదం = జలము, శూళ్ంద = చుట్టికొనిన, పువనియుం = భూమియును, విణ్ణులగుం = దేవలోకమును, అంగు = అచ్చట, ఆదుం = కొంచెమైనను, శోరామే = శ్రమపడక, ఆళ్కిన్ఱ - పరిపాలించునట్టి.

౧౯. బాహుచ్ఛాయాం -(లోకము శ్రీరామునియొక్క) బాహువులనీడను, అవష్టభ్య - ఆశ్రయించి, ఉన్నది.

౨౦. ధర్మేణ - న్యాయముచేతను, బలేన చైవ - బాహుబలముచేతను, రరక్ష - రక్షించెను. * ధర్మతః - ధర్మమువలన, పరిరక్షితా - పరిపాలనము సేయువాఁడు.

ధర్మేణబలేనచైవ" అనియు*"ధర్మతఃపరిరక్షితా" అనియు, చెప్పఁబడు నట్లుకొందఱను కొందఱురక్షించునప్పుడు ధర్మబలములు రెండును గావలసి యున్నవిగదా? ఈతఁడు తనకుబలముగలదని బాహుబలముచేత రక్షించు నంతియేగాక ధార్మికుఁడై రక్షించెడి యాకారము ఈతనికి లేదో యనఁగా (రఘువీరం)॥ శ్లో॥ ౨౧ "దీనాన్ దానేన రాఘవః" అన్నట్లుఆయాకారము ఆతనికిపుట్టఁగానేపుట్టినదిగాన [జన్మతఃప్రాప్తమేకాన] ఇప్పుడు కావలయునని కోరవలసినదిలేదు. (రఘువీరం) ॥శ్లో॥ ౨౨ "ఆనృశంస్యం పరోధర్మఃత్వత్తఏవమయాశ్రుతః" అన్నట్లుపరులకుఁగూడ నుపదేశించునట్లుగదా యీతఁడవతరించినది. (రఘువీరం) రఘుకులమునజనియించిన వారికంటె నీతనికి ధార్మికత్వమునందు ఆధిక్యముగలదు. అదెట్లనఁగా రఘువు రాక్షసుఁడుత్సుధార్మికుఁడైనమృతుండయ్యేనేనిదీనివలనఁగలిగినపాపమునీకుఁగలుగదాయనఁగా మీఁదనొకప్రతిక్రియయుఁదోఁచక యూరకుండెనుగదా. ఈతఁడు॥ శ్లో॥ ౨౩ "అప్యహంజీవితంజహ్యాం త్వాంవాసీతేసలక్ష్మణాం" అనిచెప్పినట్లు ప్రాణములనైనను॥ శ్లో॥ ౨౪ "ప్రాణేభ్యోపిగరీయసీ" అనిచెప్పఁదగిన సీతాదేవినైనను వదలవలసి వచ్చెనేని యట్లు చేసిరక్షింపఁగలవాఁడు. ఇట్లు ఆతఁడుతానురక్షింపఁబూనుకొనినప్పుడు॥

---

౨౧. రాఘవః - రఘుకులమునఁబుట్టినరాముఁడు, దీనాన్ - దరిద్రులను, దానేన - ఈవిచేత, పరిపాలించుచున్నాఁడు.

౨౨. పరోధర్మః - సర్వోత్కృష్టమగు ధర్మస్వరూపమయిన, ఆనృశంస్యం- క్రూరభావములేకుండుట, త్వత్తఏవ - నీవలననే—అనఁగారామునివలననుండియే, మయా - నాచేత—అనఁగాసీతచేత, శ్రుతః - వినఁబడెను.

౨౩. అహం - నేను, జీవితం - ప్రాణమును, అపిజహ్యాం - విడిచిననువిడుతును. సలక్ష్మణాం - లక్ష్మణునితోడ, త్వాంవా - నిన్నైనను, విడుతును. ప్రాణములనైనను సీతనైనను లక్ష్మణునినైనను వదలిపెట్టుదునుగాని ఆశ్రితులనురక్షింపకమానను- ఇదిశ్రీరామునివాక్యము.

౨౪. ప్రాణేభ్యోపి=ప్రాణములకంటెను, గరీయసీ=మిక్కిలిగొప్పది.సీత, రామవచనము.

శ్లో॥ ౨౫ "వధ్యతాంవధ్యతాం" అనిప్రతిబంధకము చేయువారలుగలరేని వారలమార్గముననుసరించి మనస్సునమెదుకఁబడి వారినిరక్షించకనివర్తిం చునోయనఁగా (మహాబలం)॥ శ్లో॥ ౨౬ "నతుప్రతిజ్ఞాంసంశ్రుత్య బ్రాహ్మణేభ్యోవిశేషతః"అనియు॥ శ్లో॥ ౨౭ "ఏతద్వ్రతంమమ" అనియు॥శ్లో॥౨౮ "నత్యజేయం కథంచన" అనియుచెప్పినట్లు ప్రతిబంధకము చేయువారినైనను వదలి యాశ్రితులను రక్షించెడు వ్యవసాయము గలవాఁడు. ఇచ్చట బలశబ్దముచేత మనోబలము వివక్షింపనగును॥ శ్రు॥ ౨౯ "నాయమాత్మా ప్రవచనేనలభ్యః" అన్నట్లు ఉపక్రమించినకార్యమునందు అచంచలుఁడై యుండుననుటకు॥ శ్లో॥ ౩౦ "ధైర్యేణహిమవానివ" అని చెప్పఁబడియున్నదిగదా?. మీకందఱకును రాజ్యభరణక్షముఁడని తోఁచినయెడల మీరు చెప్పినట్లుచేసెదను. ఇప్పుడు నేనున్నచోట నేయుండఁగా దేశమునకుఁగావలసినవి విచారించిజరపినట్టయినసరిపడదోయనఁగానీయొక్క ప్రయోజనము ముగిసెనని యంతట నేవిడువనగునా? మాయొక్క ప్రయోజనమునుగూడ మేముచెందవలదాయనియనుచున్నారు. అట్లయినమీరుచెప్పునదేమియనఁగా (గజేనమహతాయాంతం) నీవిష్టపడి పట్టాభిషిక్తునిఁగాఁ జేయుట ఎల్లవారలకు వెల్లడియగునటులు శత్రుంజయారూఢుఁడై సర్వాలంకారములతో కిరీటముధరియించికొని యీ రామచంద్రుఁడు మాకన్నులకెదు

---

౨౫. వధ్యతాంవధ్యతాం = వధియింపఁబడును గాక, వధియింపఁబడును గాక.

౨౬. బ్రాహ్మణేభ్యః= బ్రాహ్మణులకొఱకు, విశేషతః = మిక్కిలి, ప్రతిజ్ఞాం= తప్పకచేసెదననియొనర్చినయంగీకారమును, సంశ్రుత్య=చెప్పి, నతు=తప్పనుఅని భావము.

౨౭. ఏతత్ = ఈయాశ్రితరక్షణను, మమ = నాకు, వ్రతం= వ్రతము,

౨౮ కథంచన=ఏవిధముగానైనను, నత్యజేయం=వదలను,ఆశ్రితులనువదలననుట

౨౯. అయమాత్మా = ఈపరమాత్మ, ప్రవచనేన=ఉక్తిమాత్రముచేత, నలభ్యః=పొందఁదగినవాఁడుకాఁడు.

౩౦. ధైర్యేణ = ధీరత్వముచేత, హిమవానివ=హిమవత్పర్వతమునలె.

టంగానఁబడవలయును. అదిచేయునప్పుడు రథమునలంకరించి దానిమీఁద నెక్కిరాఁగూడదో యనఁగా (గజేన) అట్లుకూడదు॥ శ్లో॥ ౩౧ "మత్త మాతంగగామినా" అన్నట్లు ఆతనిగమనకును దగినవాహనముగానుండ వలయును. అట్లుచేయునప్పుడేదైన నొకయేనుఁగుగానుండకూడదో యనఁగా (గజేనమహతా) సర్వలక్షణోపేతమయి పట్టమునకుఁదగినయేనుఁ గుగానుండవలయును. (మహతా) సర్వశక్తుఁడుగానుండెడివానినివహిం పఁదగినదిగానుండవలయునే౽మీకు ఇట్లు అభీష్టముండెనేనికిరీటమును శిరం బుననిడిగజాధిరూఢునిఁజేసెదననఁగా (యాంతం) అంతమాత్రముచాలదు. ఏనుఁగుమీఁదనెక్కి రాజవీధిని రావలయును. అదిమీరుకావలసి నప్పుడను భవింపనిచ్చోట గుంపులుగాఁగూడితిరేని అభిషేకము సేయఁగానే యేనుఁ గుమీఁదనెక్కినంతటఁ జూడవచ్చునేయనఁగా ॥ శ్లో॥ ౩౨ "ఏకస్స్వాదున భుంజీయాత్" అనుచున్నారు (యాంతం)॥ శ్లో॥ ౩౩ "ననందుస్సప్రజాః ప్రజాః" అన్నట్లు ఈమహోత్సవమును మాపుత్ర మిత్రాదులతోఁ గూడి చూచునట్లు వేంచేయవలయును. (యాంతం, ఆయాంతం) మందహాస సుందర ముఖారవిందముతోను కస్తూరిగీరునామముతోను కరుణాకటాక్ష ముతోను వేంచేయఁగా సేవింపవలయును. ఇట్లు సేవించుట యెవ్వరిన నఁగా (రామం) రమయతీతిరామః అనియెడివ్యుత్పత్తిఁజేసి యెల్లవారిని కల్యాణగుణములచేత రంజింపఁజేయువానిని (రామం) రముక్రీడాయాం అనియెడి ధాత్వర్థప్రకారము అందఱతోఁగూడి విహరించెడివాఁడు అని యైనను చెప్పనగును. గజాధిరూఢుఁడై యేతెంచుటమాత్రమే చాలదో యనఁగా (ఛత్రావృతాననం) పాండురాతపత్రచ్ఛాయయందు వేంచే

౩౧. మత్త=మదించిన, మాతంగ=ఏనుఁగుయొక్క. గామినా=నడకవంటి నడకగలవాఁడు, రాముఁడు.

౩౨. స్వాదు=ఆస్వాద్యమగువస్తువును,ఏకః=ఒంటరియై,నభుంజీయాత్= భుజియింపఁగూడదు-

౩౩. ప్రజాః = జనులు, సప్రజాః=సంతానములతోఁ గూడికొన్నవారై, ననందుః=సంతోషించిరి-

(ఛత్త్రావృతాననం) ॥శ్లో॥ "పాండురస్యా తపత్రస్యచ్ఛాయాయాంజరితంమయా" అన్నట్లుదశరథచక్రవర్తిమొదలగు రాజులచేతనిచ్ఛింపఁబడినదై యుండెడి పాండురాతపత్రముచే నావృత రాజ్యలక్ష్మీమంగళమందిరమగు శ్రీముఖమండలమునుకన్నులారఁగాంచి యానందింపవలయును.

శ్రీకృష్ణసూరిచరణౌశరణంప్రపద్యే.

ఇది తనిశ్లోకీయను శ్రీరామాయణశ్లోక రత్నావళియందు కింత్వావక్ష్యాతిలను శ్లోకముయొక్క యుప న్యాసము సంపూర్ణము.



శ్రీరామభద్రాయనమః.

ఇది రామాయణముఅయోధ్యాకాండములో రెండవసర్గములోనిది.

శ్లోకము॥ ప్రియవాదీచభూతానాం సత్యవాదీచ రాఘవః।
బహుశ్రుతానాంవృద్ధానాంబ్రాహ్మణానాముపాసితా॥ ౬॥

టీ॥ రాఘవః=రఘురాముఁడు, భూతానాం = ప్రాణులవిషయమునందు, ప్రియవాదీచ=ఇష్టములైనమాటలుఆడువాఁడును,సత్యవాదీచ=నిజముచెప్పెడివాఁడును, బహుశ్రుతానాం= అనేకులవలనరహస్యార్థములనువిన్నట్టివాఁరును, వృద్ధానాం=జ్ఞాన, వయ, శీల వృద్ధులగునట్టి, బ్రాహ్మణానాం = విప్రులను, ఉపాసితా= తత్వార్థములువినుటకొఱకుఅనువర్తించెడివాఁడును.

తా॥ రఘుకులమునఁబుట్టినశ్రీరాముఁడు ప్రాణికోట్లకుప్రియముచెప్పెడివాఁడును నిజముచెప్పెడివాఁడును అనేకులవలనరహస్యార్థములువిన్న త్రివిధవృద్ధులనను వర్తించెడువాఁడునుగానున్నాఁడనిభావము.

[†] (ప్రియవాదీచ) ఈరామచంద్రుఁడుమాటలాడెడివిధముఘర్మ కాలమున గ్రీష్మోష్మతప్తమయిన స్థలమునం దొకజల్లు వానకురిసినటు లుండును. ఈప్రకారమీతఁడు మాటలాడుటదివ్యాంతఃపురస్త్రీలతోనా? లేక-తనమాతృజనముతోనా?-లేక-వసిష్ఠాదులతోనా? అనఁగా (భూతానాం) సత్తాయోగిసకలపదార్థములకును ఈప్రకారముగానేయీతఁడుం

డును. ఉండినచోటనయుండి యందఱకును సమ్మతమగునట్లు ఏదోయొక మాటచెప్పునోయనఁగా (సత్యవాదీచ) ఆ మాట భూత హితమును అదృష్టార్థసాధకమునై యుండును. పైఁజెప్పిన యీ రెంటిచేతను బ్రియహితములఁజెల్పిన ప్రకారమయ్యెను. ఇవి రెండును అన్యమగునొకవ్యక్తియందుఁజేరియుండవు. అట్టివాని రెంటిని దనయందుఁ జేర్చుకొని యుండెడివాఁడు అఘటితఘటనా సమర్థుఁడగు ఈశ్వరుఁడాయనఁగా (రాఘవః) రఘురాముఁడు. ఈగుణములితనికభిజనమువలనఁ గలిగినవే. [అనఁగానీతనికీగుణములు రఘుకులమునందుఁ బుట్టుటచేతనే కల్గినవని భావము] ఇట్లయ్యెనేని ఈలాటి గుణములు అభిజనమును తలఁచితలఁచి ఇవిమనకుఁగలవుగదాయని మదించియుండునోయనఁగా, తానవతరించినది ప్రజలరక్షణార్థముకనుక అందులకుఁదగిన గుణములుఇంకనుతనకుఁజాలవని నిరూపించిచూచి తృప్తిఁజెందక మఱియునిందులకనుకూలములగు మంచిగుణములు కలుగవలయునని తీర్థపాదుల యిండ్లకుంబోయి యా వాకిండ్లనిలిచి వేచి యుండును. (బహుశ్రుతానాం) ఒకటి రెండు నేర్చుకొనినంతనకృతార్థులమైతిమని తలంచుకొనక యొక్కొక్క విషయమును పలుమాఱుబహుకాలమువినియున్నవారు. *బహుభ్యః శ్రుతాః బహుశ్రుతాః, బహుధా శ్రుతం॥ శ్లో॥ ౧ "జ్ఞానవృద్ధాసదా రాజన్ బహవఃపర్యుపాసితాః" అన్నట్లు॥ శ్లో॥ ౨ "సర్వతస్సారమాదద్యాత్" అన్నట్లునేకులయొద్దసారగ్రహణముచేసి యున్నవారు. వృద్ధానాం త్రివిధవృద్ధానాం. శీలవృద్ధైర్వయోవృద్ధైర్జ్ఞానవృద్ధైః అన్నట్లు శీలముచేతను వయస్సుచేతను జ్ఞానముచేతను అధికులుగా నుండెడివారు. అదియును అర్థశాస్త్రము నేర్చుకొనునట్లు

* బహుభ్యః=అనేకులవలన, శ్రుతాః=విన్నవారలు, బహుధా=అనేకప్రకారముగా, శ్రుతం=వినఁబడినది.

౧. రాజన్=ఓరాజా, జ్ఞానవృద్ధాః=జ్ఞానాధికులు. సదా=ఎల్లప్పుడు, బహవః=అనేకులు, పర్యుపాసితాః= అనువర్తింపఁబడిరి.

౨. సర్వతః=అంతటు, సారం=శ్రేష్ఠమగుదానిని, ఆదద్యాత్= పరిగ్రహింపనగును.

నేర్చుకొనునోయనఁగా (బ్రాహ్మణానాం) అనుచున్నారు. క్షత్రియులు బ్రాహ్మణులనాశ్రయించివారలవలన తత్వముల నెఱుంగ నపేక్షించినవారై తల్లాభమును బొందవలసినవారుగదా? (ఉపాసితా బ్రాహ్మణానాం) అనుటచే వారలు పలుగురుగానుండుటవలన వారిని తానుండెడిచోటికిరప్పించి ధర్మసంశయములను దీర్చికొనునా యేమియనఁగా (ఉపాసితా) తానే వారుండెడిచోటికిఁజని వారలుదయచేసి చెప్పునట్లు వారిపాదపద్మములు తనశిరముసోఁక ప్రణామములుచేసి యనువర్తించువాఁడు.

శ్రీకృష్ణసూరిచరణౌ శరణం ప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు
ప్రియవాదీచయను శ్లోకముయొకటి-
యుపన్యాసము సంపూర్ణము.



శ్రీరామభద్రాయనమః.

శ్రీరాముఁడుతానువనమునకుఁబోవనుద్యుక్తుఁడై కౌసల్యాదేవియనుమతివడసి తనప్రాణనాయకియగు సీతాదేవికిఁ దెల్ప నామెయుఁదనతోవచ్చెదనని వేఁడుకొనఁగా నామెయతిసుకుమారకానవనమునందు మిగులఁకష్టపడుననుతలంపుచేతవలదనిచెప్పఁగానామె శోకసంతప్తయైకన్నులనుండి బాష్పములు కుచతటంబుపయింజాఱ చింతాక్రాంతయైనిలిచెను-అప్పుడు రాముఁడామెనుసాంత్వనముచేసెను. ఆతఁడు తన్నువదలి పోవలయునని చెప్పినమాటలకుమిగులకోపోద్దీపితమతియైరాముని ఈక్రింది శ్లోకముచేత నధిక్షేపించుచున్నది.

ఇది శ్రీరామాయణము అయోధ్యాకాండములో ముప్పదవసర్గములోనిది.

శ్లోకము॥ కింత్వావత్యతివైదేహః పితామేమిథిలాధిపః ।
రామజామాతరంప్రాప్య స్త్రియంపురుషవిగ్రహం॥ ౭॥

టీ॥ రామ=ఓశ్రీరాముఁడా, స్త్రియం=స్త్రీవలెనధైర్యశాలియు, పురుషవిగ్రహం=పైకిచూచుటకు మగవానియాకారముగలవాఁడునగు, త్వా-నిన్ను, జామాతరం=అల్లునిగా, ప్రాప్య=పొంది, మిథిలాధిపః=మిథిలాపట్టణమునకధికారియు, వైదేహః=విదేహదేశమునకురాజును, మే=నాకు, పితా=తండ్రియునగు జనకరా

జు, కింవక్ష్యతి=ఏమిచెప్పఁగలఁడు. అమన్యత అనియు పాఠముగలదు. అప్పుడుఏమి తలంచును అనియర్థము.

తా॥ ఓరాముఁడా స్త్రీవలెలోన నధైర్యముగలవాఁడవును పైకిఁజూచుటకు పురుషాకారముగలవాఁడును అగునిన్ను తనకల్లునిఁగాఁబడసి మిథిలాపట్టణాధికారియు విదేహదేశాధీశుఁడునగు నాతండ్రియేమనఁగలఁడు-

పితృవచనమును పరిపాలించుటకు॥ శ్లో॥ ౧ "వనవాసోమహోదయః" అన్నట్లు పౌరజానపదులు సౌముఖ్యముతో వనవాస సుముఖుఁడని యపరనామధేయ మొసర్చునటులు వనవాస సుముఖుఁడై అప్పుడు తనకుఁబట్టపుదేవియగు శ్రీజనకరాజసుతయొక్క యతి సుకుమారమైన దేహలతయందలి స్పృహణీయతను అంతరంగమునందుఁదలఁచి సీతాదేవికి "మేముమరలనేతెంచునందాఁక యీయయోధ్యానగరమునందుండిశ్వశ్రూశ్వశురాది పరిపాలనముసేయుచుండుము" అని శ్రీరామచంద్రుఁడు ఆనతియ్యఁగా ఆమాట సీతాదేవికి వ్రణక్షారముంబోలెనసహ్యమయి ప్రణయాభిమానములు వ్యతిక్రమము లయినందుననీశ్లోకముచే నామెక్షేపోక్తి సేయుచున్నది. కిం. అనునది కుత్సాపరమైనయవ్యయము. అప్పుడు కింవక్ష్యతియనఁగా కుత్సాపరముగాఁ జెప్పుననుట. లేక. కిం అనునది ప్రశ్నమగునప్పుడు ఏమిచెప్పునని యర్థము. అమన్యత అని పాఠమగు నప్పుడు కుత్సావిషయముగా దలంచుననియు ఏమి తలంచుననియు రెండు విధములగు నర్థములు వివక్షింపనగును. (త్వా) ప్రుచ్చిపోయియున్నప్రాఁతవిల్లు విఱిచిలోకమును ఉన్మత్త కాయదన్నట్లు భ్రాంతముగాఁ జేసిననిన్ను (త్వా) వసిష్ఠానువర్తనము సేయుచుండుటవలన నావలె సూక్ష్మ ధర్మముల నెఱింగినవాఁడు లేఁడని ఊరకయ గర్వించియుండెడి నిన్ను. (త్వా) అవశ్యకర్తవ్యములయం దసమర్థుఁడగునిన్ను. (కింత్వామన్యత-కింవక్ష్యతి) రాజుకావని చెప్పఁగూడదే. రాజధర్మముల నెఱుంగనివాఁడవు అనఁగూడదే. గురుకులవాసముచేసి యెఱుంగవు అని చెప్పఁగూడదే. కులక్రమాగతమగునాచారము నెఱుంగవుఅనిచెప్పగూడదే. (కింవక్ష్యతి) జనకుఁడేమి

౧. వనవాసః=అరణ్యవాసము, మహోదయః=గొప్పయభ్యుదయముగలది.

చెప్పఁగలఁడు. కులస్త్రీలకు భర్తృసహవాసమావశ్యకమని యెఱుంగవని చెప్పఁగూడదే. (కింవక్ష్యతి) కులస్త్రీను పేక్షింపమికిప్రథమపరికరముగానుండెడి యేకదారావ్రతత్వము నీకులేదని చెప్పఁగూడదే. కింబహునా- దేవరవారియనుష్ఠానమును జూచునెడ నిది గొప్పతప్పిదమనియుండు నింతియే గదా. (కింత్వామన్యతవై దేహః) నిన్ను మాయయ్య యేమని తలంచును. మామగారగు దశరథచక్రవర్తిచేతి కైనను అత్తగారగు కౌసల్యాదేవిచేతికైనను గాదుకదా నన్నొప్పగించినది. ఇయంసీతా అని మీచేతికేఁగదా నన్ను ఇచ్చినది. స్త్రీత్వమునందుఁగొఱంత లేనియబలలకుభర్తృవిరహము నందుసత్తానాశము కలుగుననియుఁ జెప్పియిచ్చెనుగదా? (¶ఇయం) ఇది యత్యంతాభిమానినియని చెప్పియిచ్చెనే॥ శ్లో॥ ౨ "ఆర్తార్తేముదితేహృష్టా ప్రోషితే మలినాకృశా । మృతేమ్రియేతయా పత్యౌసా స్త్రీజ్ఞేయాపతివ్రతా" అనునిత్యాది వాక్యములచే మన్వాదిస్మృతికర్తలు నిరూపించిన పత్నికాదుసుమీ. ఈలక్షణనిరూపణము భర్తకునుతమకును ఎడఁబాటు గలిగనేని దేహమునుప్రాణములనుధరియించి యుండెడివారలకుఁగాదా? ఈమెకు దేహమును ప్రాణములును దేవరవారే యనిదృఢముగాఁ జెప్పియిచ్చెనే. (¶ఇయం) నీడతోనెడఁగోరువారలు లేరుసుమా యని చెప్పెనే (¶ఇయం) ఈమెవలన నేదైనకొఱంత గలిగినను అది దేవరవారిదిసుమీ యని చెప్పెనే (¶సీతా) స్త్రీలకుతల్లియొక్క స్వభావమువిశేషించియుండునుగాన నీమె తల్లియగుభూమిదేవియొక్క గంధగుణమువలె ననుభవైకోచితసుమీ? కాన పరిగ్రహించి వినియోగపఱచుకొనుమని చెప్పెనే

---

౨. యా=ఏస్త్రీ, పత్యౌ=భర్త, ఆర్తేసతి= దుఃఖితుఁడుకాఁగా, ఆర్తా =తానుదుఃఖితురాలయి, ముదితే=భర్తసంతోషమునొందినప్పుడు, హృష్టా= సంతోషవంతురాలయి, ప్రోషితేసతి= నాయకుఁడు దేశాంతర గతుఁడుకాఁగా, మలినా=మురికిఁజెందినదియును, కృశా = చిక్కినదేహముగలదియునై, మృతే= చావఁగా, మ్రియేత-చచ్చునో, సా స్త్రీ=ఆకాంత, పతివ్రతా=పతివ్రతగా, జ్ఞేయా =ఎఱుంగఁదగినది.

(¶సీతా)పుట్టినప్పుడుగీఱదాఁటకపుట్టినదియని చెప్పెనే. మమసుతా ఈమె
నుచూచిగాదు. నన్నుఁజూచి ప్రవర్తింపవలయుననియనెనే. (¶సహధర్మ
చరీ) ఈమె దేవరవారి యుద్యోగమునకు కూడవెంచేయునట్టిది యనెనే.
(¶తవ) సహధర్మచరియగునప్పుడును శేషత్వమును చెయిజాఱవిడువదు
అనియనెనే. (¶ప్రతీచ్ఛ) మీకుఅర్హయగునట్లుఅంగీకరించవలయుననెనే.
(¶చ) అర్హతాజ్ఞానముమాత్రమే గాకవిషయవైలక్షణ్యాను రూపముగా
భోగమునొసంగి కృతార్థురాలింగాఁజేయవలయుననెనే.(¶ఏనాం)ఇట్లు
నోములునోచి కన్నయీమెను.(¶భద్రం తే)ఇట్లునోములునోచి కంటినంతి
యకానిఫలము దేవరవారిదిసుమాయనియనెనే. భోగ్యవస్తువుయొక్క మేలి
మి యంతయుభోక్తకేకదఫలమగును(¶పాణింగృహ్ణీష్వ)ఈమెచేయిచాఁపి
యెఱుఁగదుసుమీ! నీవేయీమెహస్తమునుపట్టుకొనుమనియనెనే. హస్తము
పట్టుకొనుటహస్తముచేతనేగదా. లోకమంతయు తనయందుఁజేరినసుపో
ష్యవర్గము కొంచెముగఁగనఁబడునట్టి వీరస్తుతిగల దేవరవారిబాహువుల
యందుఁగన్పించియది తగినకార్యములుజరప శక్తిగలదగుటచేత పట్టు
కొనుమని విశేషించిచెప్పెనే. ఇట్టిదశలయందు కూడఁగొనిపొమ్మని తెల్పు
టకేకదా పాణినాయని విశేషించి వర్ణించినది. ఈయభిప్రాయముల నెల్ల
వానిని దేవరవారు అంతరంగమున గ్రహింపలేదు- మీయొక్క ప్రతిపత్తి
యన్యథాగానుండెనుగదా? ఇయం అనుటచే నాయొక్క సౌందర్యము
దెల్పుచున్నాఁడని యనుకొంటివి. సీతా అనుటచే నాయొక్క మాతృకుల
శుద్ధిఁజెప్పుచున్నాఁడని తలంచితివి- మమసుతా అనుటచేత నాయొక్క
పితృకుల శుద్ధి వకాణించుచున్నాఁడని యెంచియుంటివి. సహధర్మచరీ
అనుటచేత నాయొక్క సౌశీల్యము నుడువుచున్నాఁడని గ్రహించితివి. తవ
అనుటచేతనిన్నుస్తుతించుచున్నాఁడనియభిప్రాయపడితివి. ప్రతీచ్ఛ అనుటచే
వచ్చిన వలదనను పోయినవెనుకను అని యనాదరణతోగాక యాదర
పూర్వకముగా పరిగ్రహింపుమనియెనని తలంచితివి. చకారముచేతనీకం
టకేఁ గంటగించెనోయని యడిగెనని యుంటివి. ఏనాం అనుటచే నాకుఁ

తండ్రిగనుక నా సౌందర్యాదులనుచూచి వాత్సల్యముచేత నుపన్యసించుచున్నాఁడనుకొంటివి. భద్రంతే అనునప్పుడు నాయందలిప్రేమకంటెశతగుణమైన ప్రేమనీయందుఁ గలిగి దృష్టిదోషము సంభవించునోయనియెంచి భయపడినీకురక్షచేసెననియనుకొంటివి. పాణింగృహ్ణీష్వపాణినాఅనుటచేత క్రియాకలాపాంగభూతములగు కార్యములనుచేయుమని చెప్పెనని యనుకొంటివి. అట్లు సర్వజ్ఞుఁడైన మాయయ్య వచియించినమాటకు చక్కనితాత్పర్యమెఱుంగక ఇచ్చోట నన్నునిచిపోతివేని (కింత్వామన్యత) నిన్నుఆయనయేమనితలంచును. (వైదేహః) శ్లో॥ 3 "కర్మణైవహిస ంసిద్ధిమాస్థితాజనకాదయః" అన్నట్లు క్రియాకలాపాదుల చెయిజాఱవిడువక మోక్షసిద్ధికియత్నించెడువాఁడుగానఒకముహూర్తకాలమైననుపత్నీవియుక్తుఁడైయుండివాడుకలేనివాఁడు. (వైదేహః) జన్మప్రభృతిగా శోకమనుభవించియెఱుంగనివాఁడు. అట్టివాఁడునన్నుఁగన్నందున నన్నిటినియనుభవింపవలసివచ్చెనే. (పితామే) కుమారులుసమర్థులయిరేని వారలగుఱించి తామేమియుశ్రద్ధపుచ్చుకొనక తపోవనమునకుఁ జనువారలుకలరు. కుమారీజనవిషయమట్లుకాదు. ఏనిమంత యసమర్థనయినను ఆతనికి సంకటమొక్కటియేకదామిగులును. సన్నిధివిడిచి వేఱుగానుండుటకును విరహముసహించుటకునుశక్తుఁడగు కుమారునిఁగనక భర్తయొక్కయండగలదేనిజీవించుచు అదియెడఁబాయ సత్తానాశముకల్గునట్లుండెడి నన్నుగనిచెడిపోయెనే. (మిథిలాధిపః) అయ్యయొక్క అంతరంగమునొచ్చెనేని యాదేశమెల్లనొచ్చునే. (మిథిలాధిపః) ఒకదేశమును తనబాహుచ్ఛాయయందణఁగించికొనియుండెడివానికి "ఒకఁడొక్కతెను దనబాహుచ్ఛాయయందణఁగించుకొనఁ జాలకపోయెనని విన్నమాత్రమున నేమిదోఁచును. అదియాతనికరుంతుదముగానుండునే. (రామ) అయోధ్యేశ్వరీరమందలి స్పృహణీయత నీయంతరంగమున నుండకపోయెనే. (రామ)

3. జనకాదయః = జనకుఁడుమొదలగువారు, కర్మణైవహి = కర్మమువలననే గదా, సంసిద్ధిం = మోక్షసిద్ధిని, ఆస్థితాః = పొందిరి.

అంతరంగముగని నీకు శత్రుఘ్నుఁడని పేరిడలేదే. అది కడగొట్టుగా నుండెడి మీతమ్మునికయ్యెనే. శ్లో॥ ౪ "రామఇత్యభిరామేణ వపుషాత స్యచోదితం । నామధేయంగురుశ్చక్రే జగత్ప్రథమమంగళం" అన్నట్లు మీసౌందర్యమాత్రమునకేకదా వసిష్ఠమహర్షి పేరుపెట్టినది. ఆజగత్తు తోనాకును అంతర్భావముగలదుగదా? (రామ) శ్లో॥ ౫ "శ్రీసహస్ర నామతత్తుల్యం" అన్నట్లు ఈనామముసహస్రనామములుగలశక్తికి సదృ శమయి ప్రత్యేకముగనొకొక్కదానితోను తులదూఁగుచున్నది. అయిన నీవుచెప్పెడిప్రకారము నీతండ్రికి మనస్సమాధానము చేయించవలయునా యేమి? నాతండ్రిమనస్సునకుఁదృప్తిగా నడచుట చాలదోయనఁగా (జా మాతరం) మీతండ్రికి జ్యేష్ఠకుమారుఁడయినట్లుమాతండ్రికిఁగూడఅల్లుఁడ వైతివే? (జామాతరం) శ్లో॥ ౬ "జామాతాదశమోగ్రహః" అన్నట్లు ఆఁడుకూఁతుంగనిచ్చినవారికి లోకులకువలె తొమ్మిదిగ్రహములుగాక అధికముగామఱియొక్కటిచేరి పదిగ్రహములుగాఁగదాయుండును. (ప్రా ప్య) తానేయిష్టపడిచేసినదిగాన మఱియొక్కరిమొగముంగాంచి కట కటపడుటకు హేతువులేదే. (స్త్రీయంపురుషవిగ్రహం) నీవు వేషా లంకారములు మాఱినయొకమగువయయితివే? (పురుషవిగ్రహం) ఆ స్త్రీత్వమైనస్థిరమయ్యేనేనియడవియందునుతోడగును.(పురుషవిగ్రహం) ఆపాతప్రతీతిగాఁదోఁచెడు మగతోలుగదా యిట్లువంచింపఁజేసెను. (పు రుషవిగ్రహం) నాఁపచేనికిఁబెట్టిన వెలబొమ్మ ఆకారమాత్రముచేఁ

౪. గురుః=సూర్యకులమునకు గురువగువసిష్ఠుఁడు, తస్య=ఆదశరథచక్ర వర్తి ప్రథమకుమారునికి, అభిరామేణ=మనోహరమగు, వపుషా = శరీరముచేత, జగత్=లోకమునకు, ప్రథమమంగళం = ముఖ్యమంగళమగు, ఉదితం=కలిగినట్టి, రామఇతినామధేయం=రాముఁడనెడిపేరును, చక్రే=చేసెను.

౫. సహస్రనామతః=సహస్రనామములతో, తుల్యం=సమానమైనది,రామ నామము.

౬. జామాతా=అల్లుఁడు, దశమః=పదవదియగు, గ్రహః=గ్రహము. గ్ర హమువలెపీడిచెడివాఁడనుట.

బురుషునిబోలియుండి పైఁబడియితరులనుగొట్టలేనట్లు పురుషుఁడనునామమునుమాత్రము మోయుచున్నవాఁడవుకావా? అంతరంగములో స్త్రీయును బహిరంగములోపురుషుఁడుగానుండిన స్త్రీపురుష భావములకలయికను ప్రజలు తృతీయప్రకృతియని చెప్పుదురు. అట్టి తృతీయప్రకృతికి జనులుచెప్పెడు నామధేయమును నేఁజెప్పవెఱచితిని. నేను జెప్పకపోయినను లోకులుచెప్పకపోదురా? వారలకుఁగూడభయమా? ఇట్టికృత్యముమగధీరుఁడనియెడి ప్రసిద్ధికితకుఁవగాదా యనుచున్నదాననింతే.

శ్రీకృష్ణసూరిచరణౌ శరణం ప్రపద్యే.

ఇది తనిశ్లోకీయను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు
కింత్వామన్యతఅను శ్లోకముయొక్క
యుపన్యాసము సంపూర్ణము.

---

శ్రీరామభద్రాయనమః.

శ్రీరాముఁడు తనవిరహంబుసైఁపక మిట్టిమీసైపడుచున్న సీతాదేవినిగాంచి ప్రేమవిహ్వలుఁడై తనతోడనరణ్యమునకురమ్మని యామెకాజ్ఞసేయఁగా నంతకుమున్నెయచ్చోటికేతెంచియున్న లక్ష్మణుఁడు వారలసంవాదమువిని శోకవిహ్వలుఁడై యిట్లుచేసెనని యీక్రిందిశ్లోకముచేత ఋషిచెప్పుచున్నాఁడు. ఇదిశ్రీరామాయణము అయోధ్యాకాండములో ముప్పదియొకండవసర్గములోనిది.

శ్లోకము॥ సభ్రాతుశ్చరణౌగాఢంనిపీడ్యరఘునందనః।
సీతామువాచాతియశాః రాఘవంచమహావ్రతం॥ ౮॥

టీ॥ రఘునందనః= రఘుకులమునఁబుట్టినవారికిసంతోషకరుఁడును, అతియశాః=విశేషమగుయశస్సుగలవాఁడును అగు, సః=ఆలక్ష్మణుఁడు, భ్రాతుః=అన్నయగురామునియొక్క, చరణౌ=పాదములను, గాఢం=దృఢముగా, నిపీడ్య=పట్టుకొని, సీతాం=సీతాదేవినిజూచి, మహావ్రతం = గొప్పవ్రతముగలవాఁడగు, రాఘవంచ=రఘురామునిగూర్చి, ఉవాచ=చెప్పెను.

తా॥ రఘుకులమునఁబుట్టినవారికి సంతోషకరుఁడును గొప్పయశస్సుగలవాఁడునుఅగులక్ష్మణుఁడు అన్నపాదములుగట్టిగాఁబట్టుకొని సీతాదేవినిజూచి ఆశ్రితులనురక్షించెదననియెడి గొప్పవ్రతముగలవాఁడైన రామునితోనిట్లనియెను.

శ్రీరామ చంద్రుఁడు తాను వనవాసమునకుఁబోవ నాయిత్తమై శ్రీయయోధ్యానగరమున నుండెడివారలకు రక్షకముగాను శ్రీభరతునికి సహాయముగాను నీవిచ్చట నేనిలువవలయునని లక్ష్మణునికాజ్ఞ సేయ అద వికిఁగూడఁబోయి యారామునికిఁ గైంకర్యముచేయ వలయుననుటయందు విశేషాభిరుచి గలవాఁడగుటచే లక్ష్మణునికి రామునివచనము అసహ్యమై తానుగూడ రావలయునని సీతాదేవియెదుట రాముని పాదముల యందు శరణాగతి సేయుచున్నాఁడు. (సః) అవతరించినచోటఁ గూడ కైంకర్యముసేయవలయునని పరమపదమునుండియనుసరించుచు అచ్చో టువదలి యాతనితోఁగూడ అవతరించి అప్పుడు॥ శ్లో॥ ౧ "బాల్యాత్ప్రభృతిసుస్నిగ్ధః" అన్నట్లు సమస్తములగు నవస్థలయందును రామునెడఁ బాయక॥ శ్లో॥ ౨ "జలాన్మత్స్యావివోద్ధృతౌ" అన్నట్లురామునియందఁ జేరియుండునప్పుడు ప్రాణధారణము చేయఁగలిగియు అది లేనియెడల శరీరవియోగ మనుభవించెడునట్టి లక్ష్మణుఁడు. (భ్రాతుః) అతనియను వృత్తినంగీకరించి యాత్రోవగా నాతనిభరించుచువచ్చెడువాఁడు-భ్రాతుః అనఁగా॥ శ్లో॥ ౩ "మాతాపితాభ్రాతానివాసశ్శరణంసుహృత్। గతిర్నా రాయణః" అన్నట్లు నారాయణునియొక్క యనియర్థము చెప్పనగును. శ్రీమన్నారాయణ చరణౌ శరణంప్రపద్యే యనుద్వయార్థమునందు ప్రథమపదమగు శ్రీమచ్ఛబ్దము షష్ఠ్యంతమని తోఁచుటకైయిచ్చటభ్రాతుః అని షష్ఠ్యంతముగాఁజెప్పిరి. భ్రాతుశ్చరణౌ అనఁగా నారాయణస్య చరణౌ

౧. బాల్యాత్ ప్రభృతి = బాల్యముమొదలుకొని, సుస్నిగ్ధః=మిక్కిలిస్నేహితుఁడు. అనఁగా రామునికిలక్ష్మణుఁడుబాల్యము మొదలుకొనిమంచిస్నేహితుఁడనుట.

౨. జలాత్ =నీటివలననుండి, ఉద్ధృతౌ=ఎత్తబడిన, మత్స్యావివ=చేపల వలె. రామలక్ష్మణులొక్కరొకరి నెడఁబాసిరేని యప్పుడు జలమునుండియెత్తఁబడినమత్స్యములవలెనుండురనుట.

౩. నారాయణః=నారాయణుఁడు, మాతా=తల్లియు, పితా=తండ్రియు, భ్రాతా=తోఁడఁబుట్టినవాఁడును, నివాసః=వాసయోగ్యమగుచోటును, శరణం=రక్షకుఁడును, సుహృత్=హితుఁడును, గతిః=ప్రాప్యభూతుఁడును, అగుచున్నాఁడు.

అన్నట్టాయెను. (చరణౌ) రెండుపాదములను, ఇచ్చట ద్వివచనమునకు ప్రయోజనమేమియనఁగా 'చరగతిభక్షణయోః' అనుటచేఁ బ్రాప్యముగాను ప్రాపకముగానుండునవియని యెఱుంగనగును. (చరణౌ) చేయిపట్టుకొని యుపేక్షించినయెడల నిరసింపవచ్చును. నిరసింపఁగూడనట్లు పాదములు పట్టికొని యుపేక్షించుట యాశ్రయించుటకు సులభోపాయము గదా? (గాఢంపీడ్య) ఎడఁబాసినప్పుడు ప్రాణములు ధరించలేని తనయభినివేశ మంతయు రామునికిఁ దెలియునటులు పట్టుకొని. (గాఢం) గాఢమనునది యథార్థముగాననునర్థముగలది. స్వీకారముయథార్థమనిభావము. (రఘు నందనః) జ్యేష్ఠానువృత్తిని మిగులయిష్టమని యద్దానియందు నిష్ఠితులగు రఘుకులీనుల నందఱను తనయభినివేశమువలనపరమానందమగ్నులనుగాఁ జేసినవాఁడు. (సీతామువాచ) శ్రీసీతాదేవినిఁ జూచి వార్తలాడెను. ఇది చరణములుపట్టుకొని చెవిలోఁ జెప్పెడువారివలెనని యెఱుంగనగును. ఆశ్రయణోన్ముఖులయిన చేతనులయొక్క మాటలువినుట శ్రీముఖమునసే గదా? (అతియశాః) మిక్కుటమగుయశస్సుగలవాఁడు. తానునురాజకు మారుఁడుగానుండియు దాస్యమునీచకృత్యమని యెంచక॥ శ్లో॥ ౪. "అహం సర్వంకరిష్యామి" అనియాపిన్నవాఁడు జ్యేష్ఠానువర్తనమేమిచేసెనో యని లోకమంతయు నాశ్చర్యపడునట్టి కీర్తిగలవాఁడు. (రాఘవంచ మహావ్రతం) మహావ్రతుఁడగు రామునిఁజూచియుమాటలాడెను. (రాఘ వంచ) శరణాగతరక్షణమునందు పురుషకారమక్కఱలేనియతిత్వరగలవా నిని. (మహావ్రతం) అభిజనమేయన్నిటికంటె మేలుగాఁగనఁబడునట్లు॥శ్లో॥౫ "అభయంసర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతంమమ" అని సర్వలోక

---

౪. అహం = నేను, సర్వం = అంతయును, (అనఁగా సర్వకైంకర్యములను) కరిష్యామి = చేయఁగలను.

౫. అభయం = భయములేమిని, సర్వభూతేభ్యః = ఎల్లభూతములవలన నుండియు, దదామి = ఇచ్చుచున్నాను. ఏతత్ = ఇది, మమ = నాకు, వ్రతం = వ్రతము. అనఁగా నెవ్వఁడు నన్నుశరణుచొచ్చునోవానికి సమస్తభూతములవలనను భయముకలుగకుండ నభయప్రదానముచేసెదను. ఇదినాయొక్క వ్రతము. (ఇది శ్రీరామునివాక్యము.)

పూజ్యమైన సంకల్పముగలవారుగదా దేవరవారు. సర్వభూతములనుచోట మీకునందంతర్భావము గలదుగాన మీవలనఁ గలిగెడి భయమును గూడ దేవరవారుపోఁగొట్టవలసినవారుగదా? అనిభావము. అతియశాః-రఘునందనః-సః- భ్రాతుః- చరణౌ-గాఢం-నిపీడ్య-సీతాం-ఉవాచ.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణం ప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణశ్లోకరత్నావళియందు సభ్రాతుః అనుశ్లోకముయొక్క యుపన్యాసము సంపూర్ణము.



శ్రీరామభద్రాయనమః.

ఈక్రిందిశ్లోకము ముప్పదియొకండవసర్గములోనిది. లక్ష్మణవాక్యము.

శ్లోకము॥ భవాంస్తుసహవైదేహ్యా గిరిసానుషురంస్యతే।
అహంసర్వంకరిష్యామిజాగ్రతస్స్వపతశ్చతే॥ ౯॥

టీ॥ (ఓరామా) భవాంస్తు=నీవో, వైదేహ్యాసహ = సీతాదేవితోఁగూడ, గిరిసానుషు = కొండచఱియలయందు, రంస్యతే = క్రీడింతువు. అహం= నేను, జాగ్రతః= మేలుకొనియున్నవాఁడవును, స్వపతః = నిద్రబోవుచున్నవాఁడవునగు, తే=నీకు, సర్వం=సమస్తకైంకర్యమును, కరిష్యామి=చేయఁగలను.

తా॥ ఓరామా నీవు అరణ్యమునకుఁబోయినప్పుడు జానకీదేవితోఁగూడకొండలయొక్క చఱియలయందు క్రీడింతువు. నీవు నిద్రించునప్పుడును మేలుకొనియుండునప్పుడును నీకుఁగావలసినపనులన్నియు నేఁ జేసెదనని భావము.

లక్ష్మణుఁడు సభ్రాతుః అనియెడి శ్లోకోక్తప్రకారము శరణాగతి చేయఁగా అట్టి శరణాగతికిఫలము కైంకర్యమని సప్రకారముగా నీశ్లోకము వలనఫలము చెప్పఁబడుచున్నదియనియైనను శ్రీమదయోధ్యానగరముననుండెడి కాలములో బత్తెముతీసికొని బంటుతనముచేసెడు వారివలె ఆనగర జనులందఱును పనులుసేయ నేనును యాదృచ్ఛికముగా కైంకర్యముసేయుచునుంటిని. అట్టినన్నుఁదనతోఁగూడ అరణ్యమునకుఁగొనిపోవ సమ్మతించెను. అనియెడి యుపకారస్మృతి రామునియెడలఁగలిగి లక్ష్మణుఁడు వనమునం

దుసర్వావస్థలలోను సర్వశేషవృత్తులను చేయఁగలను నన్నును గూడఁగొని పొమ్ము అనిచెప్పుచున్నాఁడుఅనియైనను ఈశ్లోకభావము.(భవాంస్తుసహ) కైంకర్యముచేయనిచ్చి పెట్టనినావలెగాక పూర్ణుఁడగుటచేత నేఁజేయుకైంకర్యము ఆవశ్యకములేదనినను జెల్లును. అయినను ఆశ్రితపరిగ్రహణముచే నీకు విశేషము కలదు. అదికాదిప్పుడు నేనుచెప్పునది. నాయొక్క స్వరూపసిద్ధ్యర్థము నన్నుఁగింకరునిఁగాఁ బరిగ్రహింపవలయును. కైంకర్యము చేయుచోమృగవధార్థముపోవునప్పుడు సహకరించుటగాక సీతాదేవియు మీరుకూడ వేంచేసియుండఁగా మీకిరువురకును కైంకర్యము సేయఁగలను. (గిరిసానుషురంస్యతే) ఆమెకునుమీకును కైంకర్యము చేయుచో మీరిరువురు పర్ణశాల యందుండఁ గైంకర్యము సేయుట మాత్రమే గాక జలక్రీడచేసి పర్వత ప్రాంతములయందు మీరలొండొరులు సరససల్లాపాదులచే రసించునప్పుడును కైంకర్యముసేయఁగలను. (అహం) దాస్యరసములయందు నేనొక్కరుఁడనే కైంకర్యముచేయవలయును. అట్టియవస్థావిశేషములయందును అదే స్వరూపముగాఁగలిగిన నేనే నేను. (సర్వం కరిష్యామి) వేఁటాడుటకుఁబోయినచో ధనుర్ధరుఁడై దాస్యముచేసియు కందమూలములుత్రవ్వుచో ఖనిత్రపిటకధారియై దాస్యముచేసియు[1] "ఇదం మేధ్యం— ఇదంస్వాదు" అనునట్లు మాంసపచనము చేసియు పర్ణశాలా నిర్మాణమునందు[2] "క్రియతామితిమాంవద" అనియా కైంకర్యముచేసియు పర్వతముల యొక్క నిర్ఝరముల యందు జలక్రీడసేయునప్పుడు వల్కలములను పిడిచి యెండఁగట్టియు మీరు రాక్షసులను వేఁటాడునప్పుడు కావలియుండియు సర్వశేషవృత్తులను చేయఁగలను. (జాగ్రతస్స్వపతశ్చతే) దేవరవారును సీతాదేవియు నిద్రించునప్పుడు వనమునందలి దుష్టమృగము

---

౧ ఇదం-ఈవస్తువు, మేధ్యం-పరిశుద్ధమగునది. ఇదం-ఇది, స్వాదు-రుచ్యమైనది.

౨ క్రియతాం - చేయఁబడుగాత, అని-మాం-నన్నుఁగూర్చి, వద-చెప్పుము. పర్ణశాలా నిర్మాణాదులకనువైనస్థలము తానేచూచిచేయుటయుక్తమైనను క్రియతామితిమాంవద అనిచెప్పుటయేలనఁగా తానేయనువైనచోటిదియనితలంచెనేని స్వానుభవములోచును అనిభావము.

లును దుష్ప్రకృతియగు రాక్షస జాతియును దగ్గఱకు రాకుండునట్లు ధనుర్ధరుఁడనై జాగ్రత్తతో నుండియు మీరు మేలుకొంచియుండఁగా దాస్యము చేసియు మీతోఁగూడనుండుదును.

శ్రీకృష్ణ సూరిచరణౌ శరణం ప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు భవాంస్తు సహవైదేహ్యా అను శ్లోకము యొక్క యుపన్యాసము సంపూర్ణము.

శ్రీరామభద్రాయనమః.

సీతారామలక్ష్మణులు వనమునకుఁబోవ సమకట్టి దశరథునికిని కౌసల్యాసుమిత్రలకును తక్కుంగల దశరథపత్నులకును ప్రదక్షిణనమస్కారములొనర్చినంతట లక్ష్మణుఁడు తనతల్లికి మరల నమస్కారము చేయఁగా నాతని యాదలముద్దిడుకొని యీక్రింది శ్లోకముచేత ఆతనికి హితముపదేశించుచున్నది. ఇది శ్రీరామాయణము అయోధ్యాకాండములో నలువదవసర్గములోనిది.

శ్లోకము॥ రామందశరథంవిద్ధి మాంవిద్ధిజనకాత్మజాం।
అయోధ్యామటవీంవిద్ధిగచ్ఛతాతయథాసుఖం॥ ౧॥

టీ॥ తాత=అన్నా, (ఇది ప్రేమసంబోధనము) రామం = శ్రీరాముని, దశరథం=దశరథునిఁగా, విద్ధి=ఎఱుంగుము, తలంపుము అని భావము. జనకాత్మజాం= సీతాదేవిని, మాం=నన్నుఁగా, విద్ధి=తలంపుము, అటవీం-అడవిని, అయోధ్యాం= అయోధ్యాపట్టణమునుగా, విద్ధి=ఎఱుంగుము. యథాసుఖం = సుఖమెట్లో అట్లు, గచ్ఛ=పొమ్ము.

తా॥ ఓయన్నా లక్ష్మణా రామునిదశరథునిఁగాను సీతాదేవిని నన్నుఁగాను అడవిని అయోధ్యఁగాను దలంచి సుఖముగాఁబొమ్ము అని తాత్పర్యము.

శ్రీసుమిత్రాదేవి శ్రీరామునియందుండెడి వాత్సల్యముచేతను, లక్ష్మణునియందుండెడి హితపర్వతముచేతను శ్లో॥ ౧ "అహంత్వానుగమి

---

౧. అహం=నేను, ధనుర్ధరః-ధనుస్సును ధరించినవాఁడనై, అగ్రే=నీముందట, వనం=అరణ్యమునుగూర్చి, అనుగమిష్యామి=అనుసరించివచ్చెదను. * అహం= నేను, భవతా = నీచేత, (అనఁగా రామునిచేత) అనుజ్ఞాతః = అనుమతింపఁబడినవాఁడనై, పూర్వమేవ=ముందే, యతోస్మి చ=సన్నద్ధుఁడనయితిని. మే=నాకు, ఇదానీం=ఇప్పుడు, నివారణం=అడ్డు, కిం=ఏమి, క్రియతే = చేయఁబడుచున్నది. (ఇది లక్ష్మణవాక్యము).

ష్యామివనమగ్రేధనుర్ధరః" అనియు * శ్లో॥ అనుజ్ఞాతశ్చభవతా పూర్వ మేవయతోస్మ్యహం । కిమిదానీంపునరిదంక్రియతేమేనివారణం" అనియు ఘోరాడి రామునితోఁ గూడఁ బోవ సన్నద్ధుఁడైన లక్ష్మణుని యందు శంకించి ఇచ్చట రాజగృహమున నుండెడిబంధుభోగములనులగ్గని యెంచి వెనుదీయక యెల్ల బంధువులును రాముఁడును సీతయు నే యనితలంచి వారలతోఁగూడపొమ్మని చెప్పుచున్నది. (రామందశరథంవిద్ధి) ॥ ద్ర ॥ ౨ "పెత్తార్ పెత్తొళిందార్" అన్నట్లు ఔపాధికబంధువులగు మమ్ము ఉత్కృష్టులనితలంచియుండకుము. శ్లో॥ ౩ "దేవదేవోహరిఃపితా" అనియు॥ ద్ర॥ ౪ "ఒళియుళార్ తామేయన్తెతంద్రైయుంతాయుమావార్" అని యుఁజెప్పఁబడినప్రకారము నిరుపాధికపితయగు శ్రీరామునిరక్షకునిఁగా నెంచిపొమ్ము. (మాంవిద్ధిజనకాత్మజాం) అట్లు ఔపాధికమాతయగు నన్నునుత్కృష్టయనితలంచియుండకుము. శ్లో॥ ౫ "త్వంమాతాసర్వలోకానాం" * అఖిలజగన్మాతరం,, అనియు చెప్పినట్లు సీతాదేవి నేరక్షకు రాలనితలంచుకొనిపొమ్ము. (అయోధ్యామటవీంవిద్ధి) శ్లో॥ ౬ "యత్రనాస్తిహరి స్తత్రనవస్తవ్యంకృతాత్మనా । వస్తవ్యంతత్రతత్రైవయత్రాస్తే మధుసూదనః" అన్నట్లు రామచంద్రునిసన్నిధిలేని రాజగృహముఁగోర

---

౨. పెత్తార్ = కన్నవారు. తల్లిదండ్రులు, పెత్తు = కని, ఒళిందార్ = చచ్చిరి.

౩. దేవదేవః = దేవతలకు దేవుఁడగు, హరిః = విష్ణువు, పితా = తండ్రి.

౪. ఒళియుళార్ = తేజోవంతులు, అనఁగా ప్రకృత్యతీతులు తామేయన్తె = తమరే గదా, తంద్రైయుంతాయుమావార్, తల్లితండ్రులుగానగుదురు. ఇప్పటివ్యావహారికమాతాపితృలు తల్లితండ్రులు గారనుట.

౫. త్వం = ఓలక్ష్మీ - నీవు, సర్వలోకానాం = ఎల్లలోకములకు, మాతా = తల్లి యగుదువు. * అఖిలజగత్ = ఎల్లలోకములకు, మాతరం = తల్లియగులక్ష్మిని.

౬. యత్ర = ఏచోట, హరిః = విష్ణువు, నాస్తి = లేఁడో, తత్ర = ఆచోట, కృతాత్మనా = ఆత్మజ్ఞుఁడైనవానిచేత, కదాచన = ఒకప్పుడును, నవస్తవ్యం = వాసము చేయఁదగదు. యత్ర = ఏచ్చోట, మధుసూదనః = విష్ణువు, ఆస్తే = ఉన్నాఁడో, తత్ర తత్రైవ = ఆయాచోట్లయందే, వస్తవ్యం = వసింపఁదగును.

కుము. అతఁడుగోరియున్నయడవి మేరతుకమని యేంచిపొమ్ము. †౧ లేక - (రామందశరథంవిద్ధి) లోకమర్యాదచే తండ్రినెడఁబాసితినని తలంపవలదు॥ ౭ "జ్యేష్ఠోభ్రాతా పితృసమః" అనియెడి మర్యాదచే మీయన్నగారినే మీయయ్యగాఁదలంచికొనిపొమ్ము. (మాంవిద్ధిజనకాత్మజాం) ఆమర్యాదచేత వదినెగారిని నావలెతల్లిగాఁదలంచికొనిపొమ్ము. (అయోధ్యామటవీంవిద్ధి) అడవినిఁ నని తలంచియుండకుము. రాముఁడు ఇష్టపడినదిగాన అడియయోధ్యవంటిదియని స్మరించుకొనుచుపొమ్ము. † ౨ లేక - (రామందశరథంవిద్ధి) కషాయపానమునకుంబోలె శాస్త్రవశ్యుఁడవుగాఁ బ్రవర్తింపవలసినది లేదు పాలేమందయినవిధమున రమయ తాంవరుఁడుగానొప్పు రామచంద్రుఁడు గనుక దానికిమూలముగు గుణవత్తచే విచారింప॥ శ్లో॥ ౮ "గుణైర్దశరథోపమః" అన్నట్లు మీయయ్యతో సమానుఁడుగానుండునని తలంచియుండుము. (మాంవిద్ధిజనకాత్మజాం) నేనుమీయయ్యకు అనుగుణనై యుండునట్లు॥ ద్ర॥ ౯ "ఉనక్కేఱ్ఱకోలమలర్పావై" అనియు, తుల్యశీలవయోవృత్తాం,, అనియుఁజెప్పబడినట్లు ఈసీతయును రామచంద్రుని కనుగుణమైనయాకారముచేతనీయందువాత్సల్యముతోనుండునుఅని తలంచియుండుము. (అయోధ్యామటవీంవిద్ధి) శ్లో॥ ౧౦ "రామాభిష్టవసంయుక్తాః, అన్నట్లు రాజనగర మనుకూలమైయుండెడివిధముగనే॥ శ్లో ॥ ౧౧ "మంగళానిప్రయుంజానాః" అన్నట్లు ఆయడవియు ననుకూలముగానుం

౭. జ్యేష్ఠః= మొదటివాఁడగు, భ్రాతా= తోఁబుట్టువు, పితృసమః= తండ్రితో సమానుఁడు.

౮. గుణైః= గుణములచేత, దశరథోపమః = దశరథునితో సమానుఁడు. రాముఁడు.

౯. ఉనక్కు= భగవంతుఁడవైననీకు, ఏర్కుం= తగినట్టి, కోల= అందమగు, మలర్ =పుష్పమువలెసుకుమారయగు, పావై = స్త్రీ,

౧౦. రామ= శ్రీరాముని, అభీష్టవ= స్తుతియించుటలతో, సంయుక్తాః= కూడికొన్నవారలు, పౌరులు.

౧౧. మంగళాని= మంగళములను, ప్రయుంజానాః= ప్రయోగించెడివారు, ఋషులు. అనఁగా రామునికిమంగళమగుగాకయని యెల్లఋషులు అనుసంధించుచుండిరనుట.

డుననితలంచియుండుము.¶3-లేక (రామందశరథంవిద్ధి) మిమ్ము నెడఁబాసిన మీయయ్య యిఁక జీవించియుండెడివాఁడు కాఁడు. ఇఁకమీఁదయెల్లవావి వరుసలు రామునియందేయారోపించుకొనియుండుము. (మాంవిద్ధిజనకాత్మజాం) వ ॥ ౧౨ "అసత్సమావిధవా" అనుమర్యాదచేత నేనొకర్తెను ఉన్నాననితలంపవలదు. నావదునయుసీతాదేవియందేయున్నదనితలంచియుండుము. (అయోధ్యామటవీంవిద్ధి) ఇఁకరాజధాని యొకటిగలదని తలంచియుండవలదు॥ద్ర॥ ౧౩ "పుల్లెళ్ రెళ్ళుందనకొల్" అన్నట్లు ఈరాజధానిముందే గడ్డిమొలచిపోయెనని యెంచియుండుము.¶౪ లేక (రామందశరథంవిద్ధి) మీయయ్యవలె మీ యన్నగారినిగూడ స్త్రీపరతంత్రుఁడని తలంచియుండుము. అనఁగా కైకేయిమాటలువిని యాతఁడుమిమ్మును అరణ్యమునకుఁ బంపునట్లు ఈతఁడుసీతా వచనమువినిమాయామృగము వెంటనంటిపోవునని తెలిసికొనుము. (మాంవిద్ధిజనకాత్మజాం) నేనుఇప్పుడునిన్ను పంపినట్లు ఈసీతయును ఎట్లుపోవచ్చునని సంభ్రాంతుఁడైన నిన్నుఁగూడ నిర్బంధించిపొమ్మని చెప్పిపంపునుసుమీ? (అయోధ్యామటవీంవిద్ధి) ఈరాజధానియందు నిలువనిచ్చిపెట్టక యడవికిఁబోయినట్లు ఆ యడవియందును నిల్పుటకు లేక సముద్రపుగట్టునకు పోవలయును? అనియవధానముతో నెఱుంగుము.†లేక. ౫ (రామందశరథంవిద్ధి) ఆకారసౌందర్యము మాత్రమేగలవాఁడని తలంపవలదు రాక్షసులతో విరోధము సంభవించినప్పుడు మీయయ్యవలె నొంటరిగా వీరకృత్యములు సేయఁదగు మగధీరుఁడు అనియనుకొనుము. (మాంవిద్ధిజనకాత్మజాం) ఆయుద్ధమునకై భయపడక దేవాసురసంగ్రామమున మీయయ్య వీర్యధైర్యాదులనుగాంచి మేముసంతోషించునట్లు ఆతనిమగతనముఁగాంచెదనని ॥ శ్లో ॥ ౧౪ "శత్రుహంతారం

---

౧౨. విధవా = నాయకుఁడులేనిది, అసత్సమా = లేనిదానితో సమానురాలు.

౧౩. పుల్లెళ్ రెళ్ళుందనకొల్ = జనసంచారములేకపోవుటచేత సంతటగడ్డిమొలచిపోయినదాయెను.

౧౪. శత్రుహంతారం = శత్రువులసంహరించినరాముని, పరిష్వజే = సీత ఆలింగనముచేసికొనెను.

పరిషస్వజే" అన్నట్లుమనఃపూర్వకముగాఁ బారితోషికమిచ్చెడి యొకవీర
పత్నియని తలంపును (అయోధ్యామటవీంవిద్ధి) అప్పుడీమెను రక్షించుటకు
ప్రాకారమును అంతఃపురమును గలిగినయొక రాజధానిలేదేయని తలంప
కుము వనమునకును పట్టణమునకు భేదమేమియులేదు పులినిలిచినయూరు
అనునట్లు అచ్చటనుండెడి వానివలని గౌరవముచేత నా యరణ్యముగూడ
మఱియొక్కఁ డతిక్రమింపఁ గూడనిదగునని తలంచియుండుము.¶ ౬ లేక
(రామందశరథంవిద్ధి) మీయయ్యమీవిశ్లేషమందు సహింప లేనట్లేసుమా
మీయన్నగారును॥ శ్లో॥ ౧౫ "నజీవేయంక్షణమపివినాతామసితేక్షణాం"
అనియు॥ శ్లో॥ ౧౬ "అద్యైవాహంగమిష్యామి లక్ష్మణేనగతాంగతిం" అని
యుమీయొక్క విశ్లేషమందుసహింపలేకుండును(మాంవిద్ధిజనకాత్మజాం)
ఏనిప్పుడు మిమ్మునడవికిఁబంపి॥ ద్ర॥ ౧౭ "ఎత్తుక్కెన్ పిళ్లైయైప్పోక్కినే నె
ల్లేపావమే" అని యనుతపించునట్లే యీమె మిమ్మునెడఁబాసెనేని మిగుల
క్లేశమనుభవించును. (అయోధ్యామటవీంవిద్ధి) మిమ్మునెడఁబాసి॥ శ్లో॥౧౮
"అపభ్రష్టమనుష్యాచదీననాగతురంగమా। ఆర్తస్వనపరిగ్లానా" అన్నట్లు
ఇప్పుడీయయోధ్యానగరము పడఁబోవుపాటే మీయొక్క విశ్లేషము కలిగె
నేని॥ శ్లో॥ ౧౯ "పరిశుష్కపలాశాని" అనియు॥ శ్లో॥ ¶ "అపివృక్షాః పరిమ్లా
నాః" అనియుఁజెప్పఁబడినట్లు ఆవనమును పలువగలననుభవింపఁబోవు

---

౧౫. అసితేక్షణాం = కాటుకనీటుకన్నులుగల, తాం=ఆసీతను, వినా = వదలి, క్షణమపి=క్షణమైనను, నజీవేయం= బ్రదుకను.

౧౬. అహం=నేను, అద్యైవ=ఇప్పుడే, లక్ష్మణేన=లక్ష్మణునిచేత, గతాం =పొందఁబడిన, గతిం=గతిని, (అనఁగామరణమును) గమిష్యామి=చెందఁగలను.

౧౭. ఎత్తుక్కు=ఏల, ఎన్ పిళ్లై=నాయొక్క బిడ్డను, పోక్కినేన్ = పంపితిని, ఎల్లేపావమే=అయ్యోపాపమా.

౧౮. అయోధ్యానగరము,అపభ్రష్ట = చెదరిపోయిన, మనుష్యాచ=జనులుగలదియు, దీన=విన్నఁబాటుతోనున్న, నాగతురంగమా=ఏనుఁగులుగుఱ్ఱములు గలదియును, ఆర్తస్వన=రోదనధ్వనులచేత, పరిగ్లానా=మిక్కిలిశ్రమముచేఁగలిగిన దౌర్బల్యముగలదియునయ్యెను.

౧౯. పరిశుష్క=మిక్కిలిశుష్కించిన, పలాశాని=మోదుగులుగలవి.

చున్నవి యనితలంపుము.¶ ౭ లేక (రామందశరథంవిద్ధి)రామచంద్రుఁడె ల్లప్పుడునిట్లు అపహృతరాజ్యుఁడై తిరుగుచునే యుండునని తలంపకుము నీయయ్యవలెనే కిరీటముధరియించి పదిదిక్కులయందునాజ్ఞ చెల్లించుచు రాజ్యము చేయును అనితలంపుము (మాంవిద్ధిజనకాత్మజాం) సీతాదేవి యునట్లు శరీరముసొంపుచెడఁదిరుగుచుండక నేనుమహిషీపదమునందభిక్తు రాలనై యుండునట్లు కృతాభిషేకయయిమహిషీపదముననుండి నిర్వహిం చును అని యనుకొనుము (అయోధ్యామటవీంవిద్ధి) ఇట్లు రాజ్యాభిషేక మొనర్చినయనంతరమే॥ శ్లో॥ ౨౦ "అమీజనస్థానమపోఢవిఘ్నం లబ్ధ్వాస మారబ్ధనవోటజాని। అధ్యాసతేచీరభృతో యథాస్వం చిరోజ్ఝితాన్యా శ్రమమండలాని" అన్నట్లు ఈయరణ్యముగూడ రాజధానివలెఁగాఁపుర ములు బలిసియుండును అనితలంచుము.† లేక- ౮ (రామందశరథంవిద్ధి)॥ శ్లో॥ ౨౧ "పదాతివర్జితచ్ఛత్రం" అనియు† ॥ ద్ర ॥ "తేరొబ్బిందుమావొ బ్బిందువనమేమెవి" అనియు॥ ❋ ద్ర॥ "కలై యుంకరియుంపరిమావుంతిరి యుంకానంగిడందు" అన్నట్లుఅనుసంధించినవారలుసంకటపడునట్లు ఎల్ల

---

¶వృక్షాఅపి=చెట్లును, పరిమ్లానాః=మిక్కిలివాడినవి.

౨౦. అమీ=ఈ, చీరభృతః = వల్కలధారులగుఋషులు, అపోఢ=నివర్తిం చిన, విఘ్నం=విఘ్నములుగలదియగు,జనస్థానం= జనస్థానమును, యథాస్వం=తమ దివలెనే లబ్ధ్వా=పొంది, చిరోజ్ఝితాని=రాక్షసులయుపద్రవముచేత బహుకాలము విడువఁబడినట్టివియు, సమారబ్ధ = ఇప్పుడు కట్టుటకుప్రక్రమించిన, నవోటజాని= క్రొత్తపర్ణశాలలుగలవియునగు, ఆశ్రమమండలాని=తపోవనప్రదేశములను, అధ్యా సతే=అధిష్ఠించియున్నారు.

౨౧. పదాతివర్జితచ్ఛత్రం=కాల్బలములును గొడుగును లేనట్టిరాముని †తేర్ =రథమును, ఒబ్బిందు=విడిచి, మావు=గుఱ్ఱమును, ఒబ్బిందు=విడిచి, వనమే=అర ణ్యమునే, మేవి=ప్రవేశించి,❋కలై యుం=జింకలు, కరియుం=ఏనుఁగులును, పరిమా వుం=బలిష్ఠములగు గుఱ్ఱములును, తిరియుం=సంచరించునట్టి, కానం=అడవిని,కడం దు=ప్రవేశించి—దాఁటి. వీరికి మిగుల ననిష్టముచేసినది జింకగనుక దానిని ప్రథమ మందుఁ జెప్పిరి.

ప్పుడు నీకాల్ నడయేనా? అని యనుకొనకుము. పది దిక్కులయందును పుష్పకము మొదలగు రథములమీద నెక్కి సంచరించును అనియనుకొనుము. (మాంవిద్ధి జనకాత్మజాం) ॥కం॥ ౨౨ "తున్ను వెయిల్ వరుత్తవెంబర మేల్ పంజడియాళ్. మన్నని రామఙ్ పిఙ్వైదేవి యెన్ఱు తెరిక్క మన్ననడైయవణం గునడందిన శే" అన్నట్లు సీతాదేవియు దుస్సంచారమగు నరణ్యమునందు ఎల్లప్పుడునిట్లు తిరుగుచుండునంతే యనితలంపవలదు నేనుమీయయ్యతోడ రథముమీదఁగూరుచుండునట్లు పుష్పకాదులయందు సీతయు రామునితోడఁ గూర్చుండియే తెంచును అని తలంచియుండుము (అయోధ్యామటవీం విద్ధి) ఎప్పుడు నీయడవిలోనే తిరుగుచుండవలయుననియనుకొనకుము ఇప్పుడునిత్యసంచారము చేయనన్నువై యుండునట్లువనవాసము గడచి యీరాజధానియందును నిత్యసంచారముచేయును అనితలంపుము. † ౯ లేకపితా వతా తానుపోవునట్టిచోటఁ గలిగెడు నస్వాస్థ్యముననుసంధించిపోవుటకు వెనుకదీసిన లక్ష్మణునికిసుమిత్రహితోపదేశముఖముగాఁగూడఁబొమ్మనిచెప్పినట్లుగదా దీనిచేనాపాతముగఁదోచుచున్నది. ఇట్లుచెప్పుట ॥ శ్లో॥ ౨౩ "ప్రాగేవతుమహాభాగస్సౌమిత్రిర్మిత్రనందనః । పూర్వజస్యానుయాత్రార్థే ద్రుమచీరైరలంకృతః । బాష్పపర్యాకులముఖ శ్శోకంవోఢుమశక్నువన్"

---

౨౨. తున్ను = తరుణమైన, వెయిల్ = ఎండ, వరుత్త = తపియింపఁగా, వెం = తప్తమైన-పరై మేల్-శిలాతలములమీఁద, పంజడియాళ్- దూదివలెమెత్తనైన పాదములుగల, వైదేవియెన్ఱు రెక్కు-మన్ననడైవళణంగు-వైదేహియను పేరుగలకలహంసగామిని, మన్నన్ - రాజగు, ఇరామఙ్ పిఙ్-రామచంద్రునివెంట, నడందిన శే-నడచెనే.

౨౩. మహాభాగః = మహానుభావుఁడును, మిత్రనందనః = స్నేహితులనుసంతోషపెట్టెడువాఁడునగు, సౌమిత్రిః = లక్ష్మణుఁడు, పూర్వజస్య = అన్నయగు శ్రీరామునియొక్క, అనుయాత్రార్థే = వెంబడించిపోవుటకై, ప్రాగేవతు = ఆతనికి ముందే, ద్రుమచీరైః = వల్కలములచేత, అలంకృతః = అలంకరింపఁబడినవాఁడై, బాష్ప = కన్నీటిచేత, పర్యాకుల = వ్యాకులమగు, ముఖః = మోముగలవాఁడై, శోకం = దుఃఖమును, వోఢుం = ధరించుటకు (అనఁగాతాళుటకు) అశక్నువన్ = అసమర్థుఁడునై. †మాం = నన్ను, అనుచరం = సహాయునిఁగా, కురుష్వ = చేయుము. ఇహ- ఈవిషయమున, వైధర్మ్యం = వైషమ్యము, నవిద్యతే = లేదు.

అనియు॥శ్లో॥† "కురుష్వమామనుచరంవైధర్మ్యంనేహవిద్యతే" అన్నట్లు రామునెడఁబాసి ప్రాణధారణముచేయలేని వారలకగ్రేసరుఁడైనిలిచెడిలక్ష్మణునియొక్కయునికికిసరిపడదు. ఇది సరిచేయునప్పుడుఅర్థమెట్లనఁగా. (రామందశరథంవిద్ధి)శ్లో॥ ౨౮ "అహంతావన్మహారాజే పితృత్వంనోపలక్షయే" అనిమీయయ్యయెడల నీవుఉపేక్షించియుండుటగలదు. అదివదలి శ్రీరామునిఁగనెనేయనునాకారముచేతనైనను అతనివలె నీతఁడొకఁడున్నాఁడనితలంచియుండుము. (మాంవిద్ధిజనకాత్మజాం) నన్నునాతఁడు పాణిగ్రహణముచేసెననియెడి యాకారముచేత నుపేక్షసేయక శ్రీరామునితోడిసంబంధముచేతసీతాదేవియందుఁబ్రతిపత్తిచేసియుండినంతమాత్రముఆతనితోడిగర్భసంబంధముచేత నేఁనొక్కతెనుగలనని యెంచియుండుము. (అయోధ్యామిత్యాది) శ్లో॥ ౨౯ "వనంనగరమేవాస్తుయేనగచ్ఛతి రాఘవః" అన్నట్లు రామచంద్రుఁడుప్రియపడినయడవియె రాజధానిగాఁదలంచి యీయూరి నుపేక్షించుటయొక్కటినీకుఁగలదు. రామభద్రుఁడు అట్టిపట్టణమునువదలి తమయయ్యయొక్కవచనమునకు తప్పకవనమునుగోరినట్లు తమ్మునిమాటకునుతప్పిపోక యీరాజధానినిఁగూడమెచ్చించును. దీనిని ఆతనివలెనుద్దేశ్యమనితలంచియుండుము. అనిసుమిత్రచెప్పినట్లర్థము. [అట్లయినపైనజెప్పినయర్థములెట్లుపపన్నములగుననఁగా సమాధానముదెల్పుచున్నారు] లక్ష్మణునితలంపిదియైనను రామునియందలివాత్సల్యముచేత మనస్సునకుస్వాస్థ్యములేనికాలమునఁ జెప్పెడివాక్యమైనందువలన మొదటఁజెప్పినవియు అర్థములగుటకుబాధకములేదు. కానచ్చట నుండెడికొంతలనుదలఁచి యాయాసపడక యాయాస్థలములకుఁదగినట్లు సరుదుకొనుచుఁబోవయత్నింపుము. (గచ్ఛతాతయథాసుఖం) శ్రు॥

---

౨౮. అహంతావత్=నేనో, మహారాజే=దశరథునియందు, పితృత్వం=తండ్రియనుసంబంధమును, నోపలక్షయే=కనుఁగొనను.

౨౯. యేన - ఏకారణముచేత - (వనమునకు) రాఘవః - రాముఁడు, గచ్ఛతి-పోవుచున్నాఁడు, తేనకారణేన-ఆకారణముచేత, వనమేవ-వనమే, నగరమస్తు-రాజధానియగుఁగాక.

౨౬ "యేన యేన ధాతా గచ్ఛతి తేన తేన సహ గచ్ఛతి" అనియు శ్లో॥ * "కామరూప్యనుసంచరన్" అనియు॥ § శ్రు॥ "ఛాయా వా సత్వమనుగచ్ఛేత్" అనియు" ద్ర॥ ¶ "నిழలుమడి తారుమానోం" అనియుఁ జెప్పఁబడునట్లు అనువర్తించి కైంకర్యము సేయ ప్రయత్నింపుము. (గచ్ఛ) శ్రు॥ ౨౭ "ఏతత్సామ గాయన్నాస్తే" అనియు॥ ద్ర॥ () "అందమిల్ పేరిన్బత్తడియరోడిరుందమై" అనియు ఉన్నచోటనయుండి కైంకర్యము చేయవలయునని యెడి నిర్బంధము లేదు. శైన్న విల్లియని నామధేయము సంపాదింపఁ బ్రయత్నింపుము. (తాత) పోరాడి నైనను భగవద్విషయమున నొకయడుగు పెట్టనిర్ణయించుకొనియున్నవారల గౌరవించి వార్తలాడుట మర్యాద గాన అయ్యాయని చెప్పుచున్నది. లేక (తాత) నిన్నుఁగన్న నాకును కైంకేయికిం గలిగిన పేరు కలుగకయుండునట్లు యత్నించుము అనియుపచరించి చెప్పుచున్నదియని యైనను జెప్పవచ్చును. (యథాసుఖం) † * యథాసంభవం సుఖం అనియర్థమగునప్పుడు లగ్గులును వచ్చిన వి రానిమ్ము అని భావము. [అనఁగా నీతని సుఖమునకు వైకల్యమును గొన్ని కాలములయందుఁ గలుగునని తోఁచుచున్నది] ఈతని సుఖమునకు వైకల్యమెట్లనఁగా: శ్లో॥ భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే। అహం సర్వం కరిష్యామి" అనియా మిథునమునకుఁ గైంకర్యము సేయఁ బ్రార్థించుచుండఁగా ఆతనికది లభింపక ఆదంపతులొండొరుల నెడఁబాసిన ఏకదేశకైంకర్య

---

౨౬. ధాతా - రక్షకుఁడైన పరమాత్మ, యేన యేన - ఏయేమార్గముచేత, గచ్ఛతి - పోవుచున్నాఁడో, తేన తేన - ఆయామార్గముచేతనే సహ - కూడ, గచ్ఛతి - పోవుచున్నాడు * కామరూపీ - భగవత్కైంకర్యమునకు అనువైయున్నదని తన కిష్టమైనరూపము గలవాఁడై, అనుసంచరన్ - వెనువెంటఁ దిరుగుచును. § సత్వం = ప్రాణిని, ఛాయా వా = నీడవలె, అనుగచ్ఛేత్ = అనుసరించెడిని. ¶ నిழలుం = నీడయును, అడితారుం = పాదుకలుగాను, ఆనోం = అయితిమి.

౨౭. ఏతత్ సామ = ఈసామవేదమును, గాయన్ = గానము సేయుచు ఆస్తే = ఉన్నారు. () అందమిల్ = తుదిలేని, పేరిన్బత్తడియరోడు, మోక్షసుఖానుభవము గలిగిన నిత్యసూరులతో, ఇరుందమై = ఉనికి.

† * యథాసంభవంసుఖం = గలిగినంతసుఖము.

ములభించుటయే. లేక(యథాసుఖం)అనఁగా* రామస్యయథాసుఖంభవ తితథాగచ్ఛ. అనియర్థమగునప్పుడు శ్లో॥ ౨౮ "భావజ్ఞేనకృతజ్ఞేనధర్మజ్ఞేన చలక్ష్మణ । త్వయాపుత్రేణధర్మాత్మాఽసంవృత్తఃపితామమ" అనియెట్లా రామునికినీవుండుటంబట్టి యేవిధమయినకొఱంతయులేక మనస్సునందు తృప్తియుండునో? అట్లేజాగరూకతతోఁ బ్రవర్తింపవలయుననుకొనిపొమ్ము అనిభావము. లేక(యథాసుఖం) ()అనఁగా యథాఅయోధ్యాయాంతేసు ఖంతథాతత్రాపి, అనియర్థమగునప్పుడు-నీకు రాజధానియందును సుఖహే తువగునది॥శ్లో॥ ౨౯ "ఐశ్వర్యంవాపిలోకానాం కామయేనత్వయావినా" అన్నట్లు అవిశ్లేషమేకదా. అదియంతటను ఉండుటంబట్టి నీయొక్క సౌఖ్య మునకువైకల్యములేదుసుమీ అనిభావము. ఇట్లు శ్రీసుమిత్రాదేవి రాముని యందలివాత్సల్యముచేత లక్ష్మణునిబహుముఖముగాఁ దానుశిక్షించి మా టలుచెప్పెను.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణం ప్రపద్యే.

ఇది తనిశ్లోకీయను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు

రామందశరథంవిద్ధిఅను శ్లోకముయొక్క

యుపన్యాసము సంపూర్ణము.

---

* రామస్యయథాసుఖంభవతి = రామునికిసుఖముకల్గునట్లు.

౨౮. లక్ష్మణ=ఓలక్ష్మణుఁడా, ధర్మాత్మా - ధర్మాత్ముఁడగు, మమ=నాయొ క్క, పితా=తండ్రి, భావజ్ఞేన=భావమునెఱింగినవాఁడును, కృతజ్ఞేన-చేసినమేలు మఱవనివాఁడును. ధర్మజ్ఞేనచ=ధర్మస్వరూపమునెఱింగినవాఁడును, పుత్రేణ - కు మారుఁడునగు, త్వయా=నీచేత, నసంవృత్తః-జీవించియున్నవాఁడు. అనఁగా నీవు నావద్దనుండుటంజేసి నాతండ్రియున్నట్లు తలంచెదననిభావము, రామునివాక్యము.

()యథాఅయోధ్యాయాంతేసుఖం=అయోధ్యయందు నీకెట్లుసుఖముగనుండును నో? అట్లు.

౨౯. త్వయావినా=నీవులేక, లోకానాం=లోకములయొక్క, ఐశ్వర్యం= ప్రభుత్వమును, నకామయే=కోరను.



శ్రీరామభద్రాయనమః.

శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో నరణ్యమునకుంబోఁగా దశరథుఁడుపుత్ర శోకసంతప్తుఁడై మరలతనయింటికేతెంచి కొడుకులు కోడలులేనియింటువసియించుటకు ఇష్టములేక కౌసల్యయింటికిఁగొనిపొమ్మని యాచేరువనుండెడి వారలకాజ్ఞ సేయ వారునట్లుచేసిన కౌసల్యయుసమీపంబునకురాఁగా నామెతోడ ఈక్రిందిశ్లోకము చెప్పుచున్నాఁడు.

ఇది శ్రీరామాయణము అయోధ్యాకాండములో
నలువదిరెండవ సర్గములోనిది.

శ్లోకము॥ రామంమేనుగతాదృష్టిరద్యాపిననివర్తతే
నత్వాపశ్యామికౌసల్యేసాధుమాపాణినాస్పృశ॥ ౧౧॥

టీ॥ మే=నాయొక్క, దృష్టిః=చూపు, రామం = శ్రీరాముని, అనుగతా= అనుసరించిపోయెను. అద్యాపి=ఇప్పుడును, ననివర్తతే=మరలదు. కౌసల్యే=ఓకౌసల్యా, త్వా=నిన్ను, నపశ్యామి=చూచుచున్నవాఁడనుగాను. మా=నన్ను, సాధు=చక్కఁగా, పాణినా=హస్తముచేత, స్పృశ=స్పర్శింపుము.

తా॥ నాయొక్కదృష్టి శ్రీరామునివెంటనంటిపోయెను. ఇదివరకుమరలిరాలేదు. ఓకౌసల్యా నీవునాకంటికిఁదెలియలేదు. నన్నుచక్కఁగాచేతఁదాఁకుము.

శ్రీపరాంకుశులకరణములు భగవదనన్యార్హశేషములయినవనిముడియాన్నై యనుతిరువాయిమొఴిలోఁజెప్పఁబడినట్లు చక్రవర్తికరణములు శ్రీరామునియందనన్యార్హశేషములయిన ప్రకారముదెల్పఁబడుచున్నది. (రామంమేనుగతాదృష్టిరద్యాపిననివర్తతే) సముద్రములోఁగలసిపోయిన వస్తువు మరలచేతికందునాయనుచున్నాఁడు. శ్లో॥ ౧ "సముద్రఇవగాంభీర్యే" అనియు శ్లో॥ §"సమస్తకల్యాణగుణామృతోదధిః" అనియు శ్లో॥ ()*"గుణానామాకరోమహాన్" అనియుఆరామునిసముద్రముగానిరూపణముచేసియున్నారుగదా? (రామంమేనుగతాదృష్టిః) శ్లో॥ ౨ "రామో

౧. గాంభీర్యే-గంభీరభావమునందు, సముద్రఇవ-సముద్రమువంటివాఁడు.

§సమస్తకల్యాణగుణ=ఎల్లమంచిగుణములనియెడి,అమృత=అమృతమునకు, ఉదధిః=సముద్రుఁడు.

() * గుణానాం=మంచిగుణములకు,మహాన్=గొప్పదియగు,ఆకరః=ఉనికిపట్టు

౨. రామః=శ్రీరాముఁడు, రమయతాం = సంతోషింపఁజేయువారలలో, వరః=శ్రేష్ఠుఁడు.

రమయతాంవరః" అన్నట్లు చేతనాచేతనవిభాగము లేకుండునటులుపరవ
శత్వముగల్గఁజేయువాఁడు మినమినలాడు దీఃనికొనిపోవుటతప్పిదమా?
(రామంమేనుగతాదృష్టిః)చక్షురింద్రియము రూపవంతులను గ్రహించుట
గలదుగాని రూపవంతులుచక్షుస్సునుగ్రహించుకొనిపోవుట యిదివఱకుఁ
గానము. ఇదియేమి. చక్షురింద్రియమురూపరూపిరూపైకార్థసమవేతగ్రా
హిగాఁగదానుండును. (అనుగతా) ఏమీ? పదార్థదర్శనమునకేఁదగినట్టి
యీకరణము పాదకృత్యమైన గమనమునసుష్ఠించుచున్నదే (రామంమేను
గతాదృష్టిః) శ్రు॥ యేనయేనధాతాగచ్ఛతి తేనతేనసహగచ్ఛతి" అనియు॥
శ్రు॥ కామరూప్యనుసంచరన్" అనియు చెప్పఁబడినట్లు ఆవస్తువునుఅనుస
రించిపోవుట యొకచేతనకృత్యమైయుండఁగా అట్టికృత్యమును అచేతనమ
గునింద్రియమనుష్ఠించువిధమేమిచెప్పవచ్చును. (రామంమేనుగతా) అదిచే
యునప్పు డాకదేశవిశేషమునకుంబోయి శ్రీవైకుంఠ నాథునియెడలఁజే
యునట్టి యనుధావనమును శ్రు ॥ ౩ "ఇంగేకాణవిప్పిరప్పేమకిళ్వర్"
అన్నట్లు ఈసంసారమునందు ఈరాముని విషయమునఁజేయలభించెనే.
(దృష్టీరామమనుగతా) శ్రు॥౪ "చక్షుర్దేవానాముతమర్త్యానాం" అనియు
ద్ర॥† "కణ్ణావానెన్ఱుంమణ్ణోర్కుంవిణ్ణోర్కుం" అనియుఁజెప్పఁబడినట్లుజగ
త్ప్రధాన కరణమైనది ముందుఁబోవనుద్యోగింపఁగానే శేషించియున్న
కన్నును దానివెనువెంటఁబోవనుద్యమించినయది (దృష్టిః) దృశిర్ ప్రేక్షణే
అనియెడిధాత్వర్థప్రకారము సారాసారవివేచనముచేసి విశేషగ్రహణము
నందు శక్తమయియుండుటయే ఇట్లుచేయుటకు మూలమనుచున్నాఁడు.
(దృష్టిః) మనకుఁగూడమంచిచెడుగుల నెఱింగించెడునట్టిదితనయొక్కమె
గ్గులగ్గుల నెఱుంగక యుండునా? (మేదృష్టిః) నాకుశేషమై యుండునది

---

౩. ఇంగే=ఇహలోకమునందే, కాణ=అనుభవింపఁగా, ఇప్పిరప్పే=ఈజన్మమునందే, మకిళ్వర్=పరమానందముబొందుదురు.

౪. దేవానాం=దేవతలకు, ఉత=వలె, మర్త్యానాం-మనుష్యులకును, చక్షుః=కన్ను, (చక్షుస్సగుననుట.) †ఎన్ఱుం=ఎప్పుడును, మణ్ణోర్కుం=మనుష్యులకును, విణ్ణోర్కుం=దేవతలకు, కణ్ణావాన్=చక్షుస్సగువాఁడు నారాయణుఁడు.

గదా తనకార్యమనుష్ఠించుచున్నయది. శేషభూతులగువారికి పరగతాతిశయాధానముసేయుట స్వరూపముగాన నదిచేయ నక్కఱలేదా? (మేదృష్టిః) దర్శనీయమని బహుకాలము పరిచయముచేసితిమి. (మేదృష్టిః రామమనుగతా) చిరపరిచితుఁడనైన నేనుండ నిదియాచోటనకన్ను వేసిన ప్రకారమేమియో? (మేదృష్టిః)ఇది తానుస్వతంత్రమైనను ఇట్లుచేయనగును గదే? (మేదృష్టిః) కైకేయీ మంధరలయొక్కదృష్టియయినట్టయిననిట్లుచేయదుగదా ॥ శ్లో ॥ "నందామిపశ్యన్నపిదర్శనేన" అనిదీనికిత్రోవచూపినది నేనేసుమీ, (మేదృష్టిః) చూచిన వస్తువులందెల్ల విశేషమగునిచ్ఛ గలిగియతిచపలుఁడైననాయొక్కదృష్టిగనుక నేయిట్లుచేయుచున్నది. (మేదృష్టిః) ఆవిషయమున మిక్కిలి ప్రవణమగుటంజేసియదితన్నువదలిపోవుచుండినను ఆతఁడు దానితోఁదనకుంగలసంబంధము నెత్తిచెప్పుచున్నాఁడు॥ ద్ర॥ ౫ "పెత్తతాయరైవిట్టకన్ఱు"అనిఆఁడుఁగూఁతురుతన్నువిడిచిపోవుచుండఁగా తల్లి॥ ద్ర॥ "ఎందనైమడమాన్" అనిసంబంధముచెప్పుకొనుటగలదుగదా (మేదృష్టిః రామమనుగతా) నాయొక్క యింద్రియమయియుండునది నా హృదయము ననుసరించునదిగాక రాముని ననుసరించుటేమియో. ॥ఇందులకు చింతింపవలసినదేమి? తనకువిషయమగు నంతవఱకుననుసరించియనంతరము మరలదాయనఁగా॥ (అద్యాపిననివర్తతే)॥ శ్లో॥ ౬ "అతిక్రాంతేపిరాఘవే" అన్నట్లు ఆతఁడు తనవిషయముల నతిక్రమించినను ఇప్పటికిని మరలఁగానము (దృష్టిరద్యాపిననివర్తతే) ఇచ్చోటికే తెంచె నేనిమరలకైకేయిముఖము చూడవలసివచ్చునే చేయునదేమి యనుభయముచేత నింకను రాకయున్నది (మేదృష్టిరద్యాపిననివర్తతే) ఒకనికొకక్లేశము సంభవించెనేని పరికరభూతులగువారు ప్రక్కనుజేరి యుపకరింప వలసియుండుటయావశ్యకమయిగదా యున్నది. అట్లుండ నేను రామవిరహముచేతఁగ్లేశితుఁడనైయుండఁగా నింతవఱకు ఆదృష్టివచ్చి యుపకరింప దాయెను.

---

౫. పెత్తతాయరై=కన్నతల్లిని, విట్టు=వదలి, అకన్ఱు=దవ్వయి.

౬. రాఘవే=శ్రీరాముఁడు, అతిక్రాంతేపి=పట్టణముదాఁటిపోయినను.

(మేదృష్టిరద్యాపిననివర్తతే) బహుకాలముగఁజేసిన వాసనలెల్లనుండఁగా॥ శ్రు॥ ౧ "నోపజనంస్మరన్నిదంశరీరం" అన్నట్లు నన్ను చకకగా మరచిపోయిరాకయేయున్నది (దృష్టిరద్యాపిననివర్తతే) అరణ్యమునకుం బోయిన శ్రీరామ చంద్రుని మరలించుకొని వచ్చుటకు తనచేత గాకున్నను తానైన మరలిరాఁగూడదా? (రామమనుగతాదృష్టిర్నానివర్తతే) ఏవిధముగానైనను ఆవస్తువు ననుసరించినవారలకు॥ శ్రు ॥ ౨ "నచపునరావర్తతే" అన్నట్లు మరలివచ్చుటలేకయేపోవును. మరలిరాలేదనియేలయనియెదవు. అదినిన్ను వదలిపోయినంగదా మరలివచ్చును. (నత్వాంపశ్యామి) ఓరిపాపీ దృష్టిః అని యీకనఁబడునట్టి కనుగ్రుడ్డుగాదురా నేనుచెప్పినది. చక్షురింద్రియమతీంద్రియముకాన తత్కార్యమగు దర్శనముచేత ననుమేయమైగదా యది యున్నది. పురోవర్తినియగునిన్నుఁగనుఁగొనకుండుటచేతఆయింద్రియము నన్నువదలిపోయెనని యనుచున్నాఁడు. (నత్వాంపశ్యామి) నిన్నుఁగాంచనప్పుడు కన్నులులేనట్లును నిన్నుఁగన్నప్పుడు కన్నులున్నట్లును ప్రవర్తించెడి నేను నీవు ముందునిలుచుండినను నిన్నుఁగనలేక యున్నవాఁడను. (త్వాం) నిన్ను, సన్నిహితవై యుండునప్పుడును నత్వాంపశ్యామి యనిచెప్పనేలయనఁగా * నత్వాంపశ్యామి, అపితుశ్రుణోమి, వచసాజ్ఞాతః, స్వరేణోక్తః, అనిమాటలాడుటచే ననుమించితినంతియే. చక్షురింద్రియమువిడిచిపోవుటంజేసి ప్రత్యక్షీకరింప లేనైతిననుచున్నాఁడు. (నత్వాంపశ్యామి) ఆతనిమొగమును గాంచలేకపోయినను అతనింగన్ననీముఖమునైనను గాంచవచ్చుననియుంటిని. అదియు లభింపకపోయెనే? (రామంమేనుగతాదృష్టిః నత్వాంపశ్యామి) ప్రధానపరికరమగుకన్ను ఆతనివెంటనంటి పోవుటంజేసి

---

౧. ఇదంశరీరం=ఈదేహమును, ఉపజనం=జనులదగ్గఱనుండునదిగా, నోస్మరన్ = తలఁపనివాఁడై, అనఁగాతానుమరణమునొందునప్పుడు ఈశరీరముతన బంధువులవద్దనున్నదియని స్మరింపఁగూడదనుట.

౨. నచపునరావర్తతే = అర్చిరాదిమార్గమున వైకుంఠముంజెందినవాఁడు తిరిగియీలీలావిభూతికిరాఁడనుట.

అసన్నిహిత మయ్యెను. సన్నిహిత మగునిన్ను చూచుటకశక్తుఁడనై యున్నవాఁడను. నేనేమిచేయుదును అనుచున్నాఁడు. (రామం మేనుగతా దృష్టిఃనత్వాపశ్యామి)॥ ద్ర॥ ౯ "అండర్ కోన్ అణి యరంగన్ ఎన్నముద నై కణ్డకణ్కళ్ మత్తొన్ఱినై కాణావే" అన్నట్లు ఆదృష్టియావిషయమునమనసంటి యుండుటంజేసి ఇఁక మఱియొండువస్తువ్రను చూడదనుచున్నాఁడు, ఇట్లు చక్షురింద్రియము తన కుపకరింపమిచే వాగింద్రియముం గొనిమైనను ఆశ్వసింతమనియెంచి యామె నామధేయము చెప్పియూరడిల్లుచున్నాఁడు (కౌసల్యే) ॥ శ్లో ॥ ౧౦ "ఏషమేజీవితస్యాంతో రామోయద్యభిషిచ్యతే" అని శ్రీరాముని సంబంధము కలదేనిమరణమున కుద్యుక్తురాలగు కైకేయియునొకతె॥ శ్లో॥ ౧౧ "కింపునఃప్రోషితేతాతేధ్రువంమరణమేవమే" అనియాతని సంబంధములేనియెడల మరణమునకు ప్రయత్నించెడి నీవునొకతె. [అనఁగా నొకదానికి మఱియొకటి విరోధమనుట] (కౌసల్యే) ॥ శ్లో ॥ ౧౨ "కౌసల్యాలోకభర్తారం సుషువేయంమనస్వినీ"

---

* నత్వాపశ్యామి=నిన్నుఁజూడను, అపితుశ్రుణోమి = అయినవినుచున్నాను. వచసాజ్ఞాతః=మాటచేనెఱింగినవాఁడనైతిని, స్వరేణోక్తః=కంఠధ్వనిచేఁజెప్పఁబడినవాఁడనైతిని.

౯. అండర్ కోన్=నిత్యసూరులకధిపతియై, అణియరంగన్=శ్రీరంగమునకుభూషణమైన, ఎన్నముదనై=నాయొక్కయమృతమయుఁడగురంగనాథుని, కండకణ్గళ్=చూచినకన్నులు, మత్తొన్నినై=మఱియొక్కదానిని, కాణావే=చూడనేచూడవు. తిరుప్పాణాళ్వార్ల శ్రీసూక్తి.

౧౦. రామః=శ్రీరాముఁడు, యద్యభిషిచ్యతే=పట్టాభిషేకముసేయఁబడెనేని, ఏషః మేజీవితస్యాంతః=ఈనాబ్రదుకుతుదముట్టును.

౧౧. కింపునః=ఏమియున్నది. (ఇదిమిక్కిలివ్యసనద్యోతకవచనము) తాతే=నాచిన్నియన్నయగురాముఁడు, ప్రోషితే=దేశాంతరగతుఁడయ్యెనేని, మే=నాకు, మరణమేవ=చావే, ధ్రువం=నిశ్చయము.

౧౨. మనస్వినీ= లోకమునకుక్షేమముకలుగవలయుననితలంచుచున్న. కౌసల్యా=కౌసల్యాదేవి, లోకభర్తారం=లోకమునురక్షించెడి, యం = ఏరాముని, సుషువే=ప్రసవించెనో.

అన్నట్లు నీవులోకమునకు క్షేమముకలుగునట్లుకొడుకుంగంటివి అదట్లుండ దేశమును నేనునుగూడఁ జెడిపోతిమిగదే? (కౌసల్యే త్వానపశ్యామి) అనర్థకారిణియగు కైకేయిని ఇంతవఱకు చూచినకన్నులు ఆశ్వాసకారిణి వైననిన్నుఁచూడకవిరమించినవయ్యెనే. ఈతఁడీప్రకారము హృదయశైథిల్యముగపడునట్లు కౌసల్యే అని దీనముగాపిలిచినంతనే మిక్కిలి దుఃఖితుఁడైన యీతనిని పోఁగొట్టుకొనఁగూడదు వద్ద కేగుదము అని తొందరతో సమీపముననే తెంచియిప్పుడు నేను చేయవలసిన దేమియని కౌసల్యయడుగఁగా (సాధుమాంపాణినాస్పృశ) నాయొక్క క్లేశము లెల్ల నివర్తించునట్లునీయొక్కచల్లని చేతితో నంతటఁదాఁకి యీఱడిల్లఁ జేయుమనుచున్నాఁడు. (పాణినాస్పృశ) పురోవర్తినియగునిన్నుఁజూడనందునచక్షురింద్రియము వెడలిపోయెనని యెంచుచున్నాను. నీయొక్క వాక్యశ్రవణము చేయుటచేత శ్రవణేంద్రియమున్నదని యనుకొనుచున్నాను. కౌసల్యే అని నామగ్రహణము సేయుటచేవాగింద్రియమున్నదనియనుకొనుచున్నాను. గంధగ్రహణము చేయమిచే అతని యాదలమూరొక్కన్న ఘ్రాణేంద్రియమును పోయెనని యనుకొనుచున్నాను. స్పర్శేంద్రియమేమియయ్యెనో యదియెఱుంగునట్లు నన్నుఁ గౌఁగిలించుకొని పరీక్షింపుము. దొంగలు దూఱినచోట ఉన్నది పోయినదీ వెదకెడువారివలె ద్ర ॥ ౧౩ "వందుపోనవర్ తాంవంజక్కళ్ వనిఱే, ఎన్నైంపులను మెళ్ళిలుంకొండింగెనెట్టువెళ్ళుందరుళిప్పోనపునితఱ్" అనుచున్నాఁడు గదా? (సాధుస్పృశ) ఇంతవఱకు కైకేయితోనేకీభూతుఁడై ఆతని యరణ్యమునకంపి యిప్పుడు ఇచ్చకము లాడుచున్నాఁడనితలంచియుండవలదు. అవిద్యాస్పర్శమువలన ఈకలఁత యీతనికాగంతుకము. అయ్యోపాపమీతఁడేమిచేయును. అని యెడిహృదయమునందలి కనికరముతోస్పృశింపవలయును. (పాణినాస్పృశ) నాడగ్నిసాక్షికముగ

---

౧౩. వందుపోనవర్ తాం=వచ్చిపోయినవాఁడు, వంజక్కళ్ వనిఱే=వంచకుఁడగుదొంగ? ఎన్నైంపులనుం= నాయొక్కఐదింద్రియములను, ఎళ్ళిలుం=సౌందర్యమును, కొండు=అపహరించుకొని, ఇంగెనిట్టు=ఇక్కడనుండి. ఎళ్ళుందరుళిపోనపునితఱ్=వేంచేసినపుణ్యాత్ముఁడు.

మంగళముహూర్త కాలమున కౌతుకముతోఁ బట్టిన యాహస్తముచేత ఆతలంపుతో స్పృశింపవలయును. (పాణినాస్పృశ) సర్వాంగముల చేతను నన్నాలింగనముచేసికొనియానందమధికమైగట్టుపతిక్రమించివచ్చిన ప్రవాహముపాఱిపోవునట్లు చేయక సాత్త్వించునటులు ఏకావయవముచే స్పృశింపవలయును. (సాధునాపాణినాస్పృశ) శ్రీరామునినెత్తికొనియుపెట్టుకొనియు ఆతనియంగస్పర్శముచేత పరిమిళితమైయున్న చేతితో స్పృశింపవలయును. (మాస్పృశ)=నన్నుస్పృశింపుము. రామస్పర్శము కలిగెనేనియుజ్జీవించి, అదిలభింపదేని మరించు నట్లుండెడి నన్ను ఆతనిఁగన్న నీయొకహస్తముచేత ఆలింగనముచేసికొనుము. భగవత్స్పర్శము సాక్షాత్తుగాలభింపకపోయినను అతనిసంబంధి సంబంధులస్పర్శముననేని యుజ్జీవింపవలసినట్లుగదా సిద్ధమైయున్నది ॥ శ్లో॥ ౧౪ "తాంస్పృష్ట్వామామపిస్పృశ" అనిరాముఁడు సీతాదేవిని చెందకయుండునపుడు ఇట్లనుభవించెనుగదా! (పాణినాస్పృశ) ద్ర॥ ౧౫ "అణిమిగుత్తామరైక్కైయ్యే యందోవడిచ్చియోన్దలమిశైనీయణియాయి" అనిభగవంతునివిషయమునందు చెప్పవలసినవాక్యమును అవిలభింపకపోవుటచే తదీయవిషయమునఁజెప్పచున్నాఁడు.

—* ప్రసంగవశమున అణ్డర్కోన్ అనుదాని విశేషార్థము దెల్పుచున్నారు *—

(అండర్కోన్) శ్రు॥ ౧ "యత్రపూర్వేసాధ్యాస్సంతిదేవాః" అనియు ద్ర॥ †విణ్ణోర్ పరవుంతలైమకన్" అనియు॥ ద్ర॥ § అయర్వారుమను

---

౧౪. తాం=ఆసీతాదేవిని, స్పృష్ట్వా=తాఁకి, మామపి=నన్నును, స్పృశ=తాఁకుము. సీతావిరహఖిన్నుఁడై వాయువును గూర్చిచెప్పెడు రాముని వచనము. ఆసీతాదేవిని తాఁకినందున తత్సంబంధము నాకాప్యాయితమైయుండునని భావము.

౧౫. అణి=అలంకారము, మిగు=అతిశయించిన, తామరైక్కైయ్యే=కమలమునంటి చేతిని, అడిచ్చియోందలమిశై = దాసభూతులగుమాశిరములమీఁద, నీ=నీవు, అణియాయి=అలంకరింతువుగాక.

౧. యత్ర=ఏస్థలమునందు, పూర్వే=మునుపటిపెద్దలును, సాధ్యాఃదేవాః=సాధ్యులనెడిదేవతలును, సంతి=ఉన్నారో † విణ్ణోర్=దేవతలు, పరవుం=స్తుతి

ర్గళ్ అధిపతి” అనియు చెప్పఁబడినట్లు అస్పృష్ట సంసారగంధులగు నిత్యసూరులకు నిరుపాధిక నిర్వాహకుఁడైనవాఁడని యెడి గౌరవముగలవాఁడు. (అండర్కోన్) వేలువేలుగా కిరీటాధిపతులయి నిరపేక్షులగువారలయొక్క పెద్దగుంపునకు నియామకుఁడైయుండెడివాఁడు. (అండర్కోన్) ద్ర॥ ౨ “మనిశర్కు తేవర్ పోల దేవర్కుం దేవావో” అనియు శ్రు॥ ※“పరః పరాణాం” అనియుఁ జెప్పఁబడునట్లు మనుష్యులలో నత్యంతవిలక్షణులగు నిత్యసూరులకును మించియుండెడివాఁడు. ఇట్లునిడుపాటినిచ్చైన వేసికొని యెక్కవలసినట్లు అతిదూరమై అగమ్యమగు స్థలమున నున్నాఁడా? అనఁగా (అణియరంగన్) ఆకొంతదీఱునట్లు తన్ను అతిసులభునిఁగాఁ జేసినవాఁడు. (అణియరంగన్) ద్ర॥ 3 “అరంగత్తరవణైప్పళ్లియాన్” అన్నట్లు కదలుట మెదలుట లేక స్థావరప్రతిష్ఠగా వచ్చి పరుండియున్నవాఁడు. శ్లో॥ ౪ “శేష్యే పురస్తాచ్ఛాలాయాః యావన్మే న ప్రసీదతి” అన్నట్లు ఆతనివిషయమున మనము చేయవలసినట్టిదానిని “తాఁ జేయఁబూని పంటకాపులు పండినచేల వెంబడి గుడిసెలు వేసికొని పరుండునట్లు” జీవసంరక్షణార్థము వచ్చి లేవకయె పరుండియున్నవాఁడు. (అణియరంగన్) అండర్కోన్ అనఁబడుచో ఆ నిత్యసూరులును తన్ను సమీపించలేని మహామహిమతో “దహ పచ” అని వారలకు నియామకుఁడగుచు తనకదినిరూ

---

యించెడు, తలమకన్ = ప్రభువు. § ఆయర్వరుం = అజ్ఞానము లేని, అమరర్ కళ్ = దేవతలకు, అధిపతి = అధికారి.

౨. మనిశర్కు = మనుష్యులకు, తేవర్ పోల్ = దేవతలవలె, దేవర్కుం = దేవతలకును, దేవావో = దైవతమైనవాఁడవు, ※ పరాణాం = ఎల్లవారలలో శ్రేష్ఠులయిన బ్రహ్మరుద్రాదులకంటె, పరః = శ్రేష్ఠుఁడైనవాఁడు.

3. అరంగత్తు = శ్రీరంగములో నుండు, అరవణై = సర్పశయ్యను, పళ్లియాన్ = పాన్పుగాఁగలవాఁడు.

౪. యావత్ = ఎంతవఱకు, మే = నాయెడల, న ప్రసీదతి = ప్రసన్నుఁడవు కావో, తావత్ = అంతవఱకు, శాలాయాః = ఇంటికి, పురస్తాత్ = ఎదుట, శేష్యే = పరుండెదను.

పకమైయుండునటులు వర్తించెడువాఁడు ఇచ్చట దేశికులలో తానొక్క రుఁడైకలసిమెలసి ద్ర॥ ౫ "పునలరంగమూర్" అనిచెప్పినటులు సులభుఁడుగానున్నాఁడు. (అణియరంగన్) అప్రాకృతమగు దేశమునువదలి చేతనులుతన్నాశ్రయించునటులు ఈప్రపంచమునకాభరణమైన శ్రీరంగ క్షేత్రముకోరియున్నవాఁడు. ద్ర॥ ౬ అండరోర్కోన్ అమరుంశోలైయని చెప్పఁబడియుండలేదా? ఇది దేవాధిపుఁడువసియించెడునికుంజముగదా? (అణియరంగన్) ప్రతిదినమును శేషవస్తువులనుసంపాదించుటవలన నిత్యోత్సవముగలదై॥ శ్లో॥ ౭ "సిక్తరాజపథాంకృత్స్నాం ప్రకీర్ణ కమలోత్పలాం" అనియు॥శ్లో॥ పతాకాధ్వజమాలినీం" అనియు ద్ర ॥ తిడొక్కడిమదిళ్ శూళ్న్దతిరువరంగత్తాయ్" అనియుచెప్పఁబడునటులు నిత్యాలంకృతమగు శ్రీరంగమందువర్ధిల్లుచున్నవాఁడు. (అణియరంగన్)॥శ్లో॥ ౮ "దేశోయంసర్వకామధుక్" అన్నటులు పరమప్రాప్యుఁడగువానినిగూడ ఇచ్చటికిఁబిలచిపెట్టుకొని తనయందేకరాత్రవాసమువలన ఈసంసారులయొక్క ప్రతిబంధకములను పోఁగొట్టి ఈశ్వరునితోడజేర్చిరక్షించెదనని అందుమిగులబద్ధాదరమైనశ్రీరంగముననుండెడివాఁడు (అణియరంగన్)॥శ్లో॥౯ రంగం

---

౫. పునలరంగం = జలముచుట్టుకొనియున్న శ్రీరంగము, ఊర్ = మాయూరు. అని నాయకితో భగవంతుఁడు చెప్పినవాక్యము (ఈయూరివాఁడనని నిదర్శించిచూపునట్లు అనిభావము.)

౬. అండర్కోన్ = దేవనాయకుఁడు, అమరుం = అమరియున్న, శోలై = తోఁపు. అనఁగానికుంజము.

౭. సిక్త = తడుపఁబడిన, రాజపథాం = రాజమార్గములుగలదియు, ప్రకీర్ణకమలోత్పలాం = చల్లఁబడినకమలములుకలువలు గలిగినదియు, కృత్స్నాం = సమస్తమైనదియు ※ పతాకాధ్వజమాలినీం = మంచిటెక్కెములు గట్టియున్నది.

తిటొక్కడిమదిళ్ శూళ్న్ద = దృఢములగుకోటలచేఁజుట్టఁబడిన, తిరువరంగత్తాయ్ = శ్రీరంగక్షేత్రముగలవాఁడు.

౮. అయం = ఈ, దేశః = చోటు, సర్వకామధుక్ = సమస్తయిష్టములనిచ్చునది.

౯. నర్తనస్థానం = నర్తనముచేయుచోటు, రంగం = రంగమనిపేరుగలది, స్యాత్ = అగును.

స్యాన్నర్తనస్థానం,, అన్నట్లు ఆతఁడు తనయొక్క మనోరథములులభిం
చుటచేతసంతోషపడి వర్తించెడుచోటు. నిత్యవిభూతిలోనుండు నప్పుడు
తనపాలకత్వమునపేక్షించువారులేనందున నట్టివారులేరనెడి కొఱఁతగల
వాఁడయిలీలావిభూతికివచ్చిన యనంతరమురక్ష్యవర్గమును సంపాదించు
కొనిపరిపూర్ణుఁడై తిరువరంగచ్చెల్వనార్ అనిపేరుగలవాఁడయ్యెను. మ
నకుఁబరమపదముద్దేశ్యమగునట్లు ఆతనికి శ్రీరంగముద్దేశ్యమయ్యెనుగదా?
ఇట్లుసులభుఁడైనందువలన నీకేమిఫలము సంప్రాప్తమయ్యెననఁగా (ఎ
న్నముతన్నై) నాకుధారకుఁడైనయమృతస్వరూపుని. దీనిచే దేవతలయమృ
తమునకు నీయమృతమునకుంగల వ్యావృత్తి చెప్పఁబడెను. ఆదేవతలయ
మృతము ఉప్పునీరుగాను అచేతనముగాను శరీరమునొచ్చునట్లుచిలుకఁదగి
శరీరమునే దృఢపఱచునదిగాను ఇంతయైనను తుదకు నశించునదిగాను
ఉండును. ఇదియట్లుగాక సర్వరసమై పరమచేతనమై అయత్నసిద్ధమై ఆ
త్మను దృఢపఱచునదియై నిత్యమైయుండునది. (అముదన్నై) శ్రు॥౧౦ "అ
సావాదిత్యోదేవమధు" అనియు॥శ్రు "ఆత్మావై పురుషస్యమధు" అనియు
శ్రు "రసోవై సఃసర్వరసః" అనియు॥ శ్రు "విష్ణోఃపదేపరమేమధ్వఉత్సః"
అనియు॥ ద్ర "తూయవముతై" అనియు॥ ఆరావముతే" అనియు చెప్పఁ
బడునట్లు ఒకప్పుడైనను వెగటుపుట్టని యమృతమైయుండును. (అండర్
కోనణియరంగనెన్నముదన్నై) ఉభయవిభూతులొకతట్టును నేనొకతట్టును
తులఁదూగునట్లుగదాయిప్పుడువిషయీకరింపఁబడెను. అండర్కోననుట
చేతనిత్యవిభూతియోగమును, అణియరంగ అనుటచే లీలావిభూతియో
గమునుచెప్పఁబడెను. వానివలెతన్నునుఒకవిభూతిగాఁదలంచిఎన్నముదన్నై
యనుచున్నాఁడు. ఇది॥ద్ర॥౧౧ "తిరుమాల్వైకుంఠమేతిరుప్పాల్కడలేఎ

---

౧౦. అసౌ=ఈ, ఆదిత్యః=సూర్యాంతర్వర్తియగు పరమాత్మ, దేవమధు=దేవతలమధువు. పురుషస్య=పురుషునికి, ఆత్మావై=పరమాత్మ, మధు=మధువు. సః=ఆపరమాత్మ, రసోవై=రసస్వరూపుఁడు, సర్వరసః=సమస్త రసస్వరూపుఁడు, పరమే=శ్రేష్ఠమగు, విష్ణోఃపదే=విష్ణువుయొక్క స్థానమునందు, మధ్వఉత్సః=మధుస్యంది, [తేనెయూటగలది] తూయవముదై=పరిశుద్ధమగు నమృతస్వరూపుని, ఆరావముదే=అపర్యాప్తామృతమా—తనివితీరనియమృతమా. ౧౧. తిరుమాల్=

తలైయే" అన్నట్లున్నది. అండర్‌కోనను‌టచే స్వామిత్వమును అణియరంగన్ అనుటచే సౌలభ్యమును ఎన్నముదనై అనుటచే సౌశీల్య వాత్సల్యములును చెప్పఁబడెను. అండర్‌కోనణియరంగన్ అనుటచే అఖిల జగత్స్వామిన్ అనియు ఎన్నముదనై అనుటచేత అస్మత్స్వామిన్ అనియు చెప్పుచున్నాఁడు. (ఎన్నముదనై) శ్రు ॥ ౧౨ "తమేవం విదిత్వా అమృతత్వమేతి" అన్నట్లు ఆతనిచేఁబడసి యాతఁడమృతుఁడైన విధమున ఈతనింబడసి యాతఁడమృతుఁడయ్యెనని భావము. ఇట్లునిరతిశయభోగ్యుఁడగు నీతనింబడసి చేసినది యేమియనఁగా. ( కండకణ్‌కళ్ ) ఒకపాటియు వ్యర్థత్వమును జెందక యనుభవింపఁబడెను. (కండ కణ్‌కళ్) ౧౩ "కాణవారాయి" అన్నట్లు శ్లో॥ "కదానుసాక్షాత్కరవాణి చక్షుషా" అన్నట్లును చూడవలయునని యాశపడుట మాత్రమే గాక యథామనోరథముగఁ గనుఁగొనఁబడసినవయ్యెను. (అముతనైకణ్‌డకణ్‌గళ్) రసనేంద్రియవిషయమగు నమృతమును చక్షుస్సగదా విషయీకరించుచున్నయది.(అముదనైకణ్‌డకణ్‌గళ్)శ్లో॥౧౪"బర్హాయతే తేనయనే నరాణాం విష్ణోర్న లింగాని నిరీక్షతో యే,, అన్నట్లు నెమలిపురికన్నుల వంటివిగాక ప్రయోజన మనుభవించినకన్నులు. శ్రు॥౧౫"నమాంసచక్షురభివీక్ష్యతేతం,,అనియు॥ శ్రు॥ నచక్షుషాపశ్యతికశ్చనైనం,,అనియు॥ద్ర॥ కడ్కాలి,, అనియు చెప్పఁబడియుండుప్రమాణములు నిషేధించుచుండినను

శ్రీమన్నారాయణుఁడు, వైకుంద మే=వైకుంఠమునందును, తిరుప్పార్‌కడలే=క్షీరసముద్రమునందును, ఎన్ తలైయె=నాశిరంబునందును. ౧౨. తం=ఆపరమాత్మను, ఏవం=ఈవిధముగ, విదిత్వా=ఎఱిఁగి, అమృతత్వం = అమృతభావమును, ఏతి=పొందుచున్నాఁడు. ౧౩. కాణ=(నేను) చూచునట్లు, వారాయి=రమ్ము. కదాను=ఎప్పుడు, చక్షుషా=కంటిచేత, సాక్షాత్కరవాణి=సాక్షాత్కరింతును.౧౪.యే.ఏకన్నులు, విష్ణోః=నారాయణునియొక్క, లింగాని=చిహ్నములను, ననిరీక్షతః=చూడవో, తే=ఆ, నరాణాం=మనుష్యులయొక్క, నయనే=కన్నులు, బర్హాయతే=నెమలిపింఛమునందలి, కన్నులగుచున్నవి—నిష్ప్రయోజనములనుట.౧౫. తం=ఆపరమాత్మను, మాంసచక్షుః=మాంసపుగన్ను, నాభివీక్ష్యతే=చూడదు, కశ్చన=ఒకఁడేనియు,చక్షుషా=కంటిచే, నపశ్యతి=చూడఁడు. కడ్కాలి=అదృశ్యుఁడు,

ఎదుట నేకానంబడసినకన్నులు. (అముదనైకరంణ్డకణ్కళ్) లోకులవలెవి
చ్ఛేదమగునట్లు కేవలపానముచే ననుభవించుటలేక॥ శ్రు॥౧౬ "నాశ్నంతి
నపిబంతి ఏతదేవామృతందృష్ట్వాతృప్యంతి" అన్నరీతిని మొదటివస్తువులు
గకుండునటులు చక్షురింద్రియములచే పానముసేసి ఈకన్నులుఆనందకంద
ళితములై యున్నవి. ఇవిఅన్యోన్యసదృశములన్నట్లుతమలోనొకదానికిమ
ఱియొకటియుపమానముగునేగాని మఱియొకటివీని కుపమానము కాదు
గాన నుపమానాంతరములేనివి. (మత్తొన్నినైకాణావే) ఇవిపాతివ్రత్య
ధర్మమునందుదీక్షవహించికదాయున్నవి. (మత్తొన్ని) సూచింపఁజేసినిషే
ధించుటకుయోగ్యతచాలకున్నవిధము చెప్పఁబడెను. (కాణావే)॥ శ్రు౧౭ "ప
శ్యంతిసూరయః" అనియు॥శ్రు "సదాపశ్యంతి" అనియుఁజెప్పఁబడినట్లుత్రి
పాద్విభూతిలోఁగూడఱెప్పపాటులేకయనుభవింపఁదగు దేహసౌందర్య
మునుఇదియొకటియేయనుభవింపఁబూనుకొనెనేని వేఱొకటిదానియం
దుఁబ్రవేశింపవీలుగలదా? (అణియరంగనైక్కుండకణ్గళ్ మత్తొన్నినైక్కాణా
వే) శ్లో౧౮ "శాస్త్రాద్వేద్మిజనార్దనం" అనియు॥ శ్లో॥శాస్త్రదృష్టేనవ
త్మనా" అనియుచెప్పఁబడినప్రకారముతాటాకులలోనఁజూచియేపోక
యీకన్నులచేత నిచ్చోటనెకాంచంబడయుట మఱియొకటింజూడనా? (ఎ
న్నముదనైక్కుండకణ్గళ్ మత్తొన్నినైక్కాణావే) కాంచగానే మొగమువంచు
కొనవలసినట్లు అఖండతేజోరూపమై ధగధగలాడుచుండక కాంచఁగానె
కన్నులుచల్లనగునట్లుఉన్నదనుచున్నాఁడు. నిరతిశయభోగ్యమగునేనిదాని
వదలివెనుకడుగుపెట్టవలసిన ట్లుండునోయనఁగా (కండకణ్గళ్ మత్తొన్నినై
క్కాణావే) చూడకుండమొదటనేనిషేధించితిమేని నివర్తింపఁజేయవచ్చు
నుగాని చూచినవెనుకనివర్తింపనగునా? (అండర్కోనణి యరంగనెన్న
ముదనైక్కుండకణ్గళ్ మత్తొన్నినైక్కాణావే) ఉభయవిభూతివిశిష్టుఁడైనదేవ

౧౬. నాశ్నంతి=భుజింపరు, నపిబంతి=త్రాగరు, ఏతదేవ=ఈ, అమృతం=అమృ
తమును, దృష్ట్వా=చూచి, తృప్యంతి = తృప్తినొందుచున్నారు. ౧౭. సూరయః=
జ్ఞానులు, పశ్యంతి=చూచుచున్నారు. సదా=ఎల్లప్పుడును, పశ్యంతి = చూచుచు
న్నారు. ౧౮. జనార్దనం=విష్ణుని, శాస్త్రాత్=శాస్త్రమువలన, వేద్మి=ఎఱుంగు

త్మకుఁడగునీతనింగాంచిన। శ్రు॥ ౧౯"ఆత్మనిఖల్వరేదృష్టేఇదంసర్వందృష్టం భవతి"అన్నట్లును। శ్రు॥ నాన్యత్ పశ్యతినాన్యచ్ఛృణోతి"అన్నట్లునుసర్వముతదాత్మకమైతోఁచునంతియకాక తద్వ్యతిరిక్తముగ మఱేదియునుకనుపడదనుట. (మత్తోన్యన్నైకాంక్షే) ఆతనినేనిరంతరము గాంచుచుండుననుభావము సూచింపఁబడెను. అనఁగా తానుప్రేమించిన దివ్యదేహసాక్షాత్కారము॥ శ్రు॥ ౨౦"తస్మిన్ దృష్టేపరావరే"అనియు॥ శ్రు॥ఆత్మావారేద్రష్టవ్యః" అనియెడియుపాయదశలోని సాక్షాత్కారముతోఁజేర్పఅది॥ శ్రు"సదాపశ్యంతి" అనియెడిఫలదశలోని సాక్షాత్కారముతోఁజేర్పఅది యావదాత్మభావియగుటచే నిరంతరమిట్లుజరుగుచుండుననిభావము. ఆయర్థమెరామంమేనుగతాదృష్టిః నత్వాపశ్యామిఅనిబుషిచెప్పెను.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణంప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు

రామంమేనుగతాదృష్టిఃఅను శ్లోకముయొక్క

యుపన్యాసము సంపూర్ణము.

శ్రీరామచంద్రాయనమః.

---

అరణ్యమునందు శ్రీరామునివదలి యయోధ్యకేతెంచిన సుమంత్రుఁడు దశరథునితోఁజెప్పుచున్నాఁడు.

ఈశ్లోకము అయోధ్యాకాండము ఎనుబదితొమ్మిదవసర్గలోనిది.

శ్లోకము॥ విషయే తేమహారాజరామవ్యసనకర్శితాః।

అపివృక్షాః పరిమ్లానా స్సపుష్పాంకురకోరకాః॥౧౭॥

---

చున్నాను. శాస్త్రదృష్టేన=శాస్త్రమునందగ పఱపఁబడిన, వర్త్మనా=మార్గముచేత. ౧౯. అరే=ఓరి, ఆత్మనిఖలుదృష్టే = ఆత్మచూడఁబడినదాయెనేని, ఇదంసర్వం=ఇదంతయు, దృష్టం=కనఁబడినదిగా, భవతి=అగుచున్నది. అన్యత్=మఱియొకవస్తువును, నపశ్యతి=కనఁడు, అన్యత్=మరియొకవచనమును, నశృణోతి=వినఁడు. ౨౦. పరావరే = అన్నిటికంటెపరమగు, తస్మిన్=ఆపరమాత్మ, దృష్టేసతి= చూడఁబడిన దగుచుండఁగా. అరే=ఓరి, ఆత్మా = పరమాత్మ, ద్రష్టవ్యః=చూడఁదగినది.

టీ॥ మహారాజ=ఓగొప్పరాజగుదశరథుఁడా, తే=నీయొక్క, విషయే=దే
శమునందుఁగల, వృక్షాఅపి=చెట్లును, సపుష్పాంకురకోరకాః=పువ్వులు, అప్పుడు
పుట్టినపసురుమొగ్గలు, మొగ్గలు (లేక) అరవిరిమొగ్గలు వీనితోఁగూడినవియగుచు,
రామ=శ్రీరామునియొక్క, వ్యసన=దుఃఖముచేత, కర్శితాః = కృశించినవియయి,
పరిమ్లానాః=అంతటను వాడినవియయ్యెను.

తా॥ ఓమహారాజా నీయొక్కదేశమునందు పుష్పాంకుర కోరకములతో
నొప్పియున్న వృక్షములు శ్రీరామునివ్యసనముచేతఁ బీడింపఁబడినవై వాడిపోయెను.

గంగానదీపరిసరమునందు శ్రీరామచంద్రుఁ నివదలిపెట్టి రథము తోలు
కొనివచ్చిన సుమంత్రుఁడు చక్రవర్తివద్దకుపోయి యాశ్రీరాముని విశ్లేష
మువలనఁగలిగిన విశేషములు పెక్కులుపన్యసించి నీపొలిమేరలోనిస్థావర
ములుసహిత మనుభవించినదశయిట్టిదియని తెలుపుచున్నాఁడు.(విషయే
తే) ఇతరులరాజ్యమునకును నీరాజ్యమునకునుగల భేదమువినుము (విష
యే తే) దక్షిణకోసలమని ఉత్తరకోసలమనివిభాగముగలిగి నీయొక్కపరి
పాలనకులోఁబడిన పొలిమేరవరకు నుండెడిదేశమంతయు. (విషయే తే)
శ్లో॥ ౧ ఇక్ష్వాకూణామియంభూమి స్సశైలవనకాననా'' అన్నట్లుపంట
నేలయు కొండనేలయు అడవినేలయు మదీయములేయని యభిమానించె
డినీయొక్క యభిమానమునకు విషయమగు నీవిపులప్రదేశమందు. (విష
యే)నాడునగరములన్నట్లువిశేషజ్ఞులుగాక కర్షకులగుచు నున్నచోటనుండి
ఫలభోక్తలగుచునుజీవించెడి జానపదులును నాగరికులును గలదేశమునం
దు. ఎవ్వనిదేశమందనఁగా (తే) శ్లో॥ ౨ ప్రజానాంవినయాధానాద్రక్ష
ణాద్భరణాదపి| సపితా'' అనియుఁ శ్లో॥ సపితాయస్తుపోషకః'' అనియుఁ
జెప్పఁబడినట్లు తాఁగన్నప్రజలను రక్షించునటులు గర్భముననుంచుకొని

---

౧. సశైలవనకాననా=పర్వతములతోను తోపులతోనుగూడిన యడవులు
గలదియగు,ఇయం=ఈ,భూమిః=పుడమి,ఇక్ష్వాకూణాం=ఇక్ష్వాకువంశపురాజులది.
౨. ప్రజానాం=జనులకు, వినయాధానాత్ = విశేషనీతిఁగలిగించుటచేతను, రక్ష
ణాత్=కాపాడుటచేతను, భరణాదపి=భరించుటచేతను, సః=ఆరాజు, పితా=
తండ్రి. యస్తు=ఎవ్వఁడు, పోషకః=పోషకుఁడో, సః=వాఁడు, పితా = తండ్రి;

పోషించెడెనీయొక్క. (తే) స్థావరములును కృతజ్ఞతగలవై పక్షపాతము సేయునట్టిపుణ్యవంతుఁడైన నీయొక్క (తే) శ్లో॥ ౩ "హరిబాహ్యాస్తు బాహ్లీకాః" అన్నట్లు భగవద్విముఖమగుటచే పాపముగలదై యుండెడి దేశముగాక భగవదభిముఖత్వము కలిగియుండెడినీయొక్క దేశము. నాయొక్క విషయము య్యోనేని యిట్లగుటకుమూలమేమనఁగా (మహారాజ) శ్లో॥ ౪ "రాజా వా రాజమాత్రో వా" అన్నట్లు క్షుద్రునివలెనీవై ననుసామంతుఁడై నను ఉత్తమక్షత్రియవంశమునఁబుట్టిన యొకఆఁడుదియైననుగాక॥ శ్లో॥ ౫ "తస్యేయంపృథివీసర్వా" అన్నట్లును శ్లో॥ ఏకాతపత్రంజగతఃప్రభుత్వం "అన్నట్లును శ్లో॥ వార్యాఫలకపర్యంతాం భుక్త్వమహతీంమహీం" అన్నట్లు ఒకసూదిమొన మోపునంతటి చోటువలెనవలీలగా నీచతుస్సముద్రముద్రితమగు భూమియంతయు వీరగుణముతోడి బాహువుచేవశపఱచుకొని పరిపాలించుచుండెడి నీయొక్కయతిశయించిన గౌరవముచే నిట్లయ్యెననుచున్నాఁడు. (మహారాజ) శ్లో॥ ౬ "రంజనాద్రాజా" అనియు శ్లో॥ "అనురక్తః ప్రజాభిశ్చ ప్రజాశ్చాప్యనురంజతే" అనియు చెప్పఁబడినట్లు ఉన్నచోటనుండి దేశము నీకుహితమగునట్లును నీవు లోకులకుహితప్రవర్తకుఁడవగునట్లును ఉభయానురాగ మతిశయింపఁబరిపాలించువాఁడవుకావా? అట్లగుటవలననే యనియెఱుంగుము. ఇట్లగుటకు నాయందలికృతజ్ఞతయాకారము. శ్రీరామునియందలి యాకారము మొక్కటియుకాదా? అనఁగా (రామవ్యసనకర్శితాః) శ్లో॥ ౭ "గు

---

౩. బాహ్లీకాః = బాహ్లీకదేశములు, హరిబాహ్యాః = విష్ణువిముఖములు. ౪. రాజా వా = రాజైనను, రాజమాత్రో వా = రాజుతో సమానుఁడైనను. ౫. ఇయం = ఈ, సర్వా = సమస్తమగు, పృథివీ = భూమి, తస్య = వానిది. ఏకాతపత్రం - ఒకగొడుగుగల, జగతః = లోకముయొక్క, ప్రభుత్వం - రాజ్యము, అనఁగా దేశమునకొకఁడే రాజగుట. వార్యాఫలకపర్యంతాం - ఫలమునిచ్చునదియగుటవలను ఉదకమునుగల, మహతీం - గొప్ప, మహీం - భూమిని, అభుక్త - భుజించెను. ౬. రంజనాత్ - సంతోషింపించుటచేత, రాజా - రాజని చెప్పఁబడుచున్నాఁడు. ప్రజాభిశ్చ - ప్రజలచేత, అనురక్తః - కోరఁబడినవాఁడై, ప్రజాశ్చ = జనులను, అనురంజతే = అనురక్తులఁజేయుచున్నాఁడు ౭. గుణాభి

ణాభిరామం రామంచ" అనియు॥ ద్ర॥ "వల్వినై యేనై యీర్కిన్ఱ గుణంగ
ళైయుడయవరాయి" అనియు చెప్పెడివిధముగ శ్రీరామచంద్రుని గుణ
ములయం దభిరుచి చేతనే యనుట. (రామవ్యసనకర్శితాః) ఎల్లలోకు
లను సుఖోత్తరముగనుజ్జీవింపఁజేసెడు రామునికిట్టి మహాక్లేశమొకటి
గలిగనేయనెడి క్లేశముచేతఁగృశములయ్యెను. [అనఁగా సెండిపోయి
వైవర్ణ్యమునొందెను] (రామవ్యసనకర్శితాః) ఇట్లు క్లేశించినవివి
యనఁగా (అపివృక్షాః) జ్ఞానముగలచేతనములే కావు. జ్ఞానములేని
చెట్లునుఇట్లయ్యెను. (అపివృక్షాః) వృక్షాఅపి. అపిశబ్దము "దేవతిర్య
క్మనుష్యులుమాత్రమేకాదు స్థావరములునుగూడ క్లేశముచేఁబీడితములయ్యె
ను" అనుభావముసూచింపఁజేయుచున్నది. అవి క్లేశపడుటయునుగలదా?
యనఁగా. శ్లో॥ ౮ "చుక్రుశుర్వనదేవతాః" అన్నట్లు వనదేవతలాక్రో
శించుటయు. శ్లో॥ ౯ "అత్యజన్కబళాన్నాగాః" అన్నట్లు ఏనుఁగులుగ్రా
సములువిడుచుటయు. శ్లో. ౧౦ "మృగ్యశ్చదర్భాంకురనిర్వ్యపేక్షాః" అన్న
ట్లు ఆఁడుజింకలు తమనోటఁగవ్వుకొన్న దర్భపోఁచలను సెలవులనుండిజా
ఱవిడుచుటయు గ్రంథోక్తమేకదా? శ్లో॥ ౧౧ "ఇహైవనిధనంయామో
మహాప్రస్థానమేవవా । రామేణరహితానాంతు కిమర్థంజీవితంహినః"
అన్నట్లు మనుష్యులు క్లేశపడిరి. అంతేకాదు. మ్రాఁకులును క్లేశమునొందె
ననిభావము. (వృక్షాః) గ్రీష్మోష్మతాపముచేతను వ్రేళ్లుచట్టునంటుటచే
తను ఎండినవికాక చిగురాకుజొంపములుగల పచ్చనిమ్రాఁకులుగూడ ఎండి

---

రామం-గుణములచేతమనోహరుఁడగు, రామంచ=రాముని. వల్వినయేనై=తత్ప్రా
ప్తిప్రతిబంధకమగుపాపముగలనన్ను, ఈర్కిన్ఱ=హింసించుచున్న, గుణంగళైయు
డయవరాయి=గుణములుగలవాఁడై. ౮. వనదేవతాః-వనదేవతలు, చుక్రుశుః-ఆ
క్రోశించెను. ౯. నాగాః=ఏనుఁగులు, కబళాన్-గ్రాసములను, అత్యజన్-వదలెను.
౧౦. మృగ్యశ్చ-ఆఁడుజింకలును, దర్భాంకుర-దర్భకొనలయందు, నిర్వ్యపేక్షాః-ఆశ
లేనివయ్యెను. ౧౧. ఇహైవ-ఇచ్చోటనె, నిధనం-నాశనమును, యామః-పొందుదుము,
మహాప్రస్థానమేవవా-శ్రీరామునితోగొప్పప్రయాణమైనను, యామః - పొందుదుము,
రామేణ=శ్రీరామునిచేత, రహితానాంతు=విడువఁబడిన, నః=మాకు, జీవనం=

పోయినవాయనఁగా (వృక్షాఅపిపరిమ్లానాః) వృషసేచనే అనిధాతువు. అట్లగుటచేత సిక్తములయి పాదులలో నీళ్లునిండితడిగలిగినవికూడ ఎండిపోయెననుట. (పరిమ్లానాః) శస్త్రాదులచే తెగనరకఁబడి ఆయువు పట్టుతెగి వాడిపోయినవానివలెవాడెను. (పరిమ్లానాః) ఇప్పుడీవిశేష క్లేశమువలన మొదలుముట్టశోషించెను. శ్లో॥ ౧౨ "ఏతిజీవంతమానందోనరంవర్షశతాదపి" అన్నట్లు "బ్రతికియుండినసుఖములుబడయవచ్చు" అనియెడినానుడిచేత శ్రీరాముఁడు పదునాలుగువర్షములు వనమునఁ గడపి మరలనే తెంచుననియెడి ప్రత్యాశపైకొనఁగా పైసొంపుమాత్రము చెడి కొనగొమ్మలలోని లేఁతచిగుళ్లుమాత్రమే వాడిపోవుటకాదు - పరిమ్లానాః - చెట్లుబోదెలతోను కొనగొమ్మలతోను రెమ్మలతోను ముదుగాకులతోను చిగురుటాకులతోను ఇది అదియనుభేదములేక నిలువెల్ల యెండిపోయెను. ఆకులుమాత్రమేవాడెనోయనఁగా (సపుష్పాంకురకోరకాః) పువ్వులతోను గుత్తులతోను మొగ్గలతోను మ్లానములయ్యెను. (సపుష్పాంకురకోరకాః) పుష్పములనఁగా వికసించినపువ్వులు. అంకురములనఁగా అప్పుడుపుట్టుచున్న మోసులు. కోరకములనఁగా మొగ్గలు. లేక అరవిరిమొగ్గలు. వీనితోఁగూడఎండెననుట. (సపుష్పాంకురకోరకాః వృక్షాఅపి రామవ్యసనకర్శితాఃపరిమ్లానాః) పుత్రపౌత్రాదులతోఁగూడ మనుష్యుని యొడలుకృశించి మొగమువాడునట్లు వృక్షములును పుష్పములతోను పల్లవములతోను కొమ్మలతోను రెమ్మలతోను ఇంచుకైననుభేదములేక కొమ్మలు రెమ్మలు అధికముగాఁగలిగినవియుమిక్కిలిలావైనవియు చేవగలవియుమంచి నీడలుగలవియునైన గొప్పమ్రాఁకులుగూడ దుఃఖముచేతఎండెను. (విషయేవృక్షాఃపరిమ్లానాః) ప్రమదోద్యానములందును ఆరామములందును నగరమునందును నీరుపోసి పెంచుచున్నమ్రాఁకులు అరణ్యమునందు తమం

---

బ్రతుకు,కిమర్థంహి=ఎందుకగును. ౧౨. వర్షశతాదపి=నూరుసంవత్సరములకైనను, ఆనందః=సంతోషము, జీవంతం=బ్రతికియుండెడివానిని, ఏతి=పొందుచున్నది.

తటతామే పెరిగిన వృక్షములు మొదలుగా నీరాజ్యపు పొలిమేరకులోఁబడి యున్న వృక్షములెల్ల నుబ్బార్తిగా ఎండిపోయినవని చెప్పినట్లు తాత్పర్యము.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణం ప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు విషయే తే అను శ్లోకముయొక్కయుపన్యాసము సంపూర్ణము.



శ్రీరామచంద్రాయనమః.

భరతుఁడు తనయన్నగారిని చూచుటకుగాఁ జిత్రకూటపర్వతమునకువచ్చి శత్రుఘ్నునితోఁజెప్పుచున్నాఁడు.

ఈశ్లోకము అయోధ్యాకాండము తొంబదియేనిమిదవసర్గములోనిది.

శ్లోకము॥ సుభగశ్చిత్రకూటోసౌగిరిరాజోపమోగిరిః।
యస్మిన్ వసతికాకుత్థ్సః కుబేర ఇవనందనే॥౧౩॥

టీ॥ యస్మిన్=ఏచిత్రకూటపర్వతమునందు, కాకుత్థ్సః=శ్రీరాముఁడు, కుబేరః=కుబేరుఁడు, నందనఇవ=నందనవనమునందువలె, వసతి = వాసముచేయుచున్నాఁడో? గిరిరాజ=శ్రేష్ఠమగుపర్వతములోఁడ, ఉపమః = సాటియగు, అయం= ఈ, చిత్రకూటః=చిత్రకూటమనియెడి, గిరిః=పర్వతము, సుభగః=మనోహరము.

తా॥ ఏచిత్రకూటపర్వతమునందు శ్రీరాముఁడు నందనవనమున కుబేరుఁడు వసించినట్లు వసించుచున్నాఁడో ఆశ్రేష్ఠమైనకొండతోసమానమగు నీచిత్రకూట పర్వతము మనోహరమైయున్నది.

ఇక్ష్వాకూణామియంభూమిస్సశైలవనకాననా" అన్నట్లు దేశములు నగరములు అడవులు కొండలునిండియుండు ఇక్ష్వాకుకులీనుల రాజ్యమునందు రామచంద్రుఁడునివసించియుండుటచే పేరొకనఁబడినది శ్రీచిత్రకూటపర్వతమొక్కటియే.(సుభగః)ఇతరములగుస్థలములకంటె సౌభాగ్యమువిశేషించియుండునది. సౌభాగ్యమనఁగా నెల్లవారునుగోరఁదగియుండుటయే. అయోధ్యయందువసియించినట్లు దీనియందు రామచంద్రుఁడువసియించుటంజేసి యారాజధాని యున్నట్లుండి యొక్కడకే తెంచి

యిట్లయ్యేనోయనఁదగియున్నదిగదా? ఆతఁడువసియించుటచేఁ గలిగిన వైలక్షణ్యమెుక్కటే నా దీనికిఁగలదనఁగా (చిత్రకూటః) దేశస్వభావము చేతను ఇది విలక్షణమేయనుచున్నాఁడు. (చిత్రకూటః) శ్లో॥ ౧ "రమణీయోహ్యయందేశః" అన్నట్లు శ్రీమదయోధ్యానగరమునుండి లంకానగరమునకు వేంచేయు శ్రీరంగనాథుఁడు శ్రీరంగక్షేత్రముయొక్కభోగ్యతచే నచ్చోటస్థిరముగానిలిచినట్లు అయోధ్యనుండి లంకకు వేంచేయయత్నించి, శ్లో॥ ౨ "జగామచాశ్రమాన్ రమ్యాన్ పర్యాయేణతపస్వినాం" అన్నవిధముగ ప్రత్యాశ్రమమునందును జుట్టిచుట్టి తొట్రుపడుచు మెలఁగుచున్నశ్రీరామునికి ఇచ్చోట సీతాదేవితోఁగూడ ఇంపుమీఱవసియింపఁదగియుండుటయే యీదేశముయొక్కభోగ్యత. (చిత్రకూటః) నానావిధములగు ధాతువులచేతను రత్నములచేతను శిఖరములచేతను హృదయము లయింపఁజేసి యాశ్చర్యకరమైయున్నది, ఇట్లు విచిత్రములయిన పర్ణకూటశాలలు గలదయ్యేకదా? యయోధ్యయునుండును. దానినా యిప్పుడువచియింపవలసినదియనఁగా (అసౌగిరిః) ఈపర్వతము ద్ర॥ ౩ "కల్లుంగనైకడలుం వైకుందవానాడుం పుల్లెంతెఱ్ఱందనకొల్" అన్నట్లు చేయిజారవిడిచినవానిఁ బోలియీ యిదియున్నది ద్ర॥ ౪ "అమర్న్దు ఇనిదురైకోయిల్" అన్నట్లు ఆతఁడభిరుచిచేవర్తించునట్టి యీపర్వతము దేనింబోలియున్నదియనఁగా (గిరిరాజోపమోగిరిః) శ్రీమన్నారాయణుఁడును లక్ష్మియును ఇరువురు నెడబాయకవర్తించుటచేత "తిరుమాలిరుంశోలైమలై" అని పేరువడసి సుందరబాహువును ఆతనిసుందరియునువర్తించెడి కొండతో సమానమయియున్నదియని చెప్పవొప్పగును. అట్లైన నీకొండకాధిక్యమే

---

౧. అయం=ఈ, దేశః=దేశము, రమణీయోహి=మనోహరముగదా. ౨. పర్యాయేణ=క్రమముగా, రమ్యాన్=మనోహరములగు, తపస్వినాం = ఋషుల యొక్క, ఆశ్రమాన్=తపోవనములనుగుఱించి, జగామ=పోయెను. ౩. కల్లుం= కొల్లను-పర్వతములును, కనైకడలుం = గొప్పసముద్రమును, వైకుందవానాడుం= వైకుంఠమనియెడు దేవనగరమును, పుల్లెంతెఱ్ఱందనకొల్ = గడ్డిమొలచిపోయెనుఅయ్యో. ౪. అమర్ందు=ఉండి, ఇనుదురై=సుఖపడునట్టి, కోయిల్=శ్రీరంగము.

మనఁగా (యస్మిన్ వసతి కాకుత్స్థః) పుట్టి పెరిగిన యనంతరము వెగటయిన య యోధ్య పుట్టినప్పుడే వెగటైన మధురాపురి యీ రెండింటియందు వలెఁగాక యీకొండయందు॥ ద్ర॥ ౫ "నంగళ్ కున్ఱం కైవిడాన్" అన్నట్లు ఎడబాయక నిరంతరము వర్తించుచున్నాఁడు. ఇట్లు వర్తించెడువాఁడెవఁడనిన (కాకుత్స్థః) కకుత్స్థసంబంధమైన ఈకులమునుద్ధరించెడి ప్రభావగౌరవములు గల శ్రీరామచంద్రుఁడు. (కాకుత్స్థో యస్మిన్ వసతి) కకుత్స్థకులమునఁబుట్టి శ్రీమదయోధ్యానగరమునందు వర్తించెడి రామచంద్రుఁడు ఈకొండయందు వర్తించుచున్నాఁడు. (కాకుత్స్థో యస్మిన్ వసతి) ఈతఁడీకొండమీఁద వసియించియుండుట ఈకులమునకుఁ గూటస్థుఁడగు నొకరాజు ఇంద్రుఁడు వృషభమై రాఁగా దాని మూఁపురముమీఁద వసియించునట్లున్నది. (కాకుత్స్థో యస్మిన్ వసతి) ద్ర॥ ౬ "పరం శెన్ఱుశేర్ తిరువేంగడమ్" అన్నట్లు సర్వాతిశాయియగు వస్తువు ఇంపుతో సుఖవాసము సేయుచోటు గదా? ఇట్టి పర్వతమునందు వాసము చేయుట వనవాసమర్యాదచేత క్లేశాత్మకమైయుండదు నో యనఁగా (కుబేర ఇవ నందనే) ధనపతియగు వైశ్రవణుఁడు విలాసముగా ఇంద్రోద్యానమగు నందనవనమునందు ఉండునట్లున్నాఁడు. కుబేరుని తోఁట చైత్రరథమైయుండ నందనవనము నేల చెప్పవలయుననఁగా రాముఁడు అయోధ్యాపరిసరముననుండు వనములనువదలి చిత్రకూటపరిసరముననుండెడి మధురమధుభరిత కుసుమనికురుంబ కరంబిత వనవాటికను వసియింప వైశ్రవణుఁడు తనదయిన చైత్రరథమును వదలి ఇంద్రోద్యానమైన నందనవనమునందు వసియించి నట్లుండెనని చెప్పనయ్యెను. దీనివలన పంచాశత్కోటివిస్తీర్ణమయిన యీ భూమండలములో ఆతఁడభిమానించి ప్రేమించిన దివ్యదేశమే యుద్దేశ్యమనెడి భావము సూచింపఁబడెను.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణం ప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణశ్లోకరత్నావళియందు సుభగశ్చిత్రకూటః అను శ్లోకము యొక్క యుపన్యాసము సంపూర్ణము.

---

౫. నంగళ్ = మాయొక్క, కన్ఱం = పర్వతమును, కైవిడాన్ = వదలఁడు. ౬. పరన్ - సర్వాధికుఁడు, శెన్ఱు-పోయి, శేర్-సుఖముగనుండు, తిరువేంగడమ్ = వేంకటాచలము.



శ్రీరామచంద్రాయనమః.



రామలక్ష్మణులుశూర్పణఖను విరూపినింజేసిపంపఁగా నది ఖరునిపాదములపైఁ బడియేడ్వ,వాఁడు నిన్నువిరూపినింజేసిన వాఁడెవఁడనియడుగఁగా శూర్పణఖ యీ క్రిందిశ్లోకముచే వారలందెల్పుచున్నది. ఇది రామాయణమునందలి యారణ్యకాండములో పందొమ్మిదవసర్గలోనిది.

తరుణౌరూపసంపన్నౌ సుకుమారౌమహాబలౌ।
పుండరీకవిశాలాక్షౌచీరకృష్ణాజినాంబరౌ॥౧౪॥

టీ॥ తరుణౌ=యౌవనముగలవారు, రూపసంపన్నౌ=రూపముచేపరిపూర్ణులు, రూపమనఁగా నాభరణములచే నలంకరింపఁబడకుండినను అలంకరింపబడినట్లు సుందరముగనుండెడి యాకృతి. సుకుమారౌ=కోమలత్వముగలవారు, మహాబలౌ =అధికబలముగలవారు, పుండరీకవిశాలాక్షౌ = తామరతేకులవలె విపులములగుకన్నులుగలవారును, చీరకృష్ణాజినాంబరౌ=వల్కలమును కృష్ణాజినమును వస్త్రముగాధరించియుండెడివారును,వీరు రామలక్ష్మణులు. తాత్పర్యముస్పష్టము.

శ్లో॥ ౧ "సహిదేవైరుదీర్ణస్యరావణస్యవధార్థిభిః। అర్థితోమానుషేలోకేజజ్ఞేవిష్ణుస్సనాతనః" అన్నట్లు దశకంఠకుంఠిత శక్తులగు దేవతలు రాక్షసులరజస్సునుపోఁగొట్టునట్లు రజోధూసరములగు దేహములును రాక్షసస్త్రీలయొక్క మంగళసూత్రములు తెగునట్లు కంఠములఁగట్టిన పేలికలును రావణునిచేబందీకృతలగుతమకాంతలయొక్క విరియఁబోసికొన్న తలవెండ్రుకలవిధము శ్లో॥ ౨ "విముక్తకేశ్యోదుఃఖార్తాః" అను పగిదిని రాక్షసస్త్రీల తలవెండ్రుకలకగునట్లు వీడినతలవెండ్రుకలును శ్లో॥ ౩ "హాపుత్రేతిచవాదిన్యోహానాథేతిచసర్వశః" అన్నట్లు వారలమొగ

---

౧. సనాతనః=అనాదియగు, సఃవిష్ణుః=అవిష్ణువు, ఉదీర్ణస్య=గొప్పవాఁడగు, రావణస్య=రావణునియొక్క, వధార్థిభిః=చావునుగోరునట్టి, దేవైః=దేవతలచేత, అర్థితః=ప్రార్థింపఁబడినవాఁడై,జజ్ఞే =అవతరించెను. ౨. విముక్తకేశ్యః =తలవెండ్రుకలు విరియఁబోసికొనినవారును, దుఃఖార్తాః=దుఃఖముచేతఁ బీడింపఁబడినవారును. ౩. హాపుత్ర=అయ్యోకుమారుఁడా, ఇతి=అని, వాదిన్యశ్చ=చెప్పుచున్నవారును, హానాథేతిచ-అయ్యో ప్రాణనాయకుఁడా అనియు, సర్వశః=నలు

ములయందు విలాపాక్షరములుకలుగునట్లు తమయొక్క మొగములయందు స్ఫురించుచున్నశరణాక్షరములును శ్లో॥ ౪ "ఉద్ధృత్యచభుజౌకాచిత్" అన్నట్లు వారు చేతులెత్తికొని విలపించురీతిసె తాము రచియించుకొన్న యంజలిపద్మములును శ్లో॥ ౫ "స్నాపయంతి ముఖంబాష్పై స్తుషారైరివపంకజం" అన్నట్లు వారలకన్నులందు కన్నీరువరదలై పారు విధమున బాష్పదూషితముఖకమలములునుకలిగినవారై శ్లో॥ ౬ "ఛాయావృక్షమివాధ్వగాః" అనియు శ్లో॥ "చకోరాఇవశీతాంశుంచాతకాఇవ తోయదం। అధనాఇవదాతారంజేవాజగ్ముర్జనార్దనం" అనియుఁజెప్పఁబడినచందముగ అధ్వశ్రాంతులగువారు ఛాయావృక్షముఁజేరునట్లును చకోరములు శరచ్చంద్రునిఁజెందుతెఱంగునను చాతకములు వార్షకవలాహకములసమీపించు సంచునను దరిద్రులు దాతనువెంబడించిపోవురీతిగను శ్రియఃపతియండఁజేరి శ్లో॥ ౭ "తమబ్రువన్సురాస్సర్వే సమభిష్టూయసన్నతాః" అన్నరీతిని స్తవప్రియుండగునాతనిస్తుతింపనుపక్రమించి "ఓదేవదేవానీవు" శ్రు॥ ౮ "సదైకరూపరూపాయ" అన్నట్లు నిర్వికారుఁడవైయుండి ద్ర॥ ౯ "నాట్టిర్ పిరందుపడాదనపట్టుమనిశరాయ్" అన్నట్లు అపాయముపైకొనియు త్రిపాద్విభూతిలోనుండి చతుష్పాత్తై హిరణ్యాక్షునిచంపుటయు కేవలతిర్యక్త్వమేచాలదని నరభావముగలసినసింహమై

---

ప్రక్కల. ౪. కాచిత్=ఒకతె, భుజౌ-చేతులను, ఉద్ధృత్యచ=ఎత్తి. ౫. బాష్పైః=కన్నీళ్లచేత, ముఖం=మొగమును, తుషారైః=మంచుబినుకులచేత, పంకజమివ=తామరపువ్వునువలె, స్నాపయంతి=తడుపుచున్నారు. ౬. అధ్వగాః=మార్గమున నడచువారు, ఛాయావృక్షమివ=చల్లనిచెట్టునువలె, చకోరాః=వెన్నెలపులుఁగులు, శీతాంశుమివ=చంద్రునివలెను, చాతకాః=వానకోయిలలు, తోయదమివ=మేఘమునువలె, అధనాః=ధనములేనివారు, దాతారమివ=వదాన్యునివలెను, దేవాః=దేవతలు, జనార్దనం=విష్ణువును, జగ్ముః=పొందిరి. ౭. సర్వేసురాః=ఎల్లదేవతలు, సన్నతాః=మిక్కిలియణఁకువగలవారై, సమభిష్టూయ=స్తుతించి, తం=అవిష్ణునిఁగూర్చి, అబ్రువన్=పలికిరి. ౮. సదా=ఎల్లప్పుడును, ఏకరూప = ఒకరూపముగు, రూపాయ=స్వరూపముగలవాఁడు. ౯. మనిశరాయ్=మనుష్యులకై, నాట్టి

హిరణ్యునినిరసించుటయు శ్లో॥ ౧౦ "మహతోమహీయాన్" అనఁదగిన రూపమునుపొట్టిగాఁజేసికొని తామసవాసినియొక్క సంభోగలీలావిలాసపుస్తాకుగ్రలు మఱచిబ్రహ్మచారియై శ్లో॥ ౧౧ "దద్యాన్నప్రతిగృహ్ణీయాత్" అని శ్లో॥ "గోసహస్రప్రదాతారం" అనియు ద్ర॥ "అలంబురిందనెడుందడకై" అనియుచెప్పఁబడినట్లు బ్రహ్మాద్యనేకపదప్రదుఁడవై యుండి మహాబలివద్దకేగి పదత్రయమునుయాచించుటయు॥శ్లో॥౧౨ "బ్రాహ్మణోస్య ముఖమాసీత్ బాహూరాజన్యఃకృతః" అన్నట్లు బ్రహ్మక్షత్రములకుత్పాదకుఁడవైయుండియు శ్లో॥ ౧౩ "పిత్ర్యమంశముపవీతలక్షణం మాతృకంచధనురూర్జితందధత్" అన్నట్లు జమదగ్నిరేణుకలకు బ్రహ్మక్షత్రియుఁడవైయవతరించి ఇరువదియొక్కమాఱు దుష్టక్షత్రియులను నిజపరశువునకు ప్రాతరశనముకావించుటయు, ఇవియెల్లను శ్లో॥౧౪ "భక్తానాం" అనియు శ్లో॥ "వరదసకలమేతత్సంశ్రితార్థంచకర్థ" అనియుఁజెప్పఁబడినట్లు దాసభూతులగుమాకొఱకేగదా?అనియుస్తుతించి శ్లో॥౧౫"చా

---

ల్ = దేశమునందు, పిరంపు=పుట్టి, పడాదనై=పడగూడనిపాటులను, పట్టు= పడి, కష్టపడెననిభావము. ౧౦. మహతః=గొప్పవస్తువుకంటె, మహీయాన్=గొప్పవాఁడు. ౧౧- దద్యాత్=ఇయ్యనగును, నప్రతిగృహ్ణీయాత్=తీసికొరాదు, గోసహస్రప్రదాతారం=అనేకగోవుల నిచ్చెడువానిని. అలంబురింద=యాచకులుచాలుచాలుననునట్లు విశేషదానపూర్ణతగల, నెడుం=దీర్ఘమయిన, తడై=విశాలమగు, కై=బాహువు.౧౨-అస్య=ఈవిరాట్పురుషునికి,ముఖం=మొగమువలననుండి, బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, ఆసీత్=అయ్యెను. బాహూ = బాహువులవలన,రాజన్యః=శ్రేష్ఠులగురాజులు, కృతః=సృష్టిచేయఁబడితి. ౧౩- ఉపవీతలక్షణం=యజ్ఞోపవీతరూపమగు, పిత్ర్యమంశం=తండ్రియంశమును, మాతృకంచ=మాతృకులసంబంధియయి, ఊర్జితం=బలిష్ఠమగు, ధనుః=ధనుస్సును, దధత్=ధరించుచున్నవాఁడు. ౧౪ శ్లో॥ నతేరూపంనచాకారోనాయుధానినచాస్పదం। తథాపిపురుషాకారోభక్తానాంత్వంప్రకాశసే॥ నీకురూపమును ఆకారమును ఆయుధములును స్థానమును లేవు, అయినను పురుషుని యాకారముగలవాఁడవై భక్తులకుఁగనఁబడియెదవు. వరద=ఓవరములనిచ్చెడివాఁడా, ఏతత్సకలం=ఇదంతయు, సంశ్రితార్థం=ఆశ్రితులకొఱకు, చకర్థ=చేసితివి. ౧౫- చాపం=ధనుస్సును, ఆనయ=కొనిరమ్ము.

పమానయ" అని యాతఁడు తనహస్తముచే నాయుధ మెత్తుకొనునట్లు తమయొక్క వజ్రపరశు దండపాశాద్యాయుధములవదలిపెట్టియు, ఆతఁడు శ్లో॥౧౬ "సాగరంశోషయిష్యామి" అనునట్లు తమకన్నీరుగాన్పించియు శ్లో॥ ౧౭ "సుగ్రీవంశరణంగతః" అన్నట్లును శ్లో॥ "సముద్రంరాఘవో రాజాశరణంగంతుమర్హతి"అన్నట్లును ఆతఁడు ఇతరులనుశరణువేఁడుకొనవలయునటులు తాముశరణాగతియొనరించియు శ్లో॥౧౮ "అంజలింప్రాఙ్ముఖఃకృత్వా"అనియాతఁడంజలిసేయునట్లుతామంజలియొనరించుకొనియు శ్లో॥ ౧౯ "ప్రసీదంతుభవంతోమె" అనియాతఁడుస్తుతియించునట్లు తాము స్తుతియొనరించియు శ్లో॥ ౨౦ "సర్వేసన్నిహితాః" అని బ్రహ్మాయునింద్రుఁడును అగ్రేసరులయియుండ నాతనిపాదములకుఁబ్రణతులయి శ్లో॥ ౨౧ "ననమేయం" అనియుండెడివారలను శిరశ్ఛేదముచేసి యివ్వవలెనని విన్నవించుకొనఁగాఁ బరమకారుణికుండగు సర్వేశ్వరుఁడును నిత్యానపాయినియగుశ్రీదేవియును శ్లో॥ ౨౨ "పితరంరోచయామాసతదాదశరథం నృపం" అన్నట్లును శ్లో॥ "జనకస్యకులేజాతాం" అన్నట్లు తానుదాశరథిగా ఆమెజనకకులసుందరిగాను అవతరించి యిరువురును రెండుస్థలములలోను పెరుగుచునుండఁగా ఈమిథునమెడఁబాసి యుండఁగూడదు. ఇట్లుఎడఁబాసియుండెనేని అప్పుడు వీరురక్షకులుగాక శ్లో॥ ౨౩ "జగత్స

---

౧౬- సాగరం=సముద్రమును, శోషయిష్యామి=శుష్కింపఁజేసెదను. ౧౭- సుగ్రీవం=సుగ్రీవుని, శరణంగతః=శరణుజొచ్చెను. రాఘవః=రాముఁడనెడి, రాజా=రాజు, సముద్రం=ఉదధిని, శరణంగంతుమర్హతి=శరణుబొందఁగలఁడు. ౧౮- ప్రాఙ్ముఖః-తూరుపుమొగముగలవాఁడై, అంజలిం-అంజలిని, కృత్వా=చేసి. ౧౯- భవంతః=మీరు, మే=నావిషయమున, ప్రసీదంతు=ప్రసన్నులగుదురుగాక. ౨౦- సర్వే=ఎల్లవారు, సన్నిహితాః=చేరినవారైరి. ౨౧- ననమేయం=నమ్రుఁడనుకాను. ౨౨ తదా=అప్పుడు, దశరథంనృపం=దశరథరాజును, పితరం=తండ్రిఁగా, రోచయామాస=కోరుకొనెను. జనకస్య=జనకరాజుయొక్క, కులే=వంశమునందు, జాతాం=పుట్టినట్టి. ౨౩- సశైలం=పర్వతములతోఁగూడిన, జగత్=లోకమును, పరివర్తయామి=త్రిప్పెదను. సాగరమేఖలాం=సముద్రము మొలనూలుగాఁగల—సము

శైలంపరివర్తయామి" అన్నట్లును శ్లో॥ "కింనుసాగరమేఖలాంమహీం దహతి" అన్నట్లును వీరలోండ్రారులువినాశకరులగుదురు. వీరుపరస్పరముచేరికగలిగియుండిరేని శ్రు॥ ౨౮ "ఆవాభ్యాంకర్మాణికర్తవ్యానిప్రజాశ్చోత్పాదితవ్యాః" అనియు శ్లో॥ "ఉపేతంసీతయాభూయశ్చిత్రయాశశినంయథా" అనియుఁజెప్పఁబడినట్లు జగత్తునకుమంగళావహమైయుండుటంజేసి యీమిథునమునొకచోటికఁగూర్చవలయునని మెడి యభినివేశముగలవాఁడగుటచేతను "వినాశాయచదుష్కృతాంసంభవామి" అని యజ్ఞవిఘ్నకరంహన్యాం అనియు నాతనియవతార రహస్యసంకల్పమునెఱింగినవాఁడగుటవలనను విశ్వామిత్రభగవానుఁడు దశరథరత్నాకరము డగ్గఱిరామరత్నమునపేక్షింపఁగా నాదశరథుఁడును శ్రీరామునియథార్థముగ నెఱుంగక "ఊనషోడశవర్షోమే" అన్నట్లు ఇంకను పదునాఱుసంవత్సరములప్రాయముపూర్ణమైనదికాదు "బాలఆషోడశాత్ వర్షాత్ పౌగండశ్చేతికీర్త్యతే" అనియుండుటంజేసి అప్రాప్తవ్యవహారుఁడగుంగాన ఒంటరిగానొకకార్యమును సమర్థించుటకుశక్తుఁడుగాఁడు "చతురంగబలైర్యుక్తంమయాచసహతంనయ" అన్నట్లు,ఆతనిరక్షణమునకై నన్నుఁగూడఁగొనిపొమ్ము అనిచెప్పఁగా విశ్వామిత్రుఁడునురాజుతో ఈతనివాల్యదశనుజూచియా నీవిట్లు పలుకుచున్నాఁడవు. "శిశుమైయుక్ వాత్రైఁమాపలియిడచ్చెన్నకేళ్" అని సాక్షినినిరూపించి సాక్షివద్దకుఁబోవసమ్మతింపవయితివేని "వసిష్ఠోపిమహాతేజాఃయేచేమేతపసిస్థితాః" అని సన్నిహితులును అనేకులునగు వీరినడిగి తెలిసికొనలేవాయని యుపన్యసించి ఆతని సమ్మతింపఁజేసిన ఆదశరథుఁడునుసమ్మతించి ౨౯ "దదౌకుశికపుత్రాయ",

---

ద్రముచేతచుట్టఁబడిన. మహీం=భూమిని. దహతికిన్న=దహించుచున్నవాఁడాయేమి. ౨౮- ఆవాభ్యాం=మాచేత, కర్మాణి=వైదికకర్మములు, కర్తవ్యాని=చేయఁదగినవి. ప్రజాశ్చ=జనులును, ఉత్పాదితవ్యాః=పుట్టింపఁదగినవారలు. చిత్రయా=చిత్తానక్షత్రముతో, ఉపేతం=కూడికొనియున్న, శశినంయథా=చంద్రునివలె, భూయః=పలుమారు, సీతయాసార్థం=సీతతోడ, ఉపేతం=కూడికొనియున్న, ఇట్టివాఁడురాముఁడు. ౨౯- కుశికపుత్రాయ=విశ్వామిత్రునికొఱకు, దదౌ=ఇచ్చెను,

అన్నట్లు తన కుమారులనిరువురను ఆతనికిష్టవినియోగార్హముగనొసంగిన నాబుషియును రామలక్ష్మణుల వెనువెంటఁగొనిపోయి కర్మజ్ఞానముచే త నవిద్యను నిరసింపఁజేసినరీతి వారలంగొని తాటకను నిరసింపఁజేసిన, అనంతరము రాముఁడు అవిద్యాసంచితములను పుణ్యపాపరూపములు నగు నుభయవిధకర్మముల తెఱంగునఁ దాటకాజనితులగుసుబాహుమారీచులనణగించి అందు ౨౬ "ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ" అను వచనముచొప్పున నొకనిఁజంపి మఱియొకని దూరముగఁదొలఁగించి విశ్వామిత్రాధ్వరత్రాణమొనరించి॥ శ్లో॥ ౨౭ "శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్" అన్నట్లు శ్రు॥ "జాతవేదోమమావహలక్ష్మీం" అన్నట్లునులక్ష్మిని జెందునప్పుడు అగ్నిపురస్సరముగఁజెందవలసినదిగనుక శ్లో॥ ౨౮ "విశ్వామిత్రేణసహితోయజ్ఞంద్రష్టుంసమాగతః" అన్నచందముగ, జనకునియజ్ఞ సమయమునందుఁబోయి అగ్నిత్రయము నుపాసించి ద్రా॥౨౯ "విల్లి ఉత్తు మెల్లియళ్తోళ్తోయిందాన్" అని చెప్పఁబడినట్లు రౌద్రమగువిల్లురప్పించి దేవతాంతరస్పర్శమువలన దానికిఁగలిగియున్నదోషమునశించునట్లు తమ శ్రీహస్తమునందుకొని గుణారోపణమొనర్చి తద్భంగశుల్కయగుసీతాదేవిని చేఁబట్టి మరలియేతెంచుచుండ రామత్వమునకు ద్వైరాజ్యముకలిగినదేయని యేమెం యతికుపితుఁడైయేతెంచినపరశురామునిం గాంచి పుత్రవత్సలుఁడగు దశరథచక్రవర్తి చలితుఁడై "అభయంసర్వభూతేభ్యోదదామి" అనఁదగు శ్రీరాముని యెడలమిగులశంకఁజేసి శ్లో॥ ౩౦ "బాలానాం

---

౨౬. ఉత్తరపూర్వాఘయోః=ఉత్తరాఘమనఁగా ప్రారబ్ధము, పూర్వాఘమనఁగా సంచితము. వీనికి అశ్లేషవినాశౌ=ఎడబాయుటయు నశించుటయునగును. ౨౮- హుతాశనాత్=అగ్నివలన, శ్రియం=లక్ష్మిని, ఇచ్ఛేత్=కోరనగును. జాతవేదః = ఓయగ్నీ, లక్ష్మీం=లక్ష్మిని, మమ=నాకు, ఆవహ=కలుగఁజేయుము. ౨౮- విశ్వామిత్రేణసహితః=విశ్వామిత్రునితోడ, యజ్ఞం=జన్నమును, ద్రష్టుం=చూచుటకు, సమాగతః=వచ్చెను. ౨౯- విల్లు=ధనుస్సును, ఉరిత్తు = విఱిచి, మెల్లియళ్తోళ్=మృదుత్వముగల సీతయొక్క బాహువులమీఁద, తోయిందాన్=సంసక్తుఁడయ్యెను. ౩౦- బాలానాం=పసిబిడ్డలైన, మమ=నాయొక్క, పుత్రాణాం=కుమారులకు, అ

మమపుత్త్రాణామభయందాతుమర్హసి" అని శ్రీరామునినామముప్రసిద్ధముగ నెల్లవారు సద్ఘోషించుటవిని కోపాక్రాంతుఁడై యే తెంచియున్నవాఁడుగాన ఆపరశురామునిముందట శ్రీరామునిపేరుచెప్పుటకును వెఱచి సాధారణముగ నా కుమారులకభయప్రదానముచేయవలయునని ప్రార్థింప, ప్రవర్గ్యముంబోలె మండిపడినయాతనిఁగని చల్లార్పదమనుకొని వసిష్ఠాది ఋషులు శ్లో॥ ౩౧ "తందృష్ట్వాభీమసంకాశంజ్వలంతమివపావకం। ఋషయోరామరామేతివచోమధురమబ్రువన్" అన్నట్లు నినువినాగా రామాంతరముగలదాయని దాశరథియొక్క రామత్వముతోనినుమడించి రామత్వమాతనితలమీఁదఁబెట్టి నిప్పులోనీళ్లుపోసినట్లు చల్లనిమాటలుచెప్పినను ఆతఁడు జామదగ్న్యుఁగుటచే చల్లాఱకయుండఁగా రాముఁడును ఈతని హస్తమునందీకాష్ఠముండుటంజేసికదా యితఁడిట్లుమండిపడుచున్నాఁడని తలంచి పైకిఁగనుపట్టినట్టి క్షత్త్రతేజస్సుతోఁగూడ దానిందీసికొని సహజముగుబ్రాహ్మణ్యమే శేషించియుండునట్లొనరించిన శ్లో॥ ౩౨ "అక్షయం మధుహంతారంజానామిత్వాంసురోత్తమం। ధనుషోస్యపరామర్శాత్ స్వస్తితేస్తుపరంతప" అనియాతఁడుతనస్వాభావికబ్రాహ్మణ్యమునకుఁ దగినట్లుస్వస్తిచెప్పి, 'వైష్ణవమగు తనధనుస్సునుతీసికొనుటచేరామునియొక్క వైభవము సర్వలోకసిద్ధమగునట్లు అగ్నినంటిసత్యముసేయఁగా శ్రీరాముఁడును శ్లో॥ ౩౩ "బ్రాహ్మణోసీతిపూజ్యోమే" అనియాతఁడుస్వస్తి

---

భయం=భయములేమిని, దాతుమర్హసి=ఇయ్యఁదగినవాఁడవగుచున్నావు. ౩౧-ఋషయః=ఋషులు, భీమసంకాశం=రుద్రునితోసమానుఁడును, జ్వలంతంపావకమివ=మండుచున్ననిప్పువలెనుండెడి, తం=ఆపరశురాముని, దృష్ట్వా=చూచి, రామరామేతి=రామరామయని, మధురం=మనోహరమగు, వచః=మాటను, అబ్రువన్=చెప్పిరి ౩౨- అస్య=ఈ, ధనుషః=వింటియొక్క, పరామర్శాత్=వాడుకోలుచేత, త్వాం=నిన్ను, అక్షయం=నాశములేని, మధుహంతారం=మధురాక్షసునిసంహరించిన, సురోత్తమం=దేవతలలోశ్రేష్ఠుఁడగు విష్ణునిఁగా, జానామి=ఎఱుంగుచున్నాఁడను, పరంతప=శత్రునాశకుఁడా, తే=నీకు, స్వస్తి=మంగళము, అస్తు=అగుఁగాక. ౩౩- బ్రాహ్మణోసీతి=విప్రుఁడవయితివని, మే=నాకు, పూజ్యః=పూ

చెప్పుటచే బ్రాహ్మణుఁడనిసిద్ధాంతముచేసి గతికపోఁచలుగోసి యతని కాళ్లపైవైచి దండముపెట్టి భుజమునందలి జంధెముమాత్రమే శేషించున ట్లాతనివదలి రక్షించి యయోధ్యాపురప్రవేశముచేసి యిట్టివస్తువులభించు టకై యనుభవించినకష్టముతెలిసిగినవాఁడగుటచేత ఆమెయొక్కయాజ్ఞవ మునెఱింగి॥ శ్లో॥ ౩౮ "రామస్తుసీతయాసార్థంవిజహారబహూనృతూన్" అన్నట్లు శ్రీసీతాదేవియును రామచంద్రుఁడును ఇంపుతోవిహరించుచుం డఁగా శ్రీభూమిదేవియును "లోకపాలోపమంనాథమకామయతమేదినీ" అన్నట్లు తానును సీతాదేవివలె నంశభాగిని యగుటవలనను శ్లో॥ ౩౯ "యదాతుభార్గవోరామ స్తదాభూద్ధరణీత్వియం" అన్నట్లు తనయొక్క ప్రేమాస్పదమగు పరశురామావతారపుతేజస్సుగూడ ఇక్కడసంక్ర మించుటవలన తనయుత్కంఠకుఅనుకూలుఁడగు రామునిస్వయంవరము గావరియింప, దశరథుఁడు ఇది గాంధర్వవివాహముగానుండఁగూడదు సమంత్రకముగఁ బాణిగ్రహణముచేయింపవలయునని యెంచి పౌరజాన పదమంత్రిపురోహితాదులను రప్పించి మంత్రాలోచనయొనరించి శ్లో॥ ౩౬ "మంత్రయిత్వాతతశ్చక్రేసశ్చయజ్ఞస్సునిశ్చయం। శ్వఏవపుష్యోభవి తాశ్వోభిషించామిమేసుతం। రామంరాజీవపత్రాక్షం యావరాజ్యఇతి ప్రభుః" అన్నట్లు సంపత్తారయగుపుష్యనక్షత్రమునందు రామునికభిషే కముచేయింపవలయునని నిశ్చయించి, అందుకై కావలసినసంవిధానములు సేయఁగా "సోహంవిశ్రమమిచ్ఛామి" అనియు "యావరాజ్యేనసంయో క్తుమైచ్ఛత్" అనియుఁజెప్పఁబడినట్లు పౌరజనులును రాజును మనస్సులందు

---

జింపఁదగినవాఁడవు. ౩౮- రామస్తు=రాముఁడో, సీతయాసార్థం = సీతతో, బ హూనృతూన్=పెక్కుఋతువులు, విజహార=విహరించెను. ౩౯- యదాతుభా ర్గవోరామః=ఎప్పుడు పరశురాముఁడో, తదా=అప్పుడే, ఇయం=ఈలక్ష్మి, ధర ణీతు=భూమిఁగా, అభూత్=అయ్యెను. ౩౬- నిశ్చయజ్ఞః=నిశ్చయము నెఱిఁగిన వాఁడును, ప్రభుః=రాజనగుదశరథుఁడు, మంత్రయిత్వా=ఆలోచనచేసి, తతః పిమ్మట, శ్వఏవ=రేపే, పుష్యః=పుష్యనక్షత్రము, భవితా=కలుగఁబోవుచున్నది, రాజీవపత్రాక్షం = తామరరేకులవంటి కన్నులుగలవాఁడును, మే = నాకు

నిశ్చయించిన యాశావిశేషములు వారోనర్చినవగుటచే॥ ద్ర॥ ౩౭ "ఎణ్ణినవారాకవిక్కరుమంగళ్" అన్నట్లు అవిసంకల్పరూపములేయగుచువిరమింప శ్లో॥ ౩౮ "ఆవాసంత్వహమిచ్ఛామిప్రదిష్టమివకాననే" అనియు శ్లో॥ "తపస్వినాం రణేశత్రూన్ హంతుమిచ్ఛామిరాక్షసాన్" అనియు సత్యసంకల్పుఁడగు తనసంకల్పమేసంకల్పమగునట్లు కైకేయిమంథరాంతర్యామియైనిలిచి కలఁచియాడి అరణ్యమునకు వేంచేసి దండకారణ్యవాసులగు ఋషులనుగాంచునప్పుడు శ్లో॥ ౪౦ "రిక్తహస్తేననోపేయాత్"అన్నట్లు ఉత్తచేతులతోఁబోయికనఁగూడదనియెంచి విరాధవధపురస్సరముగఁబోయికనుంగొన వారును సుగ్రీవమహారాజువలె శ్రీరామునివీర్యమునందతిశంకచేసి పరీక్షయొనరించియే తేరుగడఁజెందవలయు ననునదిలేక విరాధవధమునందు దృష్టోదాహరణులగుటచే వినీతులయివచ్చి, శ్లో॥ ౪౧ "పరిపాలయనోరామవధ్యమానాన్నిశాచరైః" అనిమమ్మురక్షింపవలయుననిశరణుచొరఁగా శ్లో॥ ౪౨ "భవతామర్థసిధ్యర్థమాగతోహం యదృచ్ఛయా" అని వారలకుఓంఇచ్చి శ్లో॥ ౪౩ జగామచాశ్రమాన్ స్తేషాంపర్యాయేణతపస్వినాం" అన్నట్లు, శరభంగ, సుతీక్ష్ణ, అగస్త్య, తద్భ్రాతృ, ప్రముఖులగు ఋషులయొక్క యాశ్రమములకు క్రమముగ

---

సుతం = కుమారుఁడునగు, రామం = శ్రీరాముని, యౌవరాజ్యే = యౌవరాజ్యమునందు, అభిషించామి = అభిషేకముసేయుచున్నాను, ఇతి = అని, సునిశ్చయం = మంచినిశ్చయమును, చక్రే = చేసెను. ౩౭- ఇక్కరుమంగళ్ = ఈమనోరథరూపకార్యములు, ఎణ్ణినవారాక = ఎంచుటతోనె పర్యవసన్నములయ్యెను, ఫలములేదనుట. ౩౮- అహంతు = నేనో, కాననే = అడవియందు, ఆవాసం = ఉనికిని, ప్రదిష్టమివ = చూపఁబడినదానివలె, ఇచ్ఛామి = కోరుచున్నాను. ౩౯- రణే = యుద్ధమునందు, తపస్వినాం = ఋషులకు, శత్రూన్ = విరోధులగు, రాక్షసాన్ = రక్కసులను, హంతుం = చంపుటకు, ఇచ్ఛామి = కోరెదను. ౪౦- రిక్తహస్తేన = ఉత్తచేతితో, నోపేయాత్ = గొప్పవారలవద్దకు పోఁగూడదు. ౪౧- రామ = ఓరాముఁడా, నిశాచరైః = రాక్షసులచేత, వధ్యమానాన్ = బాధింపఁబడుచుండెడి, నః = మమ్ము, పరిపాలయ = కాపాడుము. ౪౨- భవతాం = మీయొక్క, అర్థసిద్ధ్యర్థం = ప్రయో

వేంచేయునట్టి రాముఁడు అగస్త్యోపదేశముచేత గోదావరీతీరమగుపంచవటీపరిసరమునఁబర్ణశాలనిర్మింపఁజేసి శ్లో॥ ౨౪ "సరామఃపర్ణశాలాయామాసీనస్సహసీతయా । విరరాజమహాబాహుశ్చిత్రయాచంద్రమాఇవ" "లక్ష్మణేనసహభ్రాత్రా" అన్నట్లు జానకీదేవితోడను లక్ష్మణునితోడను సుఖవాసముసేయుచుండఁగా ఆకాలమునందు శ్లో॥ ౨౫ "తందేశంరాక్షసీకాచిదాజగామయదృచ్ఛయా । సాతుశూర్పణఖానామ" అన్నట్లు శూర్పణఖయను నొకరాక్షసి యాదృచ్ఛికసుకృతమువలన దగ్గఱకువచ్చి ప్రాప్తవిషయమైయుండినను ఘటకుఁడగు నొకయాచార్యునివలన విశేషజ్ఞానముపుట్టియుండకపోవుటచేతను పురుషకారమూలకముగఁజేరుటలేక ఆవిషయమునందసహ్యాపచారమొనరించి శ్లో॥ ౨౬ "నక్షమామికి" లక్ష్మీఘాతయయి శ్లో॥ ౨౭ "ఇత్యుక్తోలక్ష్మణస్తస్యాః క్రుద్ధోరామస్యపశ్యతః । ఉద్ధృత్యఖడ్గంచిచ్ఛేదకర్ణనాసౌమహాబలః" అని ద్ర॥ "కూరారందవాళాల్కొడిమూకుఱంకాదిరండుమీరావిడుత్తు" అని ద్ర॥ "కాతోడుకొడిమూకఱ్ఱుసనఱుత్తకెత్తలత్తా" అనియుఁజెప్పఁబడినట్లు దక్షిణబాహువగులక్ష్మణునిచేత తానంటకయవైరూప్యముకలుగఁజేయ శ్లో॥ ౨౭ "విరూపణంచాత్మనిశోణితేక్షితాశశంససర్వంభగినీఖరస్యసా" అన్నట్లు తెగినముకఱతోను తీంద్రముగప్రవహించురక్తముతోను తనభ్రాతయగు

---

నముసిద్ధించుటకై, యదృచ్ఛయా = యదేచ్ఛచేత—ఒకరిప్రయత్నములేకయే, అహం = నేను, ఆగతః = వచ్చితిని. ౨౩- తేషాంతపస్వినాం = ఆఋషులయొక్క, ఆశ్రమాన్ = ఆశ్రమములను, పర్యాయేణ = వరుసచొప్పున, జగామచ = పోవును. ౨౪- సరామః = దొడ్డభుజములుగలఆరాముఁడు, సీతయాసహ = సీతాదేవితోడను, భ్రాత్రా = సహోదరుఁడగు, లక్ష్మణేనసహ = లక్ష్మణునితోడను, పర్ణశాలాయాం = పర్ణశాలయందు, ఆసీనః = కూరుచుండినవాఁడై, చిత్రయా = చిత్తానక్షత్రముతోఁగూడిన, చంద్రమాఇవ = చంద్రునివలె, విరరాజ = ప్రకాశించెను. ౨౫- కాచిత్ రాక్షసీ = ఒక్కరాక్షసస్త్రీ, యదృచ్ఛయా = యాదృచ్ఛికసుకృతముచేత, తందేశం = ఆప్రదేశమునుగూర్చి, ఆజగామ = వచ్చెను, సాతు = అది, శూర్పణఖానామ = శూర్పణఖయనిపేరుగలది. ౨౬- నక్షమామి = ఓర్వను, ౨౭. ఇత్యుక్తః = ఈప్రకారముం

ఖరాసురుని యెదుట మొఱపెట్టుకొనఁగా వాఁడునతికుపితుఁడై శ్లో॥ ౪౮ "వ్యక్తమాఖ్యాహి కేనత్వమేవంరూపావిరూపితా" అని నిన్నుఇట్లువిరూపింజేసినవారలెవ్వరు వారలనువిశదముగఁదెల్పుము అనియడిగినవారలిట్టివారనియడియాలము దెల్పుచున్నది తరుణౌ ఇత్యాదిగా॥ శ్లో॥ ౪౯ "పుత్రౌదశరథస్యాస్తాంభ్రాతరౌ రామలక్ష్మణౌ" అన్నట్లు ఇట్టివానికుమారుఁడనియు ఈపేరుగలవాఁడనియుఁజెప్పుటప్రాప్తమైయుండ తరుణౌ రూపసంపన్నౌ అనిపరువమునురూపమును నిరూపకములుగాఁజెప్ప నేలయనఁగా ఈచెప్పినదానికివైరూప్యముకలిగినదిగాని వైరాగ్యముగలుగలేదుకనుక "కామమోహితా" అనియెడుతనయభినివేశముదృఢపడి భ్రాతలముందనియేటుఁగకతనహృద్గతమును దెల్పుచున్నది. అనుకూలురైనను ప్రతికూలురైనను ఈ విషయమునఁదగులుకొన్నవారికికృత్యమేయిదికదా? శ్లో॥ ౫౦ "యానిరామస్యచిహ్నాని" అనియడియాలమువిశదపఱచునట్లు సీతాదేవియాంజనేయులనడుగఁగా శ్లో॥ ౫౧ "త్రిస్థిరస్త్రిప్రలంబశ్చ" అనివచియించుటకుపూర్వము శ్లో॥ ౫౨ "రామఃకమలపత్రాక్షస్సర్వసత్వమనోహరః" అనివచియిం

---

జ్ఞచేయఁబడిన, లక్ష్మణః=లక్ష్మణుఁడు, క్రుద్ధః=కోపముగలవాఁడై, రామస్యపశ్యతః=రాముఁడుచూచుచుండఁగా, ఖడ్గం=కత్తిని, ఉద్ధృత్య=ఎత్తి, మహాబలః=గొప్పబలముగలవాఁడై, కర్ణనాసౌ-చెవులనుముక్కును, ఒచ్ఛేద-ఛేదించెను. కూరార్ందవాళాల్-వాఁడికలిగినకత్తిచేత, కొడిమూక్కుం-నిడుపాటిముక్కును, కాదిరెండుం-చెవులురెండును, ఈరావిడిత్తు-ఛేదించి. కాదోడు-చెవులతో, కొడిమూక్కుం-నిడుపాటిముక్కును, అన్ఱు-అప్పుడు, ఉడన్-వెంటనే, అరుత్త-కోసిన, కైత్తలత్తాయి-హస్తముగలవాఁడా. ౪౭-సా-ఆ, ఖరస్యభగినీ-ఖరునిచెల్లెలు, శోణితోక్షితాసతీ-నెత్తురుగ్రక్కుచు, ఆత్మని-తనయందు, విరూపణం-కురూపిణినిఁగాఁజేయుటను, సర్వం-అంతయును, శశంస=చెప్పెను. ౪౮- కేన=ఎవనిచేత, త్వం=నీవు, ఏవంరూపా=ఈవిధమయినరూపముగలదానివిగా, విరూపితా=వికారరూపిణీత్వము చెందింపఁబడితివో ఆదంతయు, వ్యక్తం=ప్రకాశముగ, ఆఖ్యాహి=చెప్పుము. ౪౯- దశరథస్య=దశరథునికి, రామలక్ష్మణౌ=రాముఁడనియు లక్ష్మణుఁడనియు, పుత్రౌ=కుమారులు, ఆస్తాం=కలరు. ౫౦- యానిరామస్యచిహ్నాని = రామునియొక్కగురుతులేవిగలవో? ౫౧- త్రిస్థిరః = బొమ్మపిడికిలి మనికట్టు ఈమూటియందును స్థైర్యముగలవాఁడు, త్రిప్రలంబః-నొసలుభుజములుముక్కులు ఈమూటియొక్క ప్రేలుటకలవాఁడు. ౫౨-రా

చెనుగదా? ఇవిప్రయోజకరూపనామములనియుఁజెప్పనగును అందు॥శ్లో॥ ౫౩ "రూపాణివిచిత్యధీరఃనామానికృత్వా" అనియెడిక్రమములో ప్రథమ భావియగురూపమునుముందుఁజెప్పుచున్నదియనినైనఁజెప్పవచ్చును. లేక శ్లో॥ ౫౪ "సుప్తప్రమత్తకుపితానాంభావజ్ఞానందృష్టం" అనువచనప్రకారముకుపితయగుటంజేసి హృద్గతార్థము నవశముగఁబ్రకాశము సేయుచున్నది. అనినైనఁజెప్పవచ్చును ఇందు॥శ్లో॥౫౫ "రామమిందీవరశ్యామంకందర్పసదృశప్రభం । బభూవేంద్రోపమందృష్ట్వా రాక్షసీకామమోహితా" అన్నట్లు తానాతనిఁగాంచికాముకియగుటకుమూలమయి యాకర్షకమగు నాకయాకారమును తన్నుపరిభవించుటవలనంగలిగిన కోపాతిశయముచే శ్లో॥౫౬ "తయోస్తస్యాశ్చరుధిరంపిబేయమహం" అనివచియించునదిగాన శ్లో॥ ౫౭ "కోయమేవంమహావీర్యః" అని రామలక్ష్మణులకొలఁదియెఱుంగకసంశయించుచుండుతనభ్రాతయయినఖరునితో శ్లో॥ ౫౮ "ఫలమూలాశినౌదాంతౌ తాపసౌధర్మచారిణౌ" అనివారలయొక్క లాఘవమును దెల్పు

---

మః = శ్రీరాముఁడు, కమలపత్రాక్షః = తామరరేకులవంటి కన్నులుగలవాఁడు, సర్వసత్వ = ఎల్ల ప్రాణులకు, మనోహరః = మనసునకుఁబ్రియమైనవాఁడు. ౫౩. ధీరః = సర్వజ్ఞుఁడైనపరమాత్మ, రూపాణి-రూపములను, విచిత్య-సృజించి, నామాని-పేళ్లను కృత్వా - చేసిపెట్టి. ౫౪- సుప్త-నిద్రించువారును, ప్రమత్త-మైమఱచినవారును, కుపితానాం - కోపించినవారు-వీరియొక్క, భావజ్ఞానం - మనస్సులోనితాత్పర్యము నెఱుఁగుట, దృష్టం-కనఁబడును. ౫౫- ఇందీవరశ్యామం-నల్లకలువల నల్లదనమువంటినల్లదనముగలవాఁడును, కందర్పసదృశప్రభం - మన్మథుని సౌందర్యకాంతివంటి సౌందర్యకాంతిగలవాఁడును, ఇంద్రోపమం - (వైభవమునందు) ఇంద్రునికిసాటియయినవాఁడునగు, రామం-శ్రీరాముని, దృష్ట్వా-చూచి, రాక్షసీ-శూర్పణఖ, కామమోహితా-మన్మథవికారముచేత మోహించినదిగా, బభూవ-ఆయ్యెను. ౫౬- అహం-నేను, తయోః-ఆకుమారులయొక్కయు, తస్యాశ్చ - ఆసీతాదేవియొక్క, రుధిరం-రక్తమును, పిబేయం-పానముచేయుదును. ౫౭- ఏవంమహావీర్యః - ఇట్టిగొప్పవీర్యముగలవాఁడు, కోయం - ఎవఁడు. ౫౮- ఫలమూలాశినౌ - పండ్లనువేళ్లను భుజియించువారును, దాంతౌ-బ్రహ్మచర్యాది తపఃక్లేశమునోర్చువారును. తాపసౌ-తపస్వులును,

నట్టియొకయాకారమును శ్లో॥ ౫౯ "రామస్యచమహత్కర్మమహాన్ త్రాసో
భవేన్మమ" అనివీరలకుభయపడియున్నదికాఁబట్టి వానిమనస్సునందు
క్రోధముజ్వలింపఁజేయుటకును శ్లో॥ ౬౦ "బుధ్యాహమనుపశ్యామినత్వం
రామస్యసంప్రతి । స్థాతుంప్రతిముఖేశక్తస్సచాపస్యమహారణే" అనిచాప
హస్తుఁడై యామగధీరుఁడుబయలువెడలెనేని నీవు ఆతనియెదుటనిలువఁగల
వా? అనివారలమగఁటిమినివెల్లడిసేయునట్టి యాకారమొక్కటియునుచేరి
యాకారత్రయమువివక్షితము. అందుమొదటియాకారమునందుయోజనా
ప్రకారముదెల్పఁబడును [౧] "తరుణౌరూపసంపన్నౌసుకుమారౌమహాబ
లౌ। పుండరీకవిశాలాక్షౌచీరకృష్ణాజినాంబరౌ" వారికిఁగలపరువముశరీర
సౌందర్యము చేష్టలుగాంభీర్యము కన్నులయందముసాదృశ్యమునువారియం
దేకాని యితరులయందులేవుసుమీయనుచున్నది॥ ద్ర॥ ౬౧ "ఎన్నైఽఇదు
విళైత్తవీరిరెండుమాల్వరైత్తోళ్ మన్నవన్" అన్నట్లు నన్నుఁగూడచిక్కు
పడఁజేసియిట్లొనర్చినది యాగుణసముదాయముగదా (తరుణౌ) శ్రు॥ ౬౨
"యువాకుమారః" అనియు శ్రు॥ "యఃపూర్వ్యాయవేధసేనవీయసే
సుమజ్జానయేవిష్ణవేదదాశతియువీయసే" అనియు॥ ద్ర॥ "అరుంబినైయ
లర్రై" అనియువేదాంతసిద్ధమగునర్థమును ఈయొకరాక్షసిమిక్కిలియాస
దృశముగఁదెల్పుచున్నదిసుమా? ఇట్లుదెల్పుట రాక్షసస్త్రీలకుఁగృత్యమై

ధర్మచారిణౌ-ధర్మమునడుపువారును, (రామలక్ష్మణులు.) ౫౯- రామస్య-రాముని
యొక్క, కర్మ-కృత్యము, మహత్-గొప్పది, మమ-నాకు, మహాన్-గొప్ప, త్రా
సః-భయము, భవేత్-కలుగును. ౬౦- అహం-నేను, బుద్ధ్యా-బుద్ధిచేత, సంప్రతి-
ఇప్పుడు, మహారణే-గొప్పయుద్ధమునందు, సచాపస్య-ధనుస్సుతోఁగూడికొన్న,
రామస్య-శ్రీరామునికి, ప్రతిముఖే-ఎదురుమొగమై, స్థాతుం-నిలుచుటకు, త్వం-నీవు,
నశక్యః-శక్తుఁడవుకావని, అనుపశ్యామి-ఊహించెను. ౬౧. ఎన్నైఽ-నన్ను, ఇదు
విళైత్త ఇట్టిదశపొందించిన, ఈరిరెండుమాల్వరైత్తోళ్ - పర్వతశిఖరమువనుబోలిన
మూఁపులుగలవాఁడగు, మన్నవన్-ప్రభువు. ౬౨- అకుమారః-కౌమారప్రాయము
లేని, యువా-తరుణుఁడు. యః-ఎవఁడు, పూర్వ్యాయ-ప్రాచీనులకుఁ బ్రాచీనుఁ
డైన, వేధసే-సృష్టికర్తయైన, నవీయసే-సూక్ష్మములలో సూక్ష్మమయిన, సుమజ్జా

యున్నదిగదా॥ శ్లో॥ ౬౩ "వ్యక్తమేషమహాయోగీపరమాత్మాసనాతనః తమసఃపరమోధాతాశంఖచక్రగదాధరః" అనిమందోదరిచెప్పియుండలేదా? (తరుణౌ) ముక్తులు బద్ధులు దశరథవసుదేవాదులు ఇట్టివారలతోడ భేదములేక॥ ద్ర॥ ౬౪ "కరియానొరుకాళై"అనియు॥ద్ర॥ "కాళైపుగుద కనాక్కండేఁ"అనియు చెప్పఁబడినట్లు ప్రణయినులనువశపఱచుకొనుటపరువమువలననేకదా, అట్లగుటచేతఅట్టిపరువమునందేయీశూర్పణఖయు ప్రథమమున నిచ్చఁగొన్నదయ్యెను. (తరుణౌ) ఇది బద్ధభావయగుటరామచంద్రునియందు, దీనికి వైరూప్యమునఁగూర్చినవాఁడు లక్ష్మణుఁడు, ఈ రెండుపక్షములయందు తాఁగామించినవానినైనతన్నువిరూపినిఁజేసినవానినైన ఒక్కనినేచెప్పవలసియుండ ద్వివచనాంతముగఁ జెప్పనేలయనఁగా శ్లో॥౬౫"అన్యోన్యసదృశావీరౌ"అన్నట్లుఅందమునందును మగఁటిమియందును ఒండొరులతోసమానులగుటచేతను॥శ్లో॥ ౬౬ "కృతదారోస్మిభవతీ భార్యేయందయితామమ" అనియు॥శ్లో॥ "శ్రీమానకృతదారశ్చలక్ష్మణోనామవీర్యవాన్ । అపూర్వభార్యార్థీచతరుణఃప్రియదర్శనః।ఏనంభజ విశాలాక్షిభర్తారం" అని నేనుకృతవివాహుఁడను స్నిగ్ధభార్యుఁడనుగాన నీకుఁదగినవాఁడనుగాను. ఈతఁడు అకృతవివాహుఁడును వివాహముచేసి

---

నయో=శ్రీలక్ష్మీభర్తయైన, యవియసే=మిక్కిలివయస్సంపన్నుఁడైన, విష్ణవే=శ్రీవిష్ణుదేవునికొఱకు, దదాశతి=ఇయ్యఁగోరుచున్నాఁడు. అరుంబినై = మొగ్గయొక్కస్వరూపముగలవాఁడును, అలరై=వికసించిన పుష్పరూపముగలవాఁడును, ఇవిస్త్రీలచేఁజెప్పనట్టిమాటలుగా ద్రావిడభాషలో ప్రసిద్ధములు. ౬౩. ఏషః= ఈతఁడు, మహాయోగీ=యోగీశ్వరశ్రేష్ఠుఁడును, పరమాత్మా=బ్రహ్మస్వరూపుఁడును, సనాతనః=నాశములేనివాఁడును, తమసః=తమస్సుకంటె, పరమః = అతీతుఁడును, ధాతా=రక్షకుఁడునగు,శంఖచక్రగదాధరః=శంఖము చక్రముగదధరియించెడివాఁడుగా, వ్యక్తః=ప్రకాశించెను. ౬౪. కరియాన్=నల్ల, ఒరుకాళై=ఒకవృషభము, అనఁగా పురుషశ్రేష్ఠుఁడు. కాళై=వృషభము, పుగుద = తూటినట్లు, కనాక్కండేన్=కలగంటిని. ౬౫. అన్యోన్య=ఒండొరులతో, సదృశౌ=సమానులును,వీరౌ=శూరులును, ౬౬. భవతీ=ఓపడుచా, కృతదారోస్మి = వివాహముచేసికొనియు

కొనవలయునని మోడి యాశగలవాఁడునై యున్నాఁడు. కాన ఈతనిభర్త గావరింపుము. అని శ్రీరాముఁడువచియింపఁగా ఆమార్గమునలక్ష్మణుని యందు ఇదిబద్ధభావమైయాతనిఁజేరఁగా॥ శ్లో॥ ౬౭ "కథందాసస్యమే దాసీభార్యాభవితుమర్హసి। ఆర్యస్యత్వంవిశాలాక్షిభార్యాభవయవీయసీ" అనియాతనికిదాసుఁడనైన నాకుభార్యవైతి వేని నీవునుదాసివగుదువు. ఇదినమ్రతయేఱుంగని రాక్షసులకులమునఁబుట్టిననీకుతగదు. పట్టపుదేవివైయుండునట్లు రామునికిరెండవభార్యగానుండయత్నింపుము. అనిలక్ష్మణుఁడుచెప్పెను. దానిచేనచ్చికయెచ్చివినీతయయి యిరువురియెడలనుబద్ధభావయగుటచేతను, వైరూప్యకరణమునందును॥శ్లో॥౬౮"విరూపయితుమర్హసి"అనిరాముఁడుప్రయోజకకర్తగాను॥శ్లో॥౬౯"ఉద్ధృత్యఖడ్గంచిచ్ఛేదకర్ణనాసౌమహాబలః"అన్నట్లు లక్ష్మణుఁడుక్రియాకర్తగాను ఉండుటచే శ్లో॥ ౭౦ "తాభ్యాముభాభ్యాంసంభూయప్రమదామధికృత్యతాం।ఇమామవస్థాంనీతాహం" అనిఇద్దఱునుగలిపిచెప్పినట్లుగ నిందునురామలక్ష్మణుల నుసమానముగఁదెల్పుచున్నది. (తనుశౌ) ద్ర॥ ౭౧ "ఇరువరాయివందార్

---

న్నాను, ఇయం=ఈ, మమ=నాయొక్క, భార్యా=పత్ని, దయితా=నాకుమిక్కిలి ప్రియురాలు,శ్రీమాన్=శ్రీమంతుఁడగు, లక్ష్మణః=లక్ష్మణుఁడు, అకృతదారశ్చ=వివాహముచేసికొనని వాఁడు, వీర్యవాన్=శూరుఁడు, అపూర్వభార్యాప్రార్థీచ = అపురూపమగు కళత్రమునుగోరువాఁడును, తరుణః=యౌవనముగలవాఁడును,ప్రియదర్శనః=చూచుటకు ప్రియుఁడుగానున్నవాఁడును, విశాలాక్షి=ఓవెడలుపు కన్నులుగలదానా, ఏనం=వీనిని, భర్తారం=పెనిమిటిఁగా,భజ=పొందుము. ౬౭. దాసస్య=పనిచేసిజీవించెడువాఁడగు, మే=నాకు, దాసీభార్యా = దాసియగుభార్యవుగా, భవితుం=అగుటకు, కథమర్హసి=ఎట్లుతగుదువు, విశాలాక్షి=ఓవిశాలాక్షి, ఆర్యస్య=మాయన్నగారికి, యవీయసీభార్యా=చిన్నభార్యగా, భవ=కమ్ము. ౬౮. విరూపయితుం=కురూపినిగాఁజేయుటకు, అర్హసి=తగుదువు. ౬౯. మహాబలః=గొప్పబలముగలలక్ష్మణుఁడు, ఖడ్గముద్ధృత్య = కత్తియెత్తి, కర్ణనాసౌ = చెవులుముక్కును, చిచ్ఛేద=ఛేదించెను. ౭౦- తాభ్యాముభాభ్యాంసంభూయ=వారిద్దఱుచేరి, తాంప్రమదామధికృత్య=ఆస్త్రీనిగుఱించి, అహం=నేను, ఇమాం=ఈ, అవస్థాం=అవస్థను,నీతా=పొందింపఁబడితిని. ౭౧. ఇరువరాయి = ఇద్దఱుగా, వందార్=

ఎన్ ముఱ్ఱేనిన్నార్" అన్నట్లు ఒకరిద్దఱుగావచ్చిగదానన్నుభంగపఱచి నది. (తరుణౌ) అన్నదమ్ములైతేపరువమునందును కొంచెము తారతమ్య ముగానఁబడును. అట్లులేక ఏకాకారులయికదావారున్నవారు. జన్మనక్ష త్రములు పునర్వసుపుష్యములుకాఁబట్టి మొదటిదినము వెనుకటిదినముగా నుండుటం జేసియంతగా భేదముండదుకదా? ఇట్లుపరువముచే నెల్లవారల పరవశులంజేయుదురు అంతేనా ఆకారములుగాంచినఁగూడ సమాన ములుగానుండునాయనఁగా (రూపసంపన్నౌ) రూపముఁజూడఁగాఅంద ముకావలయునన్నవారు వారివద్దయాచించికొనిపోవలసినట్లు సర్వలోక శ్లాఘనీయమగుసౌందర్యముచే నొప్పికన్నులకలిమికిఁ దగుఫలముద్విధావి భక్తమైయున్నదియనితోఁచును. (రూపసంపన్నౌ) ద్ర॥ ౨౨ "కామనార్ తాతై"అన్నట్లు ఆకాముఁడును శ్రు॥ ౨౩"అంగాదంగాత్సంభవసి"అన్న విధముగనీతనిదేహముయొక్క యేకదేశమునుండియుత్పన్నుఁడగుటచేతనే గదా యట్టిసౌందర్యముగలవాఁడయ్యెను. (రూపసంపన్నౌ) ౨౪ "ఉత్ప న్నంద్రవ్యంక్షణంనిర్గుణంతిష్ఠతి" అనువచనముచొప్పున తొలుతఆశ్రయము ను పిమ్మటయాశ్రయమునందుగుణములునుకలుగునట్లుగాక॥ శ్లో॥ ౨౫"రూ పదాక్షిణ్యసంపన్నఃప్రసూతః" అనుచందముగ రూపతదాశ్రయములు రెండును సహోత్పన్నములయివే యీతనియందున్నవిసుమా. (రూ పసంపన్నౌ) ద్ర॥ ౨౬ "వడివుడైవానోర్తలవనే' అని "అచ్చోవొరువ

---

వచ్చిరి, ఎన్ముఱ్ఱే=నాయెదుట, నిన్నార్=నిలచిరి. ౨౨. కామనార్తాతై = కా మునికితండ్రి. ౨౩. అంగాదంగాత్ = అంగైకదేశమునుండి, సంభవసి=పుట్టితివి.

౨౪. ఉత్పన్నంద్రవ్యం = పుట్టినవస్తువు, క్షణం=పుట్టినక్షణకాలము, నిర్గు ణం=గుణశూన్యమై, తిష్ఠతి=ఉన్నది. ౨౫. రూపదాక్షిణ్యసంపన్నః=రూపముచే తను దాక్షిణ్యముచేతను పరిపూర్ణుఁడై, ప్రసూతః=కలిగెను. ౨౬. వడివుడై=సౌం దర్యముగల, వానోర్=దేవతలకు, తలైవనే=ముఖ్యుఁడా. అచ్చో=ఔర, ఒరు వళకియవా=ఏమిసౌందర్యము. ఎన్=నాయొక్క, ములై=కుచములను, అళ=ధ రించునట్లు, ఒరునాళ్=ఒకనాడు, ఉన్నకలత్తాల్=నీవిశాలవక్షముచేత, ఆళాయి =పరిపాలింపుము. కార్=నలుపు, ఆర్=నిండినట్టి, తిరుమేని=దేహమును, కండ

కిఱ్ఱయవా'' అని "ఎక్ముళై యాళవారునాళున్నకలత్తాలాళాయి'' అని " కారాళ్ తిరుమేనికఱ్ఱండదువేకారణమా పేరాప్పిదత్తా త్తిరుతరువన్ '' అని శ్లో॥ "రామేతిరామేతిసదైవబుద్ధ్యాపిచింత్యవాచాబ్రువతీ'' అనియు చెప్పఁబడునట్లు, ఆఁడుకూఁతులై పుట్టినవారు మోహాక్రాంతులై పిచ్చిపట్టివదరుచుండవలసినట్లున్నదిసుమా వారలయాకారము. ఇతరులెల్లవారు వారలకువ్యాప్యులేగాని సమానులుఁగూడ గారు. ఈయిరువురి దేహసౌందర్యములో నేకదా నేనిప్పుడుతగులుకొనిచిక్కుపడుచున్నాను. ఈసౌందర్యముండియు ఆలింగనముచేసికొంటిమేని, కఠినముగానుండునా యేమి యనిన (సుకుమారౌ) మోటురాక్షసులగుమీవంటికఠినదేహులు కారుసుమావారు. వారి దేహములు ఆలింగనముచేసికొన్న పుష్పములనుకౌగిలించికొనునట్లు మృదువులై యుండును. దృష్టాంతముచెప్పెదువారును॥ శ్లో॥ ౭౭ "అతసీపుష్పసంకాశం'' అని "రామమిందీవరశ్యామం''అని ద్ర॥ "పూవైపూవణ్ణా'' అని "కాయాంపూవణ్ణా'' అనియు పుష్పముతో సపోల్చివచియించిరి. (సుకుమారౌ) ద్ర॥ ౭౮ వడివిణైయిల్లామలర్ మకళ్ మత్తనిలమకళ్ పిడిక్కుమెల్లడి అన్నట్లు పుష్పములోనిపరిమళమును భూమిలోనిగంధమును ఉపాదానముగాఁగలవారలగు దేవీజనమును తాముకౌగిలించుకొనుటనుమాత్రమే కాకపదేపదే చూచుటనుగూడ ఓర్వఁజాలదుసుమీ వారిమార్దవరీతి. (సుకుమారౌ) ద్ర। ౭౯ "నడందకాళ్ కళ్ నొందవో'' అని "అడియార

దువే=చూచుటయో, కారణమా=హేతువుగా, పేరా=వానినామమునే, పిదత్తా =జల్పించుచు, తిరుతరువన్=తిరుగుదును. ౭౭. అతసీపుష్ప=నల్లఅగిసెపువ్వులో, సంకాశం=సమానుఁడును. పూవైపూవణ్ణా కాయాంపూవణ్ణా=ఈరెంటికి అతసీపుష్పమువంటి వర్ణముగలవాఁడనియర్థము. ౭౮. వడివిణైయిల్లా = సౌందర్యమునందుసాటిలేని, మలర్ మకళ్ =తామరసవాసిని—లక్ష్మి, మత్తనిలమకళ్ =ఇతరమైన భూమియు, పిడిక్కు=పట్టునట్టి, మెల్లడి=మృదువులగుపాదములు. ౭౯-నడందకాల్ కళ్ =నడిచినపాదములు, నొందవో=నొచ్చెనవో. అడియార్ =దాసులయొక్క, అల్లల్ =దుఃఖములను, తవిర్త=పోఁగొట్టిన, అశైవో=శ్రమమో? వెన్దిల్ = గెలుపునందు, ఇప్పడితాన్=ఇట్లు, తావియ=ఆక్రమించిన, అశైవో = శ్రమమో.

ల్లల్ తవిర్తవశ్శైవో'' అని "వెన్న విప్పడి తా఩్ నిండు తావియవశ్శైవో'' అని "తాళాలులకమళందవశ్శైవో కొల్''అనియు, స్వాభావికమగువ్యాపారము గూడ సుకుమార దేహమునకు ఆయాసకరమని యనుకూలురు మనస్సునొచ్చుకొనునట్లుగదా వారలమార్దవముండువిధము. (సుకుమారౌ) * దివ్యుఁడగు కాముఁడు ఒక్కరుఁడే. వీరి లేఁత పరువము చూడుము ఇద్దఱు మన్మథులవలె గదా తోఁచుచున్నవారు. (రూపసంపన్నౌ సుకుమారౌ) అతఁడనంగుఁడు గాగదా యుండును. "కందర్పఇవమూర్తిమా఩్'' అన్నట్లు ఈ మన్మథులు రూపవంతులై యున్నారు సుమీ. శ్లో॥ ౮౦ "రామమన్మథశరేణ తాడితా దుస్సహేన హృదయే నిశాచరీ'' అని, కామునిఁగా నే రాముని చెప్పియున్నాఁడుగదా. ఇట్లు తారుణ్యసౌందర్యములు మాత్రము గలిగి దూరముననుండి వశీకరించుటయే కాక సమీపించి యనుభవింపఁబోవ స్థిరముగ నిల్వలేక దుర్బలులుగా నుందురో యనఁగా (మహాబలౌ) వైయాత్యమునందును॥ ద్ర॥ ౮౧ "తోత్తోం మడనెంజమెంబెరుమా఩్ నారణర్క్కు''అని "వరైయెడుత్తపెరుమానుక్కు ఇఴ్ంతేనె఩్ వరివిళైయై'' అనియు ఆఁడుకూఁతులై పుట్టినవారు తమమనంబులందువలపుగొని వ్రాసియిచ్చునట్లుగదా వారున్నారు. (మహాబలౌ) శ్లో॥ ౮౨ "రామస్తుసీతయాసార్ధంవిజహారబహూ఩్ ఋతూ఩్'' అనియు

---

తాళాల్ = పాదముచేత, ఉలకం = లోకమును, అళంద = కొల్చిన, అశ్శైవోకోల్ = శ్రమమో. ౮౦. దుస్సహేన = సహింపగూడని, రామమన్మథశరేణ = రాముఁడనెడిమన్మథుని యొక్క బాణముచేత, హృదయే = ఉల్లమునందు, తాడితా = ప్రహరింపఁబడినదియగు, నిశాచరీ = రాక్షసి. ౮౧. మడనెంజం = ముగ్ధమగుమనస్సును, ఎంబెరుమా఩్ = నాస్వామియగు, నారణర్క్కు = నారాయణునికే, తోత్తోం = ఓడితిమి — అధీనముచేసితిమి. ఎ఩్ = నాయొక్క, వరివిళైయై = మినమినలాడుహస్తకంకణములుగలకూఁతును, వరైయెడుత్తపెరుమానుక్కు = కొండనెత్తినస్వామికి, ఇఴ్ంతే఩్ = ఓడితిని — సమర్పించితిని. ౮౨. రామస్తు = రాముఁడు, సీతయాసార్ధం = సీతతోడ, బహూ఩్ ఋతూ఩్ = పెక్కుఋతువులు, విజహార = విహరించెను. మైందనై =

---

* సు = మంచి, కు = భూమికి, మారౌ = మన్మథులు, అనుసర్థమువలన నీక్రిందటియోజన సరిపడును.

ద్ర॥ మైందనై మలరాళ్ మణవాళనై '' అనియు చెప్పినట్లు శృంగారమునందు అనేకబుతువులోకట్టికఁబ్రవర్తించినను వారిప్రాగల్భ్యము ఎదుటివారు అప్రధానులును తామేప్రధానులునయి వర్తించువిధముననుండునుసుమీ. లేక (మహాబలా) ద్ర॥ ౮౩ ''కాదర్ కడల్పురైయవిళైవిత్తకారమర్ మేని నంగణ్ణ '' అన్నట్లు, పదువమును దేహసౌందర్యమును సౌకుమార్యమును సాధనములుగాఁజేసికొనియితరులకుతటాలునతనవలలోఁజిక్కునట్లునచ్చిక పుట్టించి మరల తమహృదయమునందేవియుఁదూఱకయుండునట్లు † వారలయధ్యవసాయప్రాబల్యమున్నది. అయిననిట్టి సముదాయశోభకంటె నవయవశోభతగ్గియుండునాయనిన. (పుండరీకవిశాలాక్షౌ) కన్నులయందము చూచినవారలకుఁదృప్తికలుగఁజేయునట్టిదైనఁగదా మఱియొకయవయవమునందుప్రవర్తించిచూడనిచ్చును. (పుండరీకవిశాలాక్షౌ) ఇతరావయవశోభసమీపించినఁగానిసొక్కింపదు. అట్లుగాక ||ద్ర॥ ౮౪ ''తూతుశెయికణ్కళ్కొండొన్రుపేశి'' అనియు ''తామరైక్కణ్గళ్కొండీరిదియాలో'' అనియు, దౌత్యమునందునుదోచినంతమాత్రముననే సొక్కింపఁజేయునట్లుగఁగాకన్నులున్నవి. (పుండరీకవిశాలాక్షౌ) పుండరీకమనఁగా దెల్లతామరపువ్వు. శ్లో॥౮౫ ''సంరక్తనయనాఘోరాః''అన్నట్లు మీవలెరూక్షములగుకటాక్షములుగాక యాకన్నులు సుప్రసన్నధవళములై యున్నయవి. (పుండరీకవిశాలాక్షౌ) తమోగుణోద్రేకముచేత నిద్రాకషాయితములుగాక రజోగుణోద్రేకముచేత కోపసంరక్తములుగాకసత్వగుణప్రచురము

---

కుమారప్రాయముగలవాఁడును, మలరాళ్ మణవాళనై = తామరసవాసినియొక్క, పెండ్లికుమారుని. ౮౩- కాదల్ = వలపును, కడల్ పురైయ = సముద్రముపోరలున ట్లు, విళవిత్త = కలుఁగఁజేసిన, కారమర్ మేనినంగణ్ణ = నలుపుడాలు గలమనకృష్ణుడు. ౮౪. తూతుశెయి = దూతకృత్యముసేయునట్టి, కణ్గళ్కొండు = కన్నులఁగొని, ఒన్రు = ఒకవిషయము, పేశి = మాట్లాడి. ౮౫- సంరక్తనయనాః = మిక్కిలియెఱ్ఱనై

---

† అనఁగా స్త్రీలకు తమవిషయమున ఆశపుట్టునట్లుచేసి తాము వారల స్మరింపకయుండునట్టి మనోబలముగలవారనుట.

లగుటచే నతిప్రసన్నములగు వారికన్నులయొక్క ప్రసాదగుణము రక్షణో పయోగులగు తారకలతోను ఎఱ్ఱనిరేఖలతోనుగలసి యాహ్లాదావహము యియున్నది. (పుండరీకవిశాలాక్షా) వారు॥ శ్లో॥౮౬ "ఆత్మానంమానుషంమన్యే" అని, తమ్ముతామమరచిపోయినను॥ శ్రు॥ "యథాకప్యాసం పుండరీకమేవమక్షిణీ" అన్నట్లు ఈకన్నులు అంతరంగమునఁదాగియున్న పరత్వమును కొండెములుజెప్పిప్రకాశింపఁజేయుచున్నవి. (పుండరీకవిశాలాక్షా)క్షీరసముద్రము నకుంబోలిఎవ్వరునుస్వాంతముగ దెలిసికొనఁగూడని వైశాల్యముకలిగియుండువారికన్నులుఅట్లతివిశాలములై యున్నయవి.(పుండరీకవిశాలాక్షా) కన్నులయందుండెడి తేటదనంబునుబట్టి పుండరీకమునొక యుపమానముగఁజెప్పితిని. అంతేకానివైశాల్యముఁగాంచినయెడల సముద్రమునందుదిగినవారుదరిగానకభ్రమయుచందమునప్రాంతవిస్తీర్ణములై బెళుకులుజిమ్ముచు రక్తరేఖికాలంకృతంబులై యతిదీర్ఘములయి యొప్పునట్టిపెద్దకన్నులనిచెప్పవచ్చును.అంయకాని యాకన్నులుమఱియొకవిధము నవర్ణింపశక్యములా? (పుండరీకవిశాలాక్షా) ॥ద్ర॥ ౮౭ "ఉయిరెల్లాం తాయాయి యళికిన్ఱ తండామరైకణ్ణన్" అని "తడంగోళ్ తామరై కణ్ విరిత్తు విడంగోళ్ మూవులకుంతొళువిరుందరుళాయ్" అనిచెప్పఁబడినట్లు,బద్ధముక్తనిత్యాత్మకమయిత్రివిధకోటియగు నుభయవిభూతియు ను ఏకోద్యోగమునఁగటాక్షింపఁదగినవైనుమీయాకన్నులున్నయవి.(మహాబలౌపుండరీకవిశాలాక్షా)బలమునుచూపివారలనోడించివారు॥శ్లో॥ "జితంతేపుండరీకాక్ష"అని॥ద్ర॥౮౮ " తామరైకణ్ణనై విణ్ణోర్ పరవుంతలమకనై "

---

నకన్నులుగలవారును, ఘోరాః=క్రూరులును. ౮౬- ఆత్మానం=తన్ను,మానుషం= మనుష్యునిఁగా, మన్యే=తలఁచెదను. ౮౭- ఉయిరెల్లాం=ప్రాణులకెల్లను, తాయాయి=తల్లియయి, అళిక్కిన్ఱ=రక్షించునట్టి, తండామరైకణ్ణన్=పుండరీకవిశాలాక్షుఁడు. తడంగోళ్ తామరైకణ్ విరిత్తు = విశాలములగుతామరసనేత్రములనుతెఱచి, ఇడంగోళ్ =విశాలములగు, మువ్వులకుం=మూడులోకములును,తొళు-స్తుతింపఁగా, ఇరుందరుళాయి=వేంచేసియుండుమా. ౮౮ విణ్ణోర్ పరవుం - దేవతలుస్తుతించునట్టి,తలైమకనై-ముఖ్యుఁడగునట్టి, తామరైకణ్ణనై =తామరసాక్షుని,

అనిప్రాసియిచ్చునట్లు సేయుట కన్నులయందమునుసాధనము గాఁజేసికొని యేకదా?(మహాబలౌపుండరీకవిశాలాక్షౌ)వారలయందుప్రేమించినవారు మరలవెనుదీయుకర్ణ"అవలోకనదానేనభూయోమాంపాలయ"అనియు శ్లో॥ పుండరీకాక్షరక్షమాం" అనియు॥ ద్ర॥ "తామరైక్కణ్కళాలేనో క్కాయ్"అనియు, ప్రతిపదమునుప్రేమాతిరేకవశీకృతులై వారలుకాళ్లుపట్టు కొనినిర్బంధించునట్లుచేయునది యాకన్నులసొంపేసుమీ? పుండరీకవిశా లాక్షౌ సుకుమారౌ అనియెడి పదద్వయముచేతను మన్మథులేవీరలని చెప్పఁబడెను. అల్లైనపుష్పబాణములుండవలయునే, అట్లుపుష్పబాణము లుగలయాకారములుగలవారనఁగా॥ద్ర॥ ౯౦ "కణ్డైక్కణ్ణెన్నుశిరైకోల్ లాల్ నెంజూడురువవేయుండునిలైయుంతళర్ందునైవేనై" అన్నట్లు, న న్నుపూర్వస్థితిమార్చి తనకువశ్యఁగాఁజేసికొన్నపుష్పబాణములు ఈమన్మ థులకుఁగన్నులేసుమీ? అవయవశోభామాత్రముచేతనేనావశ్యపఱచుకొం దురు.అనఁగా (చీరకృష్ణాజినాంబరౌ) వారువేషాలంకారసౌభాగ్యముచే తను వశ్యపఱచుకొందురనియనుచున్నది.(చీరకృష్ణాజినాంబరౌ) ద్ర॥౯౧ "శెవ్వరత్తవుడైయాడైయదన్ మేలోర్శివళికైకచ్చు" అన్నట్లు, లోనఁ గట్టుకొనునదివల్కలము పైనధరించునది కృష్ణాజినముగాఁగదాయుందు రు. (చీరకృష్ణాజినాంబరౌ) తారుణ్యాదిగుణములసముదాయమును గుంభి తముచేసియుండునట్టిరత్నపేటికలుసుమీ? ॥శ్లో॥ "తరుణౌరూపసంపన్నౌ సుకుమారౌమహాబలౌ। పుండరీకవిశాలాక్షౌచీకృష్ణాజినాంబరౌ" శ్లో॥

---

ర్ణ-అవలోకనదానేన-కటాక్షించుటచేత, భూయః=విశేషించి,మాం=నన్ను,పాల య=పాలింపుము. పుండరీకాక్ష=తామరలవంటి కన్నులుగలవాఁడా, మాం = న న్ను, రక్ష=పాలింపుము, తామరైక్కణ్కళాలే=కమలములవంటికన్నులచేత, నో క్కాయి=కటాక్షింపుమీ.౯౦.కణ్డైక్కణ్ణెన్నుం=కటాక్షములనియెడి,శిరైకోల్లాల్- బాణవిశేషములచే, నెంజు=హృదయమును, ఊడురువవే=అంతయును, ఉండు= కబళీకరించి, నిలైయుం=స్థితియు, తళర్ందు=శిథిలమై, నైవేనై = కృశించుచున్న. ౯౧. శెవ్వరత్తవుడైయాడై=మిక్కిలిరక్తవర్ణమగుకట్టుదోవతియు, అదన్ మేల్ = దానిమీఁద, ఓర్శివళికైకచ్చు=సువర్ణరేఖాలంకృతమైన యొకయుదరబంధమును.

౯౨ "కిమివహిమధురాణాంమండనంనాకృతీనాం" అన్నట్లు, అనాగరిక వేషముగలవారగు ఋషులనుగూడవికృతరూపులనుగాఁజేయునట్టి యావల్కలాజినములు వారిదేహములందుఁజేరి విశేషసుందరములై యున్నవి. (చీరకృష్ణాజినాంబరౌ) వారెదిధరియించినను మనోహరమైయుండునుగదా? ఆకర్షకమనుటకు॥శ్లో॥ ౯౩ "తాసామావిరభూత్ శౌరిస్స్మయమాన ముఖాంబుజః । పీతాంబరధరస్స్రగ్వీసాక్షాత్ మన్మథమన్మథః" అని॥ద్ర॥ "పీతకవాడైయుడైతాళ్ పిరుందావనత్తేకండోమె" అని "శెయ్యాడైయుంతిరుముకముంశెంగనివాయుంకుళలుంకండు" అని యాఁడువారుప్రలాపించునట్లుసుమీ వారలవేషసౌందర్యముండెడివిధము. (చీరకృష్ణాజినాంబరౌ) ద్ర॥ ౯౪ "ఉడుత్తుకళైందనిన్ పీతకవాడైయుడుత్తుకలత్తదుండు" అని స్వరూపజ్ఞులాశించుటయు॥ద్ర॥ ౯౫ "పెరుమానరైయర్ పీతకవణ్ణవాడైకొండేనైన్నవాట్టం తణియవీశీరే" అని భోగపరులాశించుటయును † ఆపరియట్టమునుగదా? (చీరకృష్ణాజినాంబరౌ)॥ శ్లో॥

---

౯౨. మధురాణాం=మనోహరములగు, ఆకృతీనాం=ఆకారములకు, కిమివహి=ఏది, మండనంన=అలంకారముకాదు. ౯౩- స్మయమానముఖాంబుజః=చిఱునగవుచేవికసించుచున్న ముఖపద్మముగలవాఁడును, పీతాంబరధరః=పచ్చనివస్త్రము ధరించినవాఁడును, స్రగ్వీ=మాలికాలంకృతుండును. సాక్షాత్=ప్రత్యక్షముగ, మన్మథమన్మథః=మన్మథునికిమన్మథుఁడును అగు, శౌరిః=శ్రీకృష్ణుఁడు, తాసాం=ఆగోపికాజనులయెదుట, ఆవిరభూత్=ఆవిర్భవించెను. పీతకవాడైయుడై = ధరించియున్నపీతాఁబరము, తాళ్=కాళ్లపైజీరాడఁగా, పిరుందావనత్తే = బృందావనమునందు, కండోమె=చూచితిమి. శెయ్యాయుడైయుం=పీతాంబరమును, తిరుముఖముం=లక్ష్మీమందిరమయినమొగమును, శెంగనివాయుం=బింబమువంటియధరమును, కుళలుం=చికురభారమును, కండు=చూచి. ౯౪- ఉడుత్తుక్కళైందు=కట్టివిప్పిన, నిన్ పీతకవాడై=నీయొక్కపీతాంబరమును, ఉడుత్తు=ధరించి, కలత్తదు = నీవారగించినకంచములోనిది, ఉండు = భుజించి. ౯౫. పెరుమాన్ అరైయిల్ = నానాథుని [illegible] నడుమునఁగట్టికొన్న, పీతకవణ్ణవాడై = పీతవర్ణమైన వస్త్రమును,

---

† పరియట్టమనఁగా భగవద్భుక్తశేషమగు వస్త్రము. దీనిని తెలుఁగున చే[illegible]మోసిన గుడ్డయందురు.

౯౬ "రూపసంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతాం। దదృశుర్విస్మితాకారాః" అన్నట్లు స్వరూపధ్యానపరులగు ఋషులును ఈవిగ్రహగుణమున కుఁబరవశులై కట్టుకొంగువీడుటయు నెఱుంగకుండిరి. ॥శ్లో॥ ౯౭ "కన్యా కామయతే రూపం" అన్నట్లు ద్ర॥ ౯౮ "పెత్తకాలవనాకం పెణ్ పిఱందోమ్ ఉయ్యోమో" అని దేహము నానందింపఁజేసికొను స్త్రీలు చూచిసొక్కుట యుడుగవలయునా? [౨] లాఘవము చెప్పెడి యోజనయందు. (తరుణౌ) వారివద్ద సత్త్వున్నదియని తలఁచవద్దు॥ట్లు॥ "నయుద్ధయోగ్యతామస్య పశ్యామి" అన్నట్లు, యుద్ధమునకుశక్తులుగారు మిక్కిలిబాలురుగానున్నవారు. ఇది నేనుచెప్పినదేకాదు.॥శ్లో॥ "బాలోహ్యకృతవిద్యశ్చ నచవేత్తిబలాబలం। నచాస్త్రబలసంపన్నో నచయుద్ధవిశారదః" అని, కన్నతండ్రియునుమనోవ్యథపడలేదా. (తరుణౌ) ॥శ్లో॥ ౯౯ "యౌవనేవిషయైషిణాం" అన్నట్లు విషయప్రవణులై యన్యపరులగుచు తిరుగుచున్నవారలకును చేయఁబూనుకొనఁదగుయుద్ధమొక్కటిగలదా? బాలురగుటమాత్రముకాదు. (రూపసంపన్నౌ) ॥శ్లో॥ "కన్యాకామయతేరూపం" అనియు॥శ్లో॥౧౦౦ "రూపేణ వనితాజనం" అనియు, స్త్రీలనువశ్యపఱుచుకొనుటకై మేనుమిటారించుకొనితిరుగుచున్నవారేకాక పురుషులనువశ్యపఱుచుకొనునట్టి మగతనము గలవారుగారుసుమీ?(రూపసంపన్నౌ) వెదురుఁబొదవలెశరీరపుపైపచ్చనమాత్రమేకాని యంతరమునసత్త్వమేమియులేదు. అందుకుమూలమేమనఁగా (సుకుమారౌ) శ్రీమంతునిపుత్రులగుటచేత మిగులకోమలులైసుమీ

---

కొండు=కొని, ఎన్నై=నన్ను, వాట్టంతణియ = తాపమణఁగునట్లు, వీశిరే=విసరుఁడు. ౯౬. రూపసంహననం = సౌందర్యముగలశరీరమును, లక్ష్మీం=శోభను, సౌకుమార్యం=సుకుమారత్వమును, సువేషతాం = మంచివేషముకలిగిన తనమును, విస్మితాకారాః=ఆశ్చర్యమునొందిన యాకారముగలవారలై, దదృశుః = చూచిరి. ౯౭. కన్యా=పడుచు, రూపం=సౌందర్యమును, కామయతే=కోరుచున్నది. ౯౮. అవనాకం=వానివక్షమును, పెత్తక్కాల్=పొందినయెడల, పెణ్ పిఱందోం=స్త్రీలై పుట్టినవారము, ఉయ్యోమే=ఉజ్జీవింపమా. ౯౯- యౌవనే=తారుణ్యమునందు, విషయైషిణాం=స్రక్చందన వనితాదులఁగోరుచున్నవారు. ౧౦౦. వనితాజనం=స్త్రీల

వారున్నారు.(సుకుమారౌ)॥శ్లో॥౧౦౧ "పరశ్వధహతస్యాద్యమందప్రాణ స్యభూతలే" అన్నట్లు, క్రేగన్నులు జేగుఱింపనీవుచూచురూక్షేక్షణములకు మాసిపోవఁదగియుండెడివారౌ నీయొక్క యత్యుగ్రములగు నాయుధముల కోర్వఁగలరు. ఆకారమునుజూడఁగాశక్తులుగారనితోఁచెను. కార్యముల యందుసమర్థులయియుందురోయేమోయనిన(మహాబలౌ)* మిక్కిలిదు ర్బలులు. బలహీనులగుటమాత్రమేకాదుసుమా? క్రమాగతమగురాజ్యము నిచ్చుచున్నను దానినివశగతముచేసికొని పరిపాలింపనేర్పులేక యొకస్త్రీ మాత్రమునకుభయపడి యెల్లభోగములనుపోఁగొట్టుకొనిన బుద్ధిచాలని బాలకులైగదావారున్నవారు. (మహాబలౌ) బలవంతులయినను వీరిద్దఱే కాని వీరికిపైపైనిబలమైనసహాయము రాఁదగినవారుఎవ్వరునులేరు॥శ్లో॥౧౦౨ "దృష్టాతత్రమయానారీతయోర్మధ్యేసుమధ్యమా" అన్నట్లు,పాదములకు బందమగువిధముగఁబరతంత్రురాలైనయొక్క కాంతను వీఁపునఁగట్టుకొని తిరిగెడివారౌ?నీతోడియుద్ధమునకుఁబూనువారు.యుద్ధమునకుఁబూనఁబో రుఅనియెన్నెటిఁగితివనిన(పుండరీకవిశాలాక్షౌ) రాఁబోవుసంగతినెఱుఁగక దీనిముక్కుచెవులుకోసితిమి. ఇఁకనేమిసంభవించునోయని భయభ్రాంతు లై తెలతెలబాఱుకన్నులతో నలుదిక్కులుబెదరిచూడఁగాఁగనుఁగొంటిని గదా? (పుండరీకవిశాలాక్షౌ) పుండరీకమనఁగా తెల్లతామర. నీటిలోనుం డఁదగిన తామరనుమెట్టనేలకీడ్చునట్లు తమయొక్కదేశమగు నగరమునం దుండునప్పుడు వారుసమర్థులెయయియుండవచ్చునుగాని యిట్టివనప్రదేశ మందు వారివలననేమియుశక్యముకాదు అనుటను వారలకన్నులేతెలుపు చున్నవిసుమా? వారుశక్తులుకాకపోయినను ఐశ్వర్యముచేబలముసంపా

---

ను, రూపేణ=సౌందర్యముచేత, వశీకరింపవలయు. ౧౦౧. అద్య=ఇప్పుడు, పర శ్వధహతస్య=గండ్రగొడ్డలిచే నఱకఁబడిన, మందప్రాణస్య=స్వల్పమగుబలముగ లవానియొక్క, భూతలే=భూమియందు. ౧౦౨. తత్ర=అచోట, తయోర్మధ్యే= వారలనడుమ, సుమధ్యమా=మంచినడుముగల, నారీ=స్త్రీ, దృష్టా=కనఁబడెను.

---

* ఇక్కడ మహాఅబలౌ అని పదచ్ఛేదము మిక్కిలి పసివారుఅని యర్థము.

దించియుద్ధముసేయుటకు వారికడ్డమేమియనియూరకయుండవలదు (చీర కృష్ణాజినాంబరౌ)ధరించుకొనుటకు మంచివస్త్రములుసయితములేకయడ వియందుచెట్లనారలను జింకలతోళ్లనుధరించితిరి గెడివారు కాసుదొరకిబల ముఁజేర్చుకొని రాఁబోయెదరా? రాబోరు. (చీరకృష్ణాజినాంబరౌ) కట్టు కొనుగుడ్డలు రెండును ఏకజాతీయములుగానైననున్నవాయనిన, మొలకు కట్టుకొనునదియొకవిధమును పైనివేసికొనునది మఱియొకవిధమునుగాఁగ దాయున్నవి. (చీరకృష్ణాజినాంబరౌ)అవియును స్థావరమొకటిని జంగమ మొకటినియియ్యఁగా ఇట్లు పెక్కంటినియాచించి తెచ్చుకొనినవిగాని పౌ రుషముతోఁదెచ్చుకొన్నవికూడకావు.[3] పౌరుషోపపాదనయోజనలో- (తరుణౌ) "ఊనషోడశవర్షః" అనఁదగుకౌమారప్రాయముగాక "అనేక వర్షసాహస్రోవృద్ధస్త్వమసిపార్థివ" అన్నట్లు ముదిరినపరువమునుగాక యుద్ధమనిచెప్పినమాత్రముచేతనే యెక్కుడెక్కుడచూపుమనివచ్చునట్టికిశో రయౌవనవయస్సునుమావారలది. (తరుణౌ) ౧౦౩ "యావనేవిషయై షిణాం" "రాజ్యకామవిషయావిభేదిరే" "భవద్విషయవాసినః" అని యుండుటచే, విషయశబ్దము రాజ్యవాచియగుటంజేసి ఇంకను రాజ్యమును సంపాదింపవలయునని పైపైవిజయేషువులగుపరువముగదా. (తరుణౌ) ఇట్టిపరువముగలవారొక్కరేచాలియుండ ఇరువురుగాఁగూడిరేని సాధ్య ముకానిదియునుగలదా? ఈపరువమునుయోగ్యతయునున్నదికాని ఆకార మునుజూడఁగా వీరేమియుద్ధముసేయఁగలరని చెప్పఁదగినట్లాభాసముగ నుండునాయనఁగా (రూపసంపన్నౌ) ||శ్లో||౧౦౪ "సింహోరస్కంమహా బాహుం" అన్నట్లు శత్రుపరాజయమునకు ఆయుధమక్కఱలేక వారల భుజములును వక్షస్థ్సలమునుజూచియే శత్రులు వెనుకకుమరలునట్లుగదా వారిరూపములున్నవి. (రూపసంపన్నౌ) రూపమువలనఁగలిగినగౌరవము చేతఁబరువమునుబట్టియూహించుటయేకాదు||శ్లో|| "గత్వాసౌమిత్రిసహి

---

౧౦౩. ఇచ్చటివిషయశబ్దము దేశమును తెలుపును. ౧౦౪. సింహోరస్కం=సిం గముయొక్క వక్షస్థలమువంటి వక్షస్థలముగలవాఁడును, మహాబాహుం=గొప్పభు

తోనావిజిత్యనివర్తతే" ౧౦౫ అని, "యశసశ్చైకభాజనం" అనిచెప్పఁబడినట్లు, అయోధ్యాపరిసరము మొదలుకొని సుబాహుమారీచాదివిరోధివధముచేయుటచేత పెద్దగౌరవముగలవారలునుగదా? అనియుభావము. ఇట్లు విరోధివధమును శ్రమపడి క్లేశముతోనా చేయుదురనిన, (సుకుమారౌ) వారిపౌరుషమునందేని యొకవిధమయినకొఱఁతనునిరూపింపవచ్చును గాని దేహసౌందర్యమునుజూడఁగా బహుముఖమయి యసహ్యమయి యుండుటయేకాక యత్యంతమభిరూపమునై కదాయున్నది. (సుకుమారౌ) వారుకోపముతోఁ గన్నులెఱ్ఱవాఱఁజూచు నెడ ముందుముందువచ్చినయిద్ద ఱను ముగ్గురనుజంపివదలుదురనుటయేకాదు॥ శ్లో॥ ౧౦౬ "సదైవగంధర్వమనుష్యపన్నగం జగత్సశైలంపరివర్తయామి" అని, "సాగరమేఖలాంమహీందహత్రికోపేన" అనిఅన్నట్లు, తటాలున నీభూమియంతనునశింపఁజేయుదురు. ఇట్లునశింపఁజేయుటకుకారణమేమనఁగా. (మహాబలౌ) అధికమయినబాహుబలమేకారణముగానున్నది. (మహాబలౌ) మహచ్ఛబ్దముచేత కేవలము బాహుబలముమాత్రముకాదు. బాహుబలమును మనోబలము గలవారని తెలుపుచున్నది. (మహాబలౌ) వారిబలాతిశయప్రకారము నీయొక్క చతురంగబలమును అసత్కల్పమగునట్లుసుమీయున్నది. (మహాబలౌ) బహుకాలముయుద్ధముచేసినను శ్రమముకలుగకుండునట్టిబలాతిబలలనియెడివిద్యలుగలవారు. ఇట్లుశ్రాంతిలేకయుందురనియెట్లెఱింగితివనిన. (పుండరీకవిశాలాక్షౌ) మెరకనేలయగు నీయడవియందుసంచరించునప్పుడును తానుండుచోటనుండెడి తామరవలె వెలుంగుచుండెడి యాకన్నులసొంపు ఒక్కటియే తెలుపుచున్నది. (పుండరీకవిశాలాక్షౌ) శత్రువులనిచెప్పినంతమాత్రమున వారియెడలనొకగౌరమునుచేసి సంకోచించుట వికసించుటయనెడి వికారములనొందక యవికృతములైకదాయున్నవి వారికన్నులు. (పుండ

---

జములుగలవాఁడును. ౧౦౫- యశసశ్చ=కీర్తికి, ఏకభాజనం = ముఖ్యస్థానము. ౧౦౬- సదైవగంధర్వమనుష్యపన్నగం= దేవతలు గంధర్వులు మనుష్యులు నాగములు వీనితోగూడినదియు, సశైలం=పర్వతములతోఁగూడినదియునగు, జగత్=లో

రీకవిశాలాక్షౌ) శ్లో॥ ౧౦౭ "ప్రీతివిస్ఫారితేక్షణం" అన్నట్లు, వారికన్నులు శత్రులనుచూచినప్పుడత్యుగ్రములు కాక ప్రౌఢిమముచేత అప్పటప్పటికి విస్తృతంబులై వెలుంగుచుండునుసుమా (పుండరీకవిశాలాక్షౌ) శత్రులను జూడఁగానే యిట్లుమొగములువికసించుటకుఁగారణమేమి? యుద్ధమునకుఁ బోవుటకని తదుపయోగికవచాదులనుధరించి సన్నద్ధులయియుండినంగదా యిట్లుండనగును. అసమయమునవచ్చి యెదురైరేని యేమిచేయఁగలరన, (చీరకృష్ణాజినాంబరౌ) శ్లో॥ ౧౦౮ "సన్నద్ధావిచరిష్యతః" అన్నట్లు, నడుములందుదట్టీలుగట్టుకొని మేనులందుగవచముదొడిగియు సన్నద్ధులుగానే వారున్నారుసుమీ (చీరకృష్ణాజినాంబరౌ) అడవిలోసర్వవిధసత్వములను వేఁటాడుచుసంచరించెడువారలగుటచే కట్టువస్త్రములు కృష్ణాజినమును వలకలమునుగావారుసంచరింతురు. ఏతావతా॥ శ్లో॥ ౧౦౯ "సత్యేనలోకాన్ జయతిదీనాన్ దానేనరాఘవః । గురూన్ శుశ్రూషయావీరోధనుషా యుధిశాత్రవాన్" అన్నట్లు, సుందరులనుసౌందర్యముచేతను శత్రువుల నుబాణములచేతను అగతికులను అధికకృపచేతను అనుకూలింపఁజేసికొను చు వారివారికిఁ దగినట్టిసాధనములుగలవారయిసుమీ యాకుమారులున్నారు. అట్లగుటచేత॥ద్వ॥ ౧౧౦ "వల్లాళన్ తోళుంవాళరక్కన్ ముడియుం తంగైపొల్లాదమూక్కుంపోక్కి-వైత్తాన్" అన్నట్లు, నేనుముక్కుకోసికొ

---

కమును, పరివర్తయామి=తలక్రిందుచేయుదును. ౧౦౭- ప్రీతివిస్ఫారితేక్షణం=ప్రేమచేవిస్తృతములుగాఁ జేయఁబడిన కన్నులుగలవాఁడు. ౧౦౮- సన్నద్ధౌ=సన్నాహముగలవారై=విచరిష్యతః=సంచరించుచున్నవారు. ౧౦౯- వీరః=శూరుఁడగు, రాఘవః=శ్రీరాముఁడు, సత్యేన=సత్యముచేత, లోకాన్=లోకములను, జయతి=జయించుచున్నాఁడు, దీనాన్=దరిద్రులను, దానేన=ఈవిచేతను, గురూన్ = ఆచార్యులు తల్లిదండ్రులులోనగు పెద్దలను, శుశ్రూషయా = పరిచర్యచేత, జయతి =జయించుచున్నాఁడు, యుధి=యుద్ధమునందు, ధనుషా = చాపముచేత, శాత్రవాన్=శత్రువులను, జయతి=జయించుచున్నాఁడు. ౧౧౦- వల్లాళన్=బలముగలవారియొక్క, తోళుం=భుజములును, వాళరక్కన్ = క్రూరరాక్షసునియొక్క, ముడియుం=శిరమును, తంగైపొల్లాదమూక్కుం=వానిచెల్లెలైన చెడ్డదానిముక్కును, పోక్కి-వైత్తాన్=పోఁగొట్టినాఁడు.

న్నరీతి నీవుతలకోసికొనవలసినదేకాని వారితోయుద్ధముచేయునెడ నీప్ర
యత్నమేమియుఫలిఁయింపదు అనిపరిభవించిచెప్పుచున్నది.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణంప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు
తరుణౌ అను శ్లోకముయొక్క యుపన్యాసము సంపూర్ణము.





శ్రీరామచంద్రాయనమః.

ఖరాసురాది చతుర్దశసహస్రసంఖ్యాగల క్రూరరాక్షసులనుసంహరించి శ్రీరా
ముఁడుమరలి యాశ్రమమునకురాఁగా సీతాదేవి మిక్కిలిసంతోషపడి యాలింగ
నముచేసికొనెనని యీక్రిందిశ్లోకముచేతఁ దెలుపఁబడుచున్నది. ఇది శ్రీరామాయ
ణము ఆరణ్యకాండములో ముప్పదివసర్గలోనిది.

శ్లో॥ తందృష్ట్వాశత్రుహంతారంమహర్షీణాంసుఖావహం।
బభూవహృష్టావైదేహీభర్తారంపరిషస్వజే॥౧౫॥

టీ॥ శత్రుహంతారం=శత్రువులను సంహరించినట్టివాఁడును, మహర్షీణాం
గొప్పఋషులకు, సుఖావహం=సుఖమునుజేయుఁవాడునుఅగు, భర్తారం=పెనిమి
టియైన రాముని, దృష్ట్వా=కని, వైదేహీ=సీతాదేవి, హృష్టాసతీ=సంతోషించినది
యై, తం=ఆరాముని, పరిషస్వజే=ఆలింగనముచేసికొనెను.

తా॥ ఖరాసురుఁడుమొదలగు శత్రువులనుసంహరించి మహర్షులకు సుఖము
గలుగఁజేసిన తనపెనిమిటియగు రామునింగాంచి సీతాదేవిసంతోషపడి కౌఁగిలిం
చుకొనెను.

చతుర్దశసహస్రాణీయనుప్రక్రియచేత రాక్షసులనువేఁటాడినశ్రీరా
మునియొక్కయుద్ధాయాసపరిస్విన్నమగు దేహమునకు రాక్షసశరవ్రాత
వ్రణారోపణదివ్యౌషధమగు గాఢాలింగనముచేసి సీతాదేవిసత్తఁజెందె
ననుచున్నాఁడు. (తం) శ్లో॥ "స్త్రీయంపురుషవిగ్రహం" అని సీతాదేవి
యవశ్యముగ చెప్పవలసివచ్చునట్లు రాక్షసభూయిష్ఠమగు దేశమునకునిన్ను
వెంటఁగొనిపోవ భయపడుచున్నాననిచెప్పినవానిని.(తం)"స్త్రీయంపురుష

విగ్రహం" అని సీతాదేవి చెప్పఁగా ఆదినము మొదలు హృదయమున చలము వెట్టుకొని పదునాలుగు వేల రాక్షసులను శిరస్సులు మొండెములు వేఱుపడ ఖండించి రక్తప్రవాహమందుముంచి సీతాదేవిని చెయిపట్టుకొని తీసికొనిపోయి చూపించినవానిని. (తం) "ఆదిత్యఇవ తేజస్వీ" ఇత్యాదివీర స్తుతికి చిటికెనవ్రేలు ముడువఁదగు విధముగ నవతరించినవానిని. (తం) పరుండి యుండిన శయనంబున విడిపూవుండియది తాకనేనికందిపోవు శరీర సౌకుమా ర్యముగలవానిని. (తం) ప్రేమచేఁ గౌగిలించి చూచినను నయమగు తేజస్సుకు స్థానమేమైన దేహముగలవానిని. (తం) ఋషులకొఱకుఁ జేసిన ప్రతిజ్ఞ సము ద్రఘోషము కాకుండ నిర్వహించుటం జేసి పూర్ణుఁడగువానిని. (తం) రత్నఖచి తమగు చంద్రహారము వలె శత్రుశరవ్రాతవ్రణాంకితమగు దివ్యమంగళవిగ్రహ ముగలవానిని. (దృష్ట్వా) ఇందీవరమాలికను పన్నీటఁ దడిపి యొత్తువారివలె యుద్ధాయాసపరిస్విన్నమగు దేహమును తనచూపులనియెడి పన్నీటిచే నభి షిక్తముఁ జేసి. (దృష్ట్వా) ఆతపాభిభూతులకు శీతతటాకప్రవేశమువలె రాక్షసాశనికరాభిఘాతమైన రాముని దేహమును తనచూపులనియెడి పరి పూర్ణతటాకమున ముంచి యెత్తి. (శత్రుహంతారం) ప్రతిపక్షనిరసనము చే మినమినలాడు దేహముగలవానిని॥ శ్లో॥ ౧ "సమోహంసర్వభూతేషు" అనియెడి పరమాత్మకు శత్రువులు నుకలరాయనిన॥ శ్లో॥ ౨ "జ్ఞానీత్వాత్మై వ * మమప్రాణాహి" ఇత్యాదులవలన ఆశ్రితవిరోధులు ఆతనికి విరోధులగు దురు. (మహర్షీణాంసుఖావహం) యుద్ధముపక్రమించినది మొదలు కిం భవిష్యతి అని కడుపులో దిగులుతోఁగూడ నతిదుఃఖితులయియున్న మహ ర్షులయొక్క భయముతీరునట్లు శత్రువులనందఱను సంహరించి వారికి సుఖ మునుగలుగఁజేసినవానిని. (మహర్షీణాంసుఖావహం) తమయొక్క పోష్య కుటుంబమునకు సుఖముకలుగఁజేసి తనయొక్క సత్తకు ఆపాదకుఁడైన

---

౧. అహం=నేను, సర్వభూతేషు=ఎల్లప్రాణులయందును, సమః = వైష మ్యములేనివాఁడు. ౨. జ్ఞానీతు=జ్ఞానముగలవాఁడైతే, ఆత్మైవ = ప్రాణమనియే, మే=నాయొక్క, మతం=అభిప్రాయము *, పాండవులు, మమ = నాయొక్క

వానిని. (బభూవ) పువ్వునుతావియునుంబోలె అత్యంతసుకుమారమగువిగ్ర
హమును స్వభావమునుగల రాముఁడు కఠినగాత్రస్వభావులగు మోటు
రాక్షసులతో యుద్ధముప్రారంభించినదిమొదలు ప్రేమాతిశయముచేత
సత్తనశించియున్న సీత తనదేహమున కేవిధమైనచెఱుపునులేకవచ్చి యె
దుటనిలిచినశ్రీరామునిఁగనిసత్తునుజెందెను. (హృష్టా) ధర్మియున్నయెడలనే
ధర్మమునుపుట్టును. కనుక రామసౌందర్యమునుపరిపూర్ణముగఁగాంచిహృ
దయమునపరమానందముఁజెందెను. (వైదేహీ) అయ్యా కౌసల్యాగర్భము
నఁబుట్టకపోతినేని నాకీవిశేషఫలములభింపదే. (వైదేహీ) ఈకులమునందు
జనియింపకపోతినేని శ్రీరాముఁడునన్నుచేపట్టుఁడే. (వైదేహీ) ఈచోటఁ
బుట్టకపోతినేని యావింటితోసౌభాగ్యముకలుగదే. ఆవింటితోసౌభాగ్య
ములేనియెడల వీర్యశుల్కగా నీయాకారమునుసంభవింపదే. (వైదేహీ)
ధనుర్భంగమాత్రముననే నన్నునుతనవంశమును శ్రీరామునికిశేషమగునట్లు
వ్రాసియిచ్చిననాయయ్యగారుఈయాకారముగాంచిరేనియేమగుదురో.
(వైదేహీ) ౩ "పుంసాందృష్టిచిత్తాపహారిణం" అన్నట్లు, సర్వలోకాకర్షక
మగునీయవస్థానమును అయ్యా లేక నేనుమాత్రముచూచుదాననైతినేయని
పితృస్మృతిఁజేసెను. ( భర్తారం ) పాణిగ్రహణవేళమొదలు పతిత్వప్ర
తిపత్తిచేయుచుండెను. ఇప్పుడేకదా ధాత్వర్థము *జీవించెను. (పరిషస్వజే)
పర్యాప్తముగఁదడవెను. వ్రణములాఱునంతవఱకుపరామర్శించెను. శరా
సారముచేఁగలిగినగాయములు ఆఱునట్లు తన కుచతటములచే నొత్తడమి
చ్చెను. ఆలింగనము శరవ్రణములకు హస్తగతమగుమందుగదా? ఆశ్లేష
ధమైయుండఁగా ఐదైనను ఏనూరైననుఏమి. ఐదుకుమందయినదే యే
నూటికినిమందగునుగదా? సీతాదేవియొక్కయాలింగనము రామునికి మ
న్మథుఁడు మర్మములంటనేసిన బాణములచేనైన హృదయగతవ్రణమునకు
మందుకాఁగాత్వఙ్మాత్రమునందుఁ గలిగినవ్రణమునకుమందగుననుటచెప్ప
వలయునా? లతయగునది ప్రాఁకుడుచెట్టునుఆక్రమించికొనిగాని నిలువదు

---

ప్రాణాహి = ప్రాణములుగదా? ౩-పుంసాం = పురుషులయొక్క, దృష్టి = చూపును,

---

* భృఞ్ భరణేయని ధాతువు. భరించెడువాఁడనియర్థము.

గదా? (భర్తారంపరిషస్వజే) నిత్యసంయోగస్థితిరూపమగు భర్తృత్వా
కారమొకయుపఘ్నమునకగు నేనిఆప్రాఁకుఁడైన చెట్టునాధారముచేసికొని
యంతటను అల్లుకొని దానిని విశేషింపఁజేసికొనియుండినంగాని స్వరూ
పములేదుగదా? భార్యాత్వాకారమైనలతకు॥ శ్లో॥ ౪ "భర్తారమవలం
బ్యైవ భార్యాయాస్థ్సితిరిష్యతే । అవలంబ్యద్రుమంవల్లీస్థీయతే నవినా
ద్రుమం" అన్నట్లు, భర్తృత్వాకారమగు ప్రాఁకుఁడుప్రాఁకులేక నిలుక
డసంభవింపదు. (తం) అనుపదము శ్రీరామునిసర్వాకారమునుగనఁబఱు
చుచున్నది. దృష్ట్వా అనుపదముచే శ్రీరామునియొక్క సర్వాకారములను
నిరూపించి చూచుటకుఁ గన్నులుగలది సీతాదేవియనుట దెల్పఁబడుచు
న్నది. "శత్రుహంతారంమహర్షీణాంఁసుఖావహం" అనుపదములు తన
తోగర్భసంబంధముగలచేతనులకు అనిష్టనివృత్తియునిష్టప్రాప్తియుగలగఁ
జేసినప్పుడుగాని యీతనింగాంచఁ గన్నులుగలవుఅనుటను తెలుపుచు
న్నవి. (బభూవ) రామునకతిశయావహమై సత్తఁజెందెను. (హృష్టా)
౪ సతిధర్మిణిధర్మాఃచిత్యంతే. (వైదేహీ) ఉపకారస్మృతిసేయుచున్నదీ.
(భర్తారం) తనకార్యమువహించుకొని చేసినవాఁడు అని తెలుపుచున్నది.
తనకార్యమునువహించుకొని చేయుటయనఁగా॥ శ్లో॥ ౫ "పితుర్దశగుణం
మాతా" అనియుండుటచే తాను పుత్రరక్షణముసేయుటయే తనపని.
(భర్తారంపరిషస్వజే) ఆశ్రితరక్షణమువలనఁ గలిగిన యామోదరసపు

---

చిత్త=మనస్సును, అపహారిణం=అపహరించెడువానిని. ౪- భార్యాయాః=భార్య
యొక్క, స్థితిః=ఉనికి, భర్తారం=పెనిమిటిని, అవలంబ్యైవ=అవలంబముగాఁజే
సికొనియే, ఇష్యతే=ఇచ్ఛింపఁబడుచున్నది, వల్లీ=తీఁగె, ద్రుమం = వృక్షమును,
అవలంబ్య=అవలంబముగఁజేసికొని, స్థీయతే=ఉన్నది, ద్రుమంవినా=చెట్టులేకయే
న=లేదు. ౪- సతిధర్మిణి=ధర్మములకాధారమగు వస్తువుండ నేనిగదా, ధర్మాః =
ధర్మములు, చింత్యంతే=చింతింపఁబడుచున్నవి—ఊహింపఁబడుననుట. ౫-మాతా
=తల్లి, పితుః=తండ్రికంటె, దశగుణం=పదంతలధికురాలు.

చెలువునకు కలుజు ఆలింగనమేయయునట్లుండెను. ఆతనికి ప్రయోజన మదియేసుమీ॥.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణంప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు తంద్రష్ట్వా అను శ్లోకముయొక్క యుపన్యాసము సంపూర్ణము.

---

శ్రీరామచంద్రాయనమః.

---

శ్రీరాముఁడు పంపాసరోవరసమీపముననుండెడి వనవాటికయందు వాసముసేయుచు నచ్చటి విరహోద్దీపనములగు కోకిలాలాపాదులకోర్వలేక లక్ష్మణునితో నీక్రిందిశ్లోకముచేత మలయమారుతముయొక్క రీతిని దెలుపుచున్నాఁడు. ఇది కిష్కింధాకాండము మొదటిసర్గలోనిది.

శ్లో॥ పద్మకేసరసంసృష్టోవృక్షాంతరవినిస్సృతః।
నిశ్వాసఇవసీతాయావాతివాయుర్మనోహరః॥౧౬॥

టీ॥ వాయుః=వాయువు, పద్మకేసర = తామరపువ్వులయొక్క కింజల్కముతో, సంసృష్టః=కలసియుండునదియును, వృక్షాంతర=చెట్లయొక్కమధ్యప్రదేశములనుండి, వినిసృతః=బయలువెడలినదియునై, సీతాయాః=సీతాదేవియొక్క, నిశ్వాసఇవ=నిట్టూర్పువలెనే, మనోహరః = మనస్సును ఆకర్షించునదియై, వాతి=వీచుచున్నది.

తా॥ వాయువు పద్మములకింజల్కములమీఁదుగాఁగదలి చెట్లనడుమనుండి వెడలివచ్చుచు సీతాదేవి నిట్టూర్పు గాలివలె మనస్సునాకర్షించుచు వీచుచున్నది.

(పద్మకేసరసంసృష్టః) సర్వప్రాణులకు ప్రాణనహేతువగు గాలియే నాయొక్క సర్వస్వాపహారము సేయుచున్నది యనుచున్నాఁడు. (పద్మకేసరసంసృష్టః) ఈగాలికార్యము దుమారము రేపి క్రమ్ముటయగుచున్నది. (పద్మకేసరసంసృష్టః) తామరసవాసిని నన్ను చేజాఱవిడువఁగా తామరకేసరములును ప్రతికూలించెను (పద్మకేసరసంసృష్టః)శ్లో॥ ౧"పా

---

౧. పంకజరజః=తామరపువ్వులయొక్క రేణువు, పాదారుంతుదమేవ =

దారుంతుదమేవ పంకజరజః" అన్నట్లు, ఆమెకే బాధకమయియుండునది మనకు బాధకమగుననుట చెప్పవలసినదిలేదుగదే, (పద్మకేసరసంసృష్టః) దీనియొక్క రాజసగుణముండెడి విధమేమియనవచ్చును. నన్నుఁగూడమ దించలంపకనేయున్నది, (పద్మకేసరసంసృష్టః) ఇందులకుమూలము కంటకములతో దృఢసంసర్గముసుమీ? (పద్మకేసరసంసృష్టః) ఇది గాలియనియుంటిమి. తుదకిది కేసరియయికనుపడుచున్నది. (పద్మకేసరసంసృష్టః) తనకుఁబైని సహాయాంతరమునుగూర్చుకొని వచ్చుచున్నయది. రూపవంతులుగదా అసహాయశూరులై యుందురు. ఇదిరూపహీనమగుటచేతోడు వెదకుకొనివచ్చుచున్నది. ఇట్లు బాధకమయివచ్చెనేని యదిదెలిసి వెంటనె పరిహరింపనేమియడ్డు అనఁగా (వృక్షాంతరవినిస్సృతః) దూరమునరాఁగాఁగాంచి పరిహరింపఁగూడనియట్లు॥ద్ర॥ ౨ "కున్నాదిడుపొలిల్ నువాళ్లుందేశ" అన్నట్లు, వృక్షములలోవచ్చి దాఁగియుండి మధ్యమువలన బయలువెడలఁగాఁగాంచితి నంతియకదా? (వృక్షాంతర వినిస్సృతః) ఆగర్భశ్రీమంతులు ఎండపొడసోఁకకుండ నీడనేవచ్చునట్లు, ఇదియును చెట్లనీడలయందు వచ్చుచున్నది. పద్మకేసరసంసృష్టః అనుటచేత సౌరభ్యము చెప్పఁబడెను. వృక్షాంతరవినిస్సృతః అని వృక్షముల చేరువను నిలచి వానియంతరములగుండ బయలువెడలి వచ్చుచున్నదియని వచియించుటచే మాంద్యముసూచింపఁబడియెను. చెట్లనీడలయందే తెంచుటచేతను తామరలలోని మధువును ఆకర్షించుకొనివచ్చుటచేతను శైత్యముచెప్పఁబడెను. ఏతావతా సౌరభ్యము మాంద్యము శైత్యము ఈమూడును చెప్పఁబడెను. (వృక్షాంతరవినిస్సృతః) మిక్కిలి శ్రమజెందియున్నమమ్మును జెట్లక్రిందనొదుఁగనిచ్చుటలేదు. ఇట్లు బాధకముగవచ్చెనేని మనకు ప్రతికూలముగానుండునోయనఁగా (నిశ్శ్వాసఇవసీతయాః) ముఖపరిచయమున్నట్లుండుటచేత అదియునుచేయఁబోదు (నిశ్శ్వాసఇవసీతాయాః) మైథిలియొక్కనిశ్శ్వాసమువలెనుండుటవలన ఆమెతానువృక్షమూలములయందు

---

పాదములకు బాధకమేకాని సుఖకరముకాదు. ౨. కున్నాడు — పర్వతములతో

దాఁగియుండివచ్చుచున్నదేమోయను ప్రత్యాశచేతప్రాణముపోఁబోవుట యులేదు. (నిశ్వాసఇవసీతాయాః) శ్లో॥ 3 "ఆమోదముపజిఘ్రంతౌస్వ నిశ్వాసానువాదినం" అన్నట్లు, నిశ్వాసమునకు పరిమళమున్నదని చెప్పఁ బడియున్నదిగదా? (నిశ్వాసఇవసీతాయాః) స్పర్శకమయి సంకటపఱచు టయేకాక స్మారకమయ్యును సంకటపఱచుచున్నది. ఇటువంటిగాలితోఁ చుటమాత్రమో యనఁగా (వాతి) అరణ్యప్రదేశమంతయు తానేయై యుండునట్లు వ్యాపించిమెల్లమెల్లగసంచరించుచున్నది. (వాతి) ఎప్పటికైనను బాధకమనితీసికొనిపోవుటకులేక తానుసంపాదించిన గంధముతోడనే తోట్రుపడుచున్నది. ఇది గంధవాహముగదా? ఇట్లు బాధకముగఁదోఁచి మందమందసంచారము చేయునది యేదియనఁగా (వాయుః) సర్వ జ్జీవనమగు గాలిసుమీ యిట్లు బాధకమగుచున్నది. (వాయుః) శ్రు॥ ర "భీషాస్మాత్ వాతఃపవతే" అన్నట్లు, ఈతనికిభయపడుచుతిరిగెడివాయువు ఈతనినిభయపఱచుచుఁదిరుగుచున్నది. ఇట్లుభయపఱచువిధమెట్టిదియనఁ గా (మనోహరః) పైనుండెడిపదార్థముగాక లోపలనుండెడిపదార్థమును గూడ అపహరించుచున్నది. (మనోహరః) మిత్రమువలెనేయుండి యి ట్లుబాధచేయుచున్నది. ఇదిలోకమునందుత్రోవలుకాచి దొంగిలించెడి దొంగయొక్కసమాధిగాప్రవర్తించుచున్నది. "పద్మకేసరసంస్పృష్టః" అ నుటచే, తామరపలానివారని తెలిసికొనకుండుటకును చూచినయెడలభయ పఱచుటకును ఆదొంగలుధూళనము[మసిపూసికొనుట] చేసికొనివచ్చునట్లు న్నది. "వృక్షాంతరవినిస్సృతః" అనుటచేత ఆదొంగలుబాటసారులువచ్చు నంతవఱకు చెట్లమఱుఁగునదాఁగియుండి వారలుదగ్గఱకుదాఁగానే బయ లువెడలునట్లున్నది. (నిశ్వాసఇవసీతాయాః) మార్గస్థులు తమ్మువిడిచి

వఁగా, పౌష్పిల్ = ఉద్యానవనమును, సుఘ్రుగదేశ = ప్రవేశించితిని. 3. స్వ = తనయొక్క, నిశ్వాస = ఊరుపును, అనువాదినం = పోలియున్న, ఆమోదం = పరిమళమును, ఉపజింఘ్రంతౌ = ఆఘ్రాణించుచున్నవారలు. ర- అస్మాత్ = ఈపరమాత్మ వలన, భీషః = భయపడినవాఁడై, వాతః = వాయువు, పవతే = వీచుచున్నది.

పోకుండనమ్మికపుట్టించి మీయూరేది పేరెయ్యది చెప్పుడుఅనియడుగునట్లు ముఖపరిచయముచేఁ బ్రేమింపఁజేయుచున్నవిధమును గనఁబఱుచుచున్నది. వాతియనుటచే కార్యమునఁగూడఁగానే వారునిలిచినచోటనిలువక యతివేగముగపాఱిపోవురీతిగానున్నది. వాయుః అనుటచేత ఎవరైననుఅనుసరించి పట్టుకొనఁబోయి రేని ఒడలితోనొడలుతాకుచుండినను చేతికిపట్టియ్యకుండుట తెలుపఁబడుచున్నది. మనోహరః అనుటచే పైనుండెడిమాటములైలుగాక లోపలనుండెడిమనస్సునుగూడ నపహరించుట తెలుపఁబడుచున్నది.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణం ప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు
పద్మకేసర అను శ్లోకముయొక్క యుపన్యాసము సంపూర్ణము.

---



శ్రీరామచంద్రాయనమః.

శ్రీరాముఁడు వాలింజంపినయనంతరము మృతుండగు తనభర్తనుగౌఁగిలించుకొని భూమిపయింబడి యేడ్చుచున్నతారను మంత్రులులేవదీయఁగా తారయులేచి సమీపముననున్న శ్రీరామునింజూచి యీక్రిందిశ్లోకముచెప్పుచున్నది. ఇది కిష్కింధాకాండము ఇరువదినాలుగవసర్గములోనిది.

శ్లో॥ త్వమప్రమేయశ్చదురాసదశ్చజితేంద్రియశ్చోత్తమధార్మికశ్చ।
అక్షయ్యకీర్తిశ్చవిచక్షణశ్చక్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః॥౧౭॥

టీ॥ త్వం=నీవు, అప్రమేయశ్చ=ప్రమయనియెడి జ్ఞానమునకు విషయముకానివాఁడవు, దురాసదశ్చ=దగ్గరించుటకశక్యుఁడవు, జితేంద్రియశ్చ=ఇంద్రియములనుజయించినవాఁడవు, ఉత్తమధార్మికశ్చ=ఉత్తమధార్మికుఁడవు, అక్షయ్యకీర్తిశ్చ=తఱుగనియశస్సుగలవాఁడవు, విచక్షణశ్చ=సమర్థుఁడవు, క్షితిక్షమావాన్=భూమియోర్పునుబోలిన యోర్పుగలవాడవు, క్షతజోపమాక్షః = రక్తమువలె నెఱ్ఱనైన కన్నులుగలవాడవు. తాత్పర్యముస్పష్టము.

౧శ్లో॥ "తతశ్శరేణాభిహతో రామేణరణకర్కశః। పపాతసహసా వాలీనికృత్తఇవపాదపః" అన్నట్లు, శ్రీరామునిచేతి బాణమువలననభిహతుఁడై భూమిపయినివెలికలఁబడినవాలియతికుపితుఁడై॥శ్లో॥౨ "జానేపాపసమాచారంతృణైఃకూపమివావృతం। సతాంవేషధరంపాపంప్రచ్ఛన్నమివపావకం" అనిసమీపమునకువచ్చిన వారుపడుటకుగడ్డిచేఁగప్పఁబడిన నూతివలెనున్నావు. అత్యాసన్నులఁజంపుటకు నుసిగప్పిననిప్పుగానున్నావు. ఇట్లుప్రచ్ఛన్నపాపుఁడవగు నీవుపరమపావనమై జటావల్కలధారణముగల యీతాపసవేషమునేమిటికిధరియించితివి. అనియుపక్రమించి, శ్లో॥ ౩ "విషయేవాపురేవాతేయదానాపకరోమ్యహం" అని నీతో మాకు కోరుమేడిపాలివివాదములేదు. నేలపంపకపువివాదములేదు. ఎల్లతగవులు, ఇంటితగవులులేవు.మఱియేకారణముచేతనేమి కలిగినదీర్ఘవిరోధములేదు. కులక్రమాగతవిరోధములులేవు. దాయాదద్వేషముకుటుంబద్వేషములులేవు. అరికట్టిగోవులనపహరించుటగాని మందలుమళ్లించుటలుగాని చేసికొన్నవారముకాము. గ్రామకలహము, నీటికలహము, భూకలహము అనునివిమనకులేవు. శ్లో॥ ౪ "నచత్వాంప్రతిజానేహంకస్త్వంస్యాంహంత్స్యకిల్బిషం" అన్నట్లు, నేనునిన్నుపలానివాఁడనియెఱుఁగను. ఇట్లుండనిరపరాధులమగు మేముండుస్థలము తడఁబడుచువెదకుకొనివచ్చి నన్నుఁజంపనేల?

---

౧. తతః=అనంతరము, రణకర్కశః = యుద్ధమునందు గడిదేఱినవాఁడగు, వాలీ=వాలి, రామేణ=శ్రీరామునిచేత, శరేణ=ఒకబాణముచేత, అభిహతః=కొట్టఁబడినవాఁడై, నికృత్తః=నఱకఁబడిన, పాదపఇవ=వృక్షమువలెనే, భూమౌ=నేలయందు, సహసా=శీఘ్రముగ, పపాత=పడెను. ౨. పాపసమాచారం=పాపపునడవడిగలవాఁడును, సతాంవేషధరం=సత్పురుషులయొక్క వేషమునుధరించుకొన్నవాఁడును, (అగునిన్ను) తృణైః=గడ్డిపోఁచలచేత, ఆవృతం=కప్పుకొనఁబడిన, కూపమివ=నూతివలెను, ప్రచ్ఛన్నం = మఱుఁగుపడిన, పావకమివ=అగ్నివలెను, జానే=తెలిసికొంటిని. ౩. తే=నీయొక్క, విషయేవా=దేశమందైనను, పురేవా=పట్టణమునందైనను, యదా=ఎప్పుడును, అహం=నేను, నాపకరోమి=అపకారముచేసినవాఁడనుకాను. ౪. అహం=నేను, త్వాం=నిన్ను, నచప్రతిజానే=

౫ శ్లో॥ "మామిహాప్రతియుధ్యంతమన్యేనచసమాగతం । ధర్మలింగప్రతిచ్ఛన్న క్రూరంకర్మసమాచరేః" అన్నట్లు, నీతోఁబోరవచ్చినవాఁడనుగాను ఇతరునితోఁబోరుచున్నవాఁడను. ఇట్టినన్నుతటాలునఁదూఱిచంపి, అతిక్రూరకృత్యమొనరించినవాఁడవైతివి. శ్లో॥ ౬ "వయంవనచరారామమృగామూలఫలాశనాః । ఏషాప్రకృతిరస్మాకంపురుషస్త్వంనరేశ్వరః" అన్నట్లు మేముఅరణ్యవాసులము. మీరునగరవాసులు. మేముమృగములము మీరు మనుష్యులు. మేము వేళ్లుపండ్లుతినువారము మీరువరియన్నముతినువారు. మేముప్రకృతులము[మీయేలుబడికిలోఁబడినవారము]మీరురాజులు॥ శ్లో॥ ౭ "అధార్యంచర్మమేసద్భిఃరోమాణ్యస్థివివర్జితం। అభక్ష్యాణిచమాంసానిత్వద్విధైర్ధర్మచారిభిః" అని, నీవువేఁటాడవచ్చినవాఁడవయితివేని జింకతోలు పులితోలు వీనివలెమాతోలుయజ్వులకుధరింపఁదగినదికాదు. మాయొక్క రోమములును అస్థులునుచమరీచామరములవలెనుఏనుఁగుదంతములవలెనుపులిగోళ్లవలెను వినియోగించునవికావు. మామాంసము ముండ్లపంది, దుప్పి, ఉడుము, చెవులపిల్లి, తాఁబేలు వీనిమాంసమువలెభోజ్యముకాదు. నిషిద్ధము॥ శ్లో॥ ౮ "రాజహాబ్రహ్మహాగోఘ్నఃచోరఃప్రాణివధేరతః । నాస్తికఃపరి

---

ఎఱుంగను. అకిల్బిషం=పాపములేనట్టి, మాం=నన్ను, కస్మాత్=ఏకారణముచేత, హంత్సి=చంపెదవు. ౫- అప్రతియుద్ధ్యంతం=నీతోఁప్రతియుద్ధముసేయనివాఁడును, అన్యేనచ=ఇతరునితో, సమాగతం=యుద్ధముచేయుటకువచ్చినవాఁడునగు, మాం-నన్నుగుఱించి, ధర్మలింగప్రతిచ్ఛన్న=పావనమయినతాపసవేషముచేమఱుఁగైనవాఁడా. క్రూరంకర్మ-క్రూరకృత్యమును, సమాచరేః-ఒనరించితివి. ౬- రామ=ఓరాముఁడా, వయం=మేము, వనచరాః=అడవియందుఁదిరుగునట్టి వానరులము, మూలఫలాశనాః=కందమూలఫలములుతినెడువారము, అస్మాకం=మాకు, ఏషా=ఇది, ప్రకృతిః=స్వభావము, త్వం=నీవు, పురుషఃమనుష్యుఁడవు, నరేశ్వరః=రాజవు. ౭- మే=నాయొక్క, చర్మ=తోలు, సద్భిః=సత్పురుషులచేత, అధార్యం=ధరింపఁబడదు, రోమాణి=రోమములు, (అధార్యాణి=ధరింపఁబడవు) అస్థి=ఎముక, వివర్జితం=విడువఁబడినది, మాంసానిచ=మాంసములును, త్వద్విధైః=నీవంటి, ధర్మచారిభిః=ధర్మప్రవర్తకులచేత, అభక్ష్యాణి=తినఁదగినవి. ౮- రాజహా=రాజునుచంపువాఁడును, గోఘ్నః=ఆవునుజంపెడివాఁడును, చోరః=దొంగయు, ప్రాణివధే=

వేత్తాచసర్వేనిరయగామినః" అనుచేతిని, రాజవధాదులనాచరించువారల కును నరకమేగతియన్నట్లు ప్రాణివధయందాసక్తుఁడైననీకును దుర్గతియే. అనియిట్లు పెక్కులు పరుషములుపలికి యాతనిచే॥శ్లో॥ ౯ "అధిక్షిప్తస్త థారామఃపశ్చాద్వాలినమబ్రవీత్ । ధర్మమర్థంచకామంచసమయంచాపి లౌకికం । అవిజ్ఞాయకథంబాల్యాత్ మామిహాద్యవిగర్హసే" అన్నట్లు, తెలియక యధిక్షేపింపఁబడినశ్రీరాముఁడు ఓవానరుఁడానీవొకవివేకివా.నీవు వైదికపురుషార్థములనెఱిఁగినవాఁడవుగావు. లౌకికములగు వ్యవహారము లనుగుర్తెఱిఁగినవాఁడవునుగావు. నీబుద్ధిరాహిత్యముచేత న్యాయానుష్ఠానపరుఁడమగుమమ్ము దూషించుచున్నావు. నీతో మాకుకోరువివాదములేదంటివి. శ్లో॥ "ఇక్ష్వాకూణామియంభూమిస్సశైలవనకాననా" అనికొండలుగుహలు చిన్నయడవులు కారడవులు మొదలగువానితో గూడియుండెడి యీభూమియంతయుమాదేకదా? శ్లో॥ ౧౦ "భూమిః క్షేత్రంకళత్రంచ" అని మాకాణాచియైనయిదియసుమీ? పొలిమేరతగవులుఇంటివివాదము లులేవంటివి. శ్లో॥౧౧ "త్వంవయస్యశ్చహృద్యశ్చమేహ్యేకందుఃఖంసుఖంచనౌ" అని సమానసుఖదుఃఖులగునట్లు మహారాజగు సుగ్రీవునితోసఖ్యము

---

జీవహింసయందు, రతః=ఆసక్తిగలవాఁడును, నాస్తికః=దేవుఁడులేఁడనిచెప్పెడువాఁడును, పరివేత్తాచ=అన్నకుఁబెండ్లికాకముందుపెండ్లిచేసికొనువాఁడును, సర్వే=వీరలందఱు, నిరయగామినః=నరకమునుపొందువారు. ౯- తథా=అట్లు, అధిక్షిప్తః=ఆక్షేపింపఁబడిన, రామః=శ్రీరాముఁడు, పశ్చాత్=తర్వాత, (తన్నధిక్షేపించిన యనంతరము) వాలినం=వాలినిగుఱించి, అబ్రవీత్=పలికెను. ధర్మం=ధర్మమును, అర్థంచ=ధనమును, కామంచ=కోరినదానిననుభవించుటయు, లౌకికంసమయంచాపి = లోకసంబంధమయిన మతసంకేతమును, అవిజ్ఞాయ=ఎఱుఁగక, బాల్యాత్=పసితనమువలన— తెలివిలేనితనమువలన, అద్య=ఇప్పుడు, మాం=నన్ను, కథంవిగర్హసే=ఎట్లుదూషించెదవు. ౧౦- భూమిః=దేశమును, క్షేత్రం=నేలయు, కళత్రంచ=భార్యయు. ౧౧- త్వం=నీవు=వయస్యశ్చ=స్నేహితుఁడవు, హృద్యః=ప్రేమకు విషయభూతుఁడవు, నౌ=మనకు, దుఃఖంసుఖంచ=దుఃఖమునుసుఖమును, ఏకం=ఒక్కటి, అనఁగా నీకుసుఖముకలిగిన నాకును సుఖముకలుగు నీకు దుఃఖము

చేసితిమి. అట్లగుటచే॥ శ్లో॥ ౧౨ "తేనాహంప్రతిషిద్ధశ్చ హృతరాజ్య శ్చ" అన్నట్లు పొలిమేరవివాదముమాత్రమేగాక ప్రత్యక్షముగ రాజ్యము నపహరించియు పరికరమయిన నలుగురినిదప్పించితక్కినవారిఁ జేర్చుకొని పట్టించెదవు.కులక్రమాగతవిరోధముదీర్ఘవిరోధము లేదంటివి.శ్లో॥౧౩ "య థావచ్చాభ్యవాదయం""ఉక్తాశ్చనాశిషస్తేన"అన్నట్లతఁడుకాళ్లపైఁబడి నను అంగీకరింపక॥ శ్లో॥ ౧౪ "వస్త్రేణైకేనవానరః తదావిద్రావయా మాసవాలీ"అన్నట్లు, ఒంటికట్టుబట్టతో నేతరుమగొట్టలేదా?జ్ఞాతి, కులవి రోధములు లేవంటివి॥ శ్లో॥౧౫ "అయంభ్రాతాసుదారుణః"అనినీవే చెప్పితి వి. అట్టితమ్మునితో విరోధింపలేదా? గోవులనపహరించుటయరికట్టుట, గ్రామవివాదము,జలవివాదము లేవంటివి. వాఁడుకృషిగోరక్షణవాణిజ్యము లమూలమున ధనసంపాదనము చేసెడి గోరక్షణాదివైశ్యవిధ్యముచేతజీవిం చునట్టియునికిపట్టులగు నడవులుకొలఁకులును నీవునాచుకొనియుండలేదా. స్త్రీవివాదముభూవివాదము లేదంటివి. శ్లో॥ ౧౬ "భ్రాతుర్వర్తసిభార్యా యాం" అన్నట్లు, అనుజభార్యాపహారమును కిష్కింధాపహారమునుచేసి యుండలేదా? నేమనిన్నిట్టివాఁడసి యెఱుఁగను అట్లుండనిరపరాధినగునన్ను నేనుండుచోటికి వెదకుకొనివచ్చి యేమిటికిజంపితివంటివి. శ్లో॥ ౧౭ "తాం పాలయతిధర్మాత్మాభరతస్సత్యవాగృజుః । తస్యధర్మకృదాదేశాద్వయ

కలిగిన నాకును దుఃఖమేకలుగును. ౧౨- తేన=ఆవాలిచేత, అహం=నేను, ప్రతి షిద్ధశ్చ=తొలఁగింపఁబడితిని, హృతరాజ్యశ్చ=అపహరింపఁబడిన రాజ్యముగలవాఁ డునుఅయితిని. ౧౩- యథావచ్చ=ఎప్పటివలె, అభ్యవాదయం=నమస్కరించితి ని, తేన=ఆవాలిచేత, ఆశిషః=ఆశీర్వాదములు, నోక్తాశ్చ = చెప్పఁబడినవికావు. నేను నమస్కరించినప్పుడతఁడుదీవించి మన్నింపక కోపముతో పట్టణమునుండి వెడ లఁగొట్టెనుఅనుట. ౧౪. వానరః=కోతి, ఏకేనవస్త్రేణ=ఒంటిదయిన కట్టుబట్ట తో, తదా=అప్పుడు, విద్రావయామాస=తరుమగొట్టెను. ౧౫. అయం = ఈ, భ్రాతా=తోడఁబుట్టువు, సుదారుణః=మిక్కిలిక్రూరుఁడు. ౧౬- భ్రాతుః=తోడ బుట్టినవానియొక్క, భార్యాయాం=పత్నియందు,వర్తసి=వర్తించుచున్నావు. ౧౭. ధర్మాత్మా=ధర్మస్వరూపుఁడును, సత్యవాక్=నిజముపలుకువాడును, ఋజుః=కౌటి ల్యములేనివాఁడునుఅగు, భరతః=భరతుఁడు, తాం=ఆభూమిని, పాలయతి=పా

మన్యేచపార్థివాః । చరామోవసుధాంకృత్స్నాం" అనియు "త్వాంచ ధర్మాదతిక్రాంతంకథంశక్యముపేక్షితుం" అనియు చెప్పఁబడినచొప్పున మేము రాజైనభరతుని యొక్క ధర్మనిర్దేశమును జేయువారమై దుష్టనిగ్రహము సేయుచు సంచరించెడువారము. నీవపరాధము సేయఁగానే నీవున్నచోటు వెదకుకొనివచ్చి నిన్నుదండించితిమి. నేను నీతోపోరాడవచ్చినవాఁడను గాను ఇతరునితోఁ బోరాడుచుంటిని. ఇట్టి నన్నుఁజంపవచ్చునాయంటివి॥ శ్లో॥ ౧౮ "వధ్యంతివిముఖాంశ్చాపినచదోషోఽత్రవిద్యతే । అయుధ్యన్ప్రతియుధ్యన్వాయస్మాచ్ఛాఖామృగోహ్యసి" నాతో యుద్ధము సేయకున్నను విముఖుఁడవై పరుగెత్తినను నిన్నుఁజంపగా నాకుదోషములేదు. నీవాకకోఁతివే గదా? రాజులుమాటలాడినట్లుమాటలాడెదవు. మేముఆరణ్యకులము. మీరునాగరులు. మేముమృగములము.మీరుమనుష్యులరు. మేముఫలమూలాశనులము. మీరుశాల్యన్నభోక్తలరు. మేముకాఁపులము. మీరు రాజులు. అని యప్రయోజకములయిన కొన్నిమాటలుచెప్పితివి. శ్లో॥ ౧౯ "భరతఃకామవృత్తానాంనిగ్రహేపర్యవస్థితః"అని, "మృగపక్షిమనుష్యాణాంనిగ్రహప్రగ్రహావపి" అనినట్లు ఎక్కడతిరిగెడువారయినను ఏజాతివారయినను ఏది తినువారలయినను ఇట్టిభవ్యులయినను దుష్టులనిగ్రహించుట రాజులకుధర్మమునుమా? మాయొక్కలోమాస్థిమాంసములునిషిద్ధములు. ఇట్లుండని

---

లించుచున్నాఁడు. తస్య=ఆతనియొక్క, ధర్మకృతాదేశాత్=ధర్మ్యమగునాజ్ఞచేత, వయం=మేమును, అన్యేపార్థివాశ్చ=ఇతరరాజులును, కృత్స్నాం=సమస్తమగు, వసుధాం=భూమియందు,చరామః=సంచరించుచున్నారము. ధర్మాత్=న్యాయమునుండి, అతిక్రాంతం=దాఁటినట్టి, త్వాంచ=నిన్ను, ఉపేక్షితుం=ఉపేక్షించుటకు, కథంశక్యం=ఎట్లుసాధ్యమగును. ౧౮- యస్మాత్=ఏకారణముచేత, శాఖామృగఅసి=కోతివైతివో, (ఆకారణముచేత) అయుధ్యన్=యుద్ధముచేయనివాఁడవైనను,ప్రతియుధ్యన్వా=ఇతరునెదిరించి యుద్ధముసేయువాఁడవైనను, (నిన్నుచంపవలసినదే.)విముఖాంశ్చాపి=విముఖములయినను, వధ్యంతి=(మృగములను) చంపుచున్నారు, అత్ర=ఈమృగవధమునందు, దోషః=పాపము, నచవిద్యతే=కనఁబడలేదు. ౧౯- భరతః=భరతుఁడు, కామవృత్తానాం = స్వేచ్ఛావృత్తులగు వారలకు,

ష్ప్రయోజనవ్యాపాదనము చేసితివంటివి॥ శ్లో॥ ౨౦ "వాగురాభిశ్చపాశై శ్చకూటైశ్చవివిధైర్నరాః। ప్రతిచ్ఛన్నాశ్చదృశ్యాశ్చనిఘ్నంతిస్మబహూన్ మృగాన్" అని రాజులు రోమాస్థిమాంసాదులవలని ప్రయోజనము నపేక్షింపక మృగములవలన దేశమునకు చేటుకలుగునెడల జనపదహితార్థము వేటాడియు వలలుపన్నియు ఉరులొడ్డియు బోనులుపెట్టియు బహువిధములచేత వంచించియు డాఁగియుండియుఁ గనఁబడియు అనేకమృగములనుజంపుచున్నారు. రాజవధము సేయువారికి నరకమేగతియనియంటివి. శ్లో॥ ౨౧ "ఔరసీంభగినీంవాపిభార్యాంవాప్యనుజస్యయః। ప్రచరేద్నరఃకామాత్ తస్యదండోవధస్స్మృతః" రాజవధము చేసినంగదా తప్పు. నీవాకకోతివి. అనుజభార్యాపహారము చేసితివిగాన దండ్యుఁడవు. శ్లో॥ ౨౨ "రాజాత్వశాసనాత్పాపంతదవాప్నోతికిల్బిషం" అని నిన్నుదండింపక విడిచితినేని నాకు పాపము సంభవించును. అనియు చక్కగా నుత్తరములు చెప్పఁగా వాలియు॥ శ్లో॥ ౨౩ "ప్రత్యువాచతతోవాక్యంప్రాంజలిర్వానరేశ్వరః। యత్త్వమాత్థనరశ్రేష్ఠతదేతన్నాత్రసంశయః" అనుచు నమ్మితించి శాంతుఁడైయుండఁగా ఇట్లు భుజయుద్ధము చేతను వాగ్యుద్ధము చేతను వాలినిజయించి జయలక్ష్మీ సమాలింగితుఁడై శ్రీరాముఁడు నిలుచుండ భర్తృవధజనిత

---

నిగ్రహప్రగ్రహౌనపి = నిగ్రహానుగ్రహములు (చేయుచుండును.) ౨౦. నరాః = మనుష్యులు, ప్రతిచ్ఛన్నాశ్చ = డాఁగియుండియు, దృశ్యాశ్చ = ఎదుటనుండియు, వాగురాభిశ్చ = వలలచేతను, పాశైశ్చ = త్రాళ్లచేతను, వివిధైః = నానావిధములగు, కూటైశ్చ = బోనులచేతను, బహూన్ = పెక్కులగు, మృగాన్ = మెకములను, నిఘ్నంతిస్మ = చంపుచున్నారు. ౨౧. యఃనరః = ఏమనుష్యుఁడు, కామాత్ = కామమువలన, ఔరసీం = తనకొమార్తనుగాని, భగినీంవాపి = తోడఁబుట్టినదానిగాని, అనుజస్య = తమ్మునియొక్క, భార్యాంవాపి = పెండ్లామునుగాని, ప్రచరేత్ = సంగమించుచున్నాఁడో, తస్య = వానికి, దండః = శిక్ష, వధః = చంపుట, (అని) స్మృతః = స్మృతియందుఁ జెప్పఁబడియున్నది. ౨౨. రాజాతు = రాజును, అశాసనాత్ = దండింపమిచే, పాపంయత్ = ఏపాపముగలుగునో, తత్కిల్బిషం = ఆపాపమును, అవాప్నోతి = పొందుచున్నాఁడు. ౨౩. వానరేశ్వరః = వాలి, ప్రాంజలిః = చేతులు మొగిడ్చినవాఁడై, తతః-

ములగు శోకక్రోధములచేవిక్కృతయయి ధీరుఁడయినరాముగనిఁజంపినవా నిని నోటికివచ్చినట్లుతిట్టుదునని తిట్టుటకుసన్నద్ధురాలైవచ్చినతార॥ శ్లో॥ ౨౮ "సాతంసమాసాద్యవిశుద్ధసత్త్వా" అన్నట్లు, శ్రీరామునిఁగాంచితత్స న్నిధిమాహాత్మ్యమువలన సత్త్వముతలయెత్తి॥ శ్లో॥ ౨౫ "సత్త్వాత్సంజా యతేజ్ఞానం" అన్నట్లు, సత్త్వకార్యమగుజ్ఞానముకలిగి కలఁకదేరిచింతను మాని తనకుసాక్షాత్కరించినయావస్తువును ఒకరీతిగనిర్ణయించి తిట్టఁ బూనుకొనియున్ననోటనేస్తుతియించుచున్నది॥ శ్లో॥ ౨౬ "భిద్యతేహృదయ గ్రంధిశ్ఛిద్యంతేసర్వసంశయాః। క్షీయంతేచాస్యకర్మాణితస్మిన్దృష్టేపరా వరే" అన్నట్లు, భగవత్సాక్షాత్కారముకల్గినేని ప్రతిబంధకములుపోయి తత్త్వానుభవముచేయుటకుఁ గొఱఁతలేదుసుమా॥ శ్రీవాల్మీకిభగవానులు ఇతరఋషులును వేదములునువలె॥ శ్లో॥ ౨౭ "ఆలోడ్యసర్వశాస్త్రాణివిచా ర్యచపునఃపునః। ఇదమేకంసునిష్పన్నంధ్యేయోనారాయణస్సదా" అని యు॥ శ్లో॥ "వేదశాస్త్రాత్పరంనాస్తి నదైవంకేశవాత్పరం" అని యు, "నాస్తినారాయణసమోనభూతోనభవిష్యతి" అనియు, "సత్య

---

అనంతరము, వాక్యం= (ఒక) మాటను, ప్రత్యువాచ=బదులుచెప్పెను. నరశ్రేష్ఠ= ఓరామా, త్వం=నీవు, యత్=ఏది, ఆత్థ=చెప్పితివో, తదేతత్=అయ్యది, (వాస్త వము.) అత్ర=ఇందు, సంశయః=సందేహము, న=లేదు. ౨౮. సా=ఆతార, తం= ఆరాముని, సమాసాద్య=సమీపించి, విశుద్ధసత్త్వా=పరిశుద్ధమగు నభిప్రాయముగ లదై. ౨౫. సత్త్వాత్=సాత్త్వికగుణముచేత, జ్ఞానం=జ్ఞానము, సంజాయతే=కలుగు చున్నది. ౨౬. పరావరే=పరాత్పరుఁడగు, తస్మిన్ = ఆపరమాత్మ, దృష్టేసతి= చూడఁబడఁగా, హృదయగ్రంథిః=హృదయముననుండెడియహంకారపసెడిముడి, భిద్యతే=భేధింపఁబడుచున్నది, సర్వసంశయాః=ఎల్లసంశయములును, ఛిద్యంతే =చేధింపఁబడుచున్నవి, అస్య=వీనియొక్క, కర్మాణి=కర్మములును, క్షీయంతేచ =క్షయించుచునున్నవి. ౨౭. సర్వ=శాస్త్రాణి=ఎల్లశాస్త్రములను, ఆలోడ్య=పరి శోధించియు, పునఃపునః=మాటిమాటికి, విచార్యచ=ఆలోచించియు, సదా=ఎల్ల ప్పుడు, నారాయణః=విష్ణుదేవుఁడు, ధ్యేయః=ధ్యానముచేయఁదగినవాఁడు, ఇద మేకం - అనునిదియొక్కటే, సునిష్పన్నం= తేటగాఁదెలియఁబడెను. వేదశా స్త్రాత్ - వేదరూపమగుశాస్త్రముకంటె, పరం - శ్రేష్ఠమగునది, న-లేదు, కేశవా

త్సమో స్త్యభ్యధికః కుతోऽన్యః" అనియు, "అగ్నిర్వై దేవానామవమో విష్ణుః పరమః" అనియు. "నతత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే" అనియు, "యస్మాత్పరంనాపరమస్తికించిత్" అనియు, "నతస్యేశేకశ్చన" అనియు, బహువిధములచేత తాము తాము భగవత్పరత్వోపపాదనము సేయనుపక్రమించి॥ శ్రు॥ ఆ "నమోహిరణ్యగర్భాయహరయేశంకరాయచ" అనియు, "రుద్రాణాంశంకరశ్చాస్మి" అనియు, "సబ్రహ్మాసశివస్సేంద్రః" అనియు, చెప్పఁబడియుండువచనాంతరములచేత సామ్యశంక సేయునట్లును, శ్రీ "విశ్వాధికంరుద్రంబ్రహ్మాకారణకారణం" అనియు, "విశ్వాధికో రుద్రోమహర్షిః" అనియు "నకరీంద్ర స్త్వదుత్తరోऽనజ్యాయాన స్తివృత్రహన్" "ఆకాశఏభ్యోజ్యాయాన్" ఆకాశః పరాయణం "శివఏవధ్యేయఃశివంకరః" అనియునిత్యాదులచేత దేవతాంతరములకాధిక్యశంక సేయునట్లును ఇందుకుఁబూర్వాపరములును ధర్మిగ్రాహకప్రమాణమును గాని సామానాధికరణ్యావాక్యములకు అంతర్యామి పర్యంతానుసంధాన

---

త్పరం - విష్ణువునకంటె పరమైనదైవమును, న - లేదు. నారాయణ సమః = నారాయణునితో సమానుఁడు, నాస్తి = లేఁడు, భూతః = ఇంతకుముందు, కలిగినవాఁడును, న = కాఁడు, భవిష్యతి = ఇఁకఁగలుఁగఁబోవువాఁడును, న = కాఁడు. త్వత్సమః = నీతోసమానుఁడు, నాస్తి = లేఁడు, అభ్యధికః = నీకంటెనధికుఁడు, అన్యః = ఇతరుఁడు, కుతః = ఎక్కడనున్నాఁడు. దేవానాం = దేవతలలోపల, అవమః = తక్కువైనవాఁడు, అగ్నిర్వై = అగ్నియే, పరమః = సర్వోత్కృష్టుఁడు, విష్ణుః - విష్ణువు. తత్సమశ్చ = ఆవిష్ణునికిసమానుఁడును, అభ్యధికశ్చ = వానికంటెనెక్కువయినవాఁడును, నదృశ్యతే = కనఁబడఁడు. యస్మాత్ = ఎవనికంటె, పరం = శ్రేష్ఠమగు, అపరం = ఇతరమయినవస్తువు, కించిత్ = ఒక్కటియును, నాస్తి = లేదో. తస్య = వానికి, కశ్చ = ఒక్కరుఁడును, నేశే = ఈశ్వరుఁడుకాడు. ఆ. హిరణ్యగర్భాయ = బ్రహ్మకు, హరయే = పాపహరుఁడగు, శంకరాయచ = శంకరునికిని, నమః = నమస్కారము. రుద్రాణాం = ఏకాదశరుద్రులలోపల, శంకరశ్చ = శంకరుఁడనుగా, అస్మి = అగుచున్నాను. సబ్రహ్మ = ఆతఁడే బ్రహ్మ, సశివః = ఆతఁడేశివుఁడు, సేంద్రః = ఆతఁడేయింద్రుఁడు, ఇట్టివాఁడుపరమాత్మ. శ్రీ. విశ్వాధికం = ఎల్లవానికంటెనధికుఁడును, బ్రహ్మ = బ్రహ్మస్వరూపుఁడును, కారణకారణం - కారణములకునుకా

ముచేయవలసినదగుటచేత ఆయాదేవతలనుచెప్పెడిప్రదేశములు॥ శ్లో॥౩౦ "క్రయ్యేయంగౌఃబహుక్షీరాసాధ్వీచ" అనియమ్మఁదగినపశువునతిశయముగ స్తుతియించునట్లు తత్త్వపరములుకావనియు, ప్రశంసాపరములనియు, ఆకాశప్రాణ వామదేవేంద్రప్రహ్లాదాదులకుపరత్వమెట్లైనేని రుద్రాదులకు పరత్వముసంభవించునని మొదటితుల్యన్యాయముచేత నుపపాదింపవలయునట్లు క్లేశబహుళముగనుండక ఆస్త్రీబాలముగప్రసిద్ధవైభవుఁడు విష్ణువని యెఱింగించుటకుగా తారాంగదాదులంగొని తత్త్వనిర్ణయముసేయుచున్నాఁడు. ఇందులకు॥ శ్లో॥ ౩౧ "సుసంవృతంపార్థివలక్షణైశ్చ తంచారునేత్రంమృగశాబనేత్రా । అదృష్టపూర్వంపురుషంప్రధానం అయంసకాకుత్స్థఇతిప్రజజ్ఞే" అన్నట్లు, ఇంతకుముందుచూడకయుండినదైనను శరీరమునందుస్వయంవరముచేసియున్నరాజలక్షణములచేతను "రామఃకమలపత్రాక్షః" అన్నట్లు. సాధారణమగుకన్నులయందముచేతను నాయొక్కభర్తనుజంపిన శ్రీరాముఁడీతఁడనియెఱింగెనని సౌలభ్యమునందు ఒకయోజనయు॥ శ్లో॥ "సుసంవృతంపార్థివలక్షణైశ్చ" అన్నట్లు, సౌలభ్యచిహ్నములచేతమఱగియుండినను చకారసూచితములగుపరత్వచిహ్నములచేతను, యథాకప్యాసంపుండరీకమేవమక్షిణీయని పరత్వసూచకము

---

రణమయినవాఁడును అగు, రుద్రం=రుద్రుని. విశ్వాధికః = విశ్వాతిశాయియగు, రుద్రః=రుద్రుఁడు, మహర్షిః = దొడ్డఋషి—ఇంద్రియనిగ్రహముగలవాఁడు. వృత్రహా-వృత్రాసురునిఁజంపినవాఁడా? కరీంద్రః=ఇంద్రుఁడు, త్వదుత్తరః=నీకంటెనధికుఁడును, జ్యాయాన్=పెద్దవాఁడును, న=లేఁడు. ఏభ్యః=వీనికంటె, ఆకాశః=ఆకసము, జ్యాయాన్=ముందుపుట్టినది, ఆకాశః=ఆకసము, పరాయణం=ముఖ్యగతి. శివఏవ=శివుఁడే, ధ్యేయః=ధ్యానముచేయఁదగినవాఁడు, శివంకరః=మంగళకరుఁడు. ౩౦. ఇయంగౌః = ఈయావు, క్రయ్యా = విక్రయింపఁదగినది, బహుక్షీరా = మిక్కిలిపాలుగలది, సాధ్వీచ - సాధువైనది. ౩౧. మృగశాబనేత్రా-జింకపిల్లకన్నులవంటి కన్నులుగలతార, పార్థివలక్షణైః = రాజచిహ్నములచేత, సుసంవృతం=చక్కఁగఆవరింపఁబడినవాఁడును, చారునేత్రం=మనోహరములైన కన్నులుగలవాఁడును, అదృష్టపూర్వం=ఇంతకుముందు చూడఁబడనివాఁడును, ప్రధానంపురుషం=పురుషశ్రేష్ఠుఁడునగు, తం=ఆరాముని, అయం=ఈతఁడు,

లగుకష్టలచేతను॥ ద్ర॥ ౩౨ "కండవాత్తాత్తనదేయులకెననిన్రాణ్" అని యు, ఉట్టిపడుచుండెడి పురుషకారప్రాధాన్యముచేతను॥ శ్లో॥ "అయంస కాకుత్థ్స ఇతిప్రజజ్ఞే" అనియు॥ ద్ర॥ ౩౩ ఆయర్‌పు త్తిరనల్లనరుందైవం" అనియు, ఈచక్రవర్తికుమారుఁడు ఆపరవస్తువేయగునని యెఱింగెనని పర త్వమునందొక యోజనయుకలవు. ఈరెంటిని జేర్చి యోజించునపుడు (త్వాం) ఈపెతనయొక్క భర్తృ భక్తిప్రాబల్యముచే రాజులనుగూడత్వాంకరించు చున్నది. (త్వాం) మీఁదట అప్రమేయశ్చ యనియుపక్రమించినమూర్తియుంచఁ బడుగుణభారమునకు అధిష్ఠానమగునట్లు ఆశ్రయమును నిర్ధారణచేయు చున్నది॥ శ్లో॥ "గుణానామాకరోమహాన్" అన్నట్లు అనవధికాతిశయా సంఖ్యేయకల్యాణగుణగణములు నొకచుళకాంతర్గతములగునట్లు వెలింగెడి స్వరూపము యొక్క ఘనతయేమనిచెప్పవచ్చును. (త్వాం) రావణదుందుభి ప్రభృతులను అవలీలగాజయించియుఁజంపియు విఱ్ఱవీఁగుచున్నవాలినిజంపి యీజయశ్రీ చేకొనియు నొక్కటియు చేయనివానివలెనిలుచున్న సంస్థాన మును దెల్పుచున్నది. (త్వాం) వాలికిభయపడి ఉన్నచోటు దెలియక దాఁగి యున్న సుగ్రీవునికినిజ గుమునొసఁగి శరణాగతవాత్సల్యము వెలింగింపఁజే సిననీవు. (త్వాం) స్త్రీలుబాలురునగుమేముగూడ జంకకవచ్చిడగ్గఱింపఁదగు నీవు. (త్వాం) వస్తువునువస్త్వంతరముగఁజేయురీతినోటికివచ్చినట్లుతిట్టవల యుననివచ్చిననన్ను స్తుతించునట్లుచేసిననీవు. నీవుస్తుతియింపనుపక్రమించితి వేని పానిందొడఁగఁగూడదాయనఁగా? (అప్రమేయః) నిన్నును నన్నును ఎఱుఁగక అలవరించుకొనవచ్చుననుకొంటిని. అది యలవరించుకొనఁదగి నదికాకపోయెను. (అప్రమేయః) నేనేకాదు. వేదాహమనియుపక్రమిం చిన వేదములుమహాంతంఅనియు, కఇత్థా వేదఅనియుమరలునట్లుగద నీయొ క్కయపరిచ్ఛేద్యత్వమున్నయది. (అప్రమేయః) ప్రమకువిషయముప్రమే

---

సకాకుత్థ్సః = ఆకకుత్థ్సకులమునఁబుట్టిన రాముఁడని, ప్రజజ్ఞే = తెలిసికొనెను. ౩౨. కండవాత్తాల్ = చూడఁగానే, ఉలకు = లోకము, తనదేయన = తనచేయుని, నిన్రాణ్ = నిలిచెను. ౩౩. ఆయర్‌పుత్తిరనల్లన్ = గోపకుమారుఁడుకాఁడా, అరుందైవం-

యము. ప్రమయనఁగా సమ్యగనుభవము. అనఁగా ప్రత్యక్షానుమానాగమ జన్యజ్ఞానము ప్రమయగుననుట. అట్టి త్రివిధజ్ఞానమునకును విషయముగాని వాఁడవు. శ్రు॥ ౩౪ "నసందృశే తిష్ఠతిరూపమస్యనచక్షుషాపశ్యతికశ్చనైనం" అనియు, ద్ర॥ "కడిఁ-లి" అనియు చెప్పఁబడినట్లు ప్రత్యక్షజ్ఞానవిషయము కానివాఁడవైతివి. దృష్టానుమానమునందు వ్యాప్తిగ్రహణమునకు ప్రత్యక్షయోగ్యము కామిచేతను, శ్రు॥ "నతత్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే" అనియు, ద్ర॥ "ఒత్తారైమికారైయిలైయాయమామాయ" అనియు చెప్పఁబడునట్లు, దృష్టాంతము లేకుండుటచేతను, సామాన్యముగా దృష్టానుమానమునందు వ్యాప్తిగ్రహణదశ లేదు. సర్వకర్తృనుగతముగ కర్మవశ్యత్వదుఃఖిత్వాఽయాసిత్వాఽప్రయోజకత్వఖిన్నత్వాదులయిన అపురుషార్థములు వ్యాప్తిబలమువలనఁగలుగుటచేతను, పక్షధర్మతాబలమునకు నిత్యనిర్దోషధర్మిగ్రాహకశ్రుతిబలముచేత త్రివిధకారణమై సకలేతరవిలక్షణమగునది అన్యథాగా సిద్ధించుటచేతను అనుమానజ్ఞానమునకు విషయము కానివాఁడవు. శ్రు॥ "యతోవాచోనివర్తంతేఅప్రాప్యమనసాసహ" అనియు, "నేతినేతి" అనియు, ౩౫ "యతోనవేదమనసాసహైనమనుప్రవిశంతితద్దైవమానం" అని వేదములును పరిచ్ఛేదింపలేనివగుటచేత ఆగమజన్యజ్ఞానమునకును విషయము కానివాఁడవు. (అప్రమేయః) ప్రమాణములకు విషయము కావనియెడు విషయము చెప్పవలయునా? "సోంగవేదయదివానవేద" అనియు, ద్ర॥ "తనకుఁ-ందందన్నైమ్మయరివరియానై" అనియు చెప్పఁబడినట్లు, స్వతస్సర్వజ్ఞుఁడవైన నీకుఁగూడ పరిచ్ఛేదించుటకు విషయము కావు. (అప్రమేయశ్చ) నిత్యత్వాత్ కాలపరిచ్ఛేదము లేదు. విభుత్వాత్ దేశపరిచ్ఛేదము లేదు, ప్రకార్యంతరాభావాత్ వస్తుపరిచ్ఛేదము లేదు. ఇట్లు త్రిప్రకారములచేతను త్రివిధచేతనులకు త్రికాలములయందును పరిచ్ఛేదిం

---

—దుర్లభుఁడయిన దేవుఁడు. ౩౪. అస్య=ఈ పరమాత్మయొక్క, రూపం=స్వరూపము, సందృశే = చూపునందు, నతిష్ఠతి = ఉండదు, కశ్చన = ఒక్కరుఁడును, ఏనం=వీనిని, చక్షుషా=కంటిచేత, నపశ్యతి=చూడఁడు. ౩౫. యతః-ఏకారణ

పఁగూడనివాఁడవుగదా? (త్వమప్రమేయః)అయంఅనిచెప్పఁదగినట్లు సన్నిహితదేశవర్తమానకాలసంబంధిగానున్నను సఃఅనునట్లు విప్రకృష్టదేశకాలాంతరవర్తులవలె కొలఁదిమెఱుఁగుటకువీలుపడవు. (త్వమప్రమేయః) కన్నులచేఁజూడఁగాసులభుఁడైయున్నావుగాని హృదయముచేఁజూడఁగా అగమ్యుఁడవైతివి. "నచక్షుషాగృహ్యతేమనసాతువిశుద్ధేన" అనుప్రమాణము అసత్యమయ్యెనే. (త్వమప్రమేయః) శ్లో॥ ౩౬ "అవష్టభ్యచతిష్ఠంతం దదర్శధనురూర్జితం" అని, చాపహస్తుఁడవై యతిసులభుఁడవుగా నిలువఁబడియుండునీవు "తమసఃపరమోధాతాశంఖచక్రగదాధరః" అన్నట్లు, హస్తమునందు శంఖచక్రములనుధరియించుకొనియున్న పరవస్తువైయున్నాఁడవు. (త్వమప్రమేయః) పరత్వముకనుంగొనుటకశక్యమనియుంటిమి. సౌలభ్యముగూడఅందుకొననశక్యమే. (త్వమప్రమేయః) ఒకపరికరమునులేక ఒంటరివలెనున్ననీవు. శ్లో॥ ౩౭ "అనుభావవిశేషాత్తుసేనాపరిగతావివ" అన్నట్లు అపరిమితపరికరములుగలవానివలె ఏకదేశవిషయముచేయఁగూడనియట్లున్నవాఁడవు. (త్వమప్రమేయః) పితృనియోగముచేత తాపసుఁడవై వనవాసముచేయంబూనితివి. విరాధఖరకబంధవాలిప్రభృతులనుజంపుచుఁదిరుగుచున్నాఁడవు. నీయొక్కతలంపునుకార్యములునునిర్ధారణచేయఁగూడునవియేనా? అంతఃకరణమునకునుఅందనిదియనివిరమించి బాహ్యకరణముచేతనైన అందవచ్చునవియుంటిమి. (దురాసదశ్చ) అందుకును అశక్యముగానున్నది. మనస్సుచేతలభ్యముకాని వస్తువుశరీరముచేత నాలభ్యమగును. (దురాసదః) శ్లో॥ ౩౮ "విష్ణురారాధ్యతేపంథాః"అని

---

మువలన, ఏనం-ఈపరమాత్మను, నవేద-ఎఱుఁగదో, (తతః-ఆకారణమువలన),మనసాసహ-మనస్సుతోఁగూడ, మౌనం-మౌనమును, అనుప్రవిశంతి - చెందుచున్నారు. ౩౬. ఊర్జితం-బలిష్ఠమగు, ధనుః-ధనుస్సును, అవష్టభ్య-పూని, తిష్ఠంతం-నిలుచున్నట్టివానిని, దదర్శ=చూచెను. ౩౭. అనుభావవిశేషాత్తు = మాహాత్మ్యాతిశయముచేత, సేనాపరిగతావివ=సేనతోఁగూడినవారివలె. ౩౮. విష్ణుః=పరమాత్మ,ఆరాధ్యతే=ఆరాధింపఁబడుచున్నాఁడో,(అదియె) పంథాః=మార్గము. యేన=ఏమార్గముచేత, మహాజనః=పెద్దలు, గతః=నడచిరో, సః=అది, పంథాః=మార్గము.

యు॥ శ్లో॥ " మహాజనో యేనగతస్సపంథాః " అనియుచెప్పఁబడు మంచి
మార్గముననడచువారలకుమాత్రము డగ్గఱింపఁదగుదువు గాని. ద్ర॥ ౩౯
" వఝితికత్తలమరుకిన్ఱేన్" అనిత్రోవతప్పివర్తించువారి కొకప్పుడైననుడ
గ్గఱరానివాఁడవై యున్నాఁడవు. (దురాసదః) "షదిల్ విశరణగత్యవసాద
నేషు" అనుటచేపొడియగుట,గమనము,ముగింపు,అనునవిషద్ల్ ధాతువున
కర్థములు. విశరణమర్థమగునప్పుడు పొడిచేయవలయునసిన సుసూక్ష్మమ
న్నట్లు సూక్ష్మద్రవ్యమగుటచే స్థూలపదార్థమువలె పొడిచేయవీలుకాదు.
గతియర్థమగునపుడు ఉన్నచోటనైన ససీమమోయనియెంచినను విభువు
గాన నెల్లచోట్లప్రసరించుటంజేసి ఇంతవరకునుందునని చెప్పఁగూడదు. అ
వసాదనమర్థమగునప్పుడు ముగింపుచేయఁదగినవియనియెంచినను నిత్యమై
సర్వకాలసత్తగుటచేత కాదాచిత్కముగ నాశముచేయఁగూడనిది॥ శ్రు॥
౪౦ "నిత్యంవిభుంసర్వగతంసుసూక్ష్మం" అనియుండుటచే నీమూడును
చేయశక్యములుకావు. అనిచెప్పెనని తాత్పర్యము. వాలివధచేతకుపితులగు
వారువచ్చి ప్రతిక్రియ సేయవచ్చుననుకొంటిమి. (దురాసదః) అట్లువచ్చె
డివారికిఁజేర రానివాఁడవై యున్నాఁడవు. బాహ్యకుదృష్టులయొక్క కుతర్క
ములచేతదూషింపవచ్చునాయనఁగా (దురాసదః) శ్లో॥ ౪౧ "తర్కోఽప్ర
తిష్ఠశ్శ్రుతయోవిభిన్నాః । నచాన్యషేర్దర్శనమస్తికించిత్ ధర్మస్యతత్త్వం
నిహితంగుహాయాం" అన్నట్లు॥ ద్ర॥ "ఉళ్ళిక్కశౌడర్ మికుశురుతియుళ్"
అన్నట్లును, వేదగుహయందు సురక్షితమైయుండుటంజేసి తర్కాభాస
ములచేతనైనను తలక్రిందుగానుండెడి శ్రుతిస్మృతులచేతనైనను అవిచా
ల్యుఁడవై యున్నవాఁడవు. ఇట్టి యప్రమేయదుర్ధర్షత్వములచేత దృప్తుఁడ

౩౯. వఝి=త్రోవను, తికత్తు=తప్పి, అలమరుకిన్ఱేన్=చింతించుచున్నాను. ౪౦. నిత్యం=శాశ్వతుఁడును, విభుః=సర్వమూర్తద్రవ్యసంయోగియు, సర్వగతం=ఎల్ల వానిలోనంతర్యామియు, సుసూక్ష్మం=మిక్కిలిసూక్ష్మస్వరూపుఁడును. ౪౧. తర్కాః =యుక్తులు, అప్రతిష్ఠః=నిలుకడలేనివి, శ్రుతయః=వేదములు, విభిన్నాః=విశేషభేదముగలవి. అన్యషేః=జ్ఞానవంతుఁడుగానివానికి, కించిత్=కొంచెమయినను, దర్శనం=చూడఁదగినది, నాస్తి=లేదు. ధర్మస్య=ధర్మముయొక్క, తత్త్వం= యథార్థ

వై పరదారరాజ్యములను అపహరించుకొనిపాలించుటకై చంపితివేమో యనుకొంటిమి. (జితేంద్రియః) అట్లుకాక సుగ్రీవునికిచ్చుటంజేసి విషయచపలుఁడవుకావు. (జితేంద్రియః) ఇంద్రియములు అణఁగక కన్నవిషయలములోచపలించునవిగాన ఆయింద్రియములట్లుగాక నీకణఁగియుండునట్లుణఁచుకొని ఏలువాఁడవైయుండెదవు. (జితేంద్రియః) ఎవ్వఁడైననొకపురుషుఁడు ఎవ్వతెయైన నొకస్త్రీనిసమీపించెనేని యెగదిగఁజూచుటవాడుకగానున్నది. అట్లుండగా॥ శ్లో॥ ౪౨ "నరామఃపరదారాంశ్చచక్షుర్భ్యామపిపశ్యతి" అన్నట్లు ఇంతవరకు నేనెదుటనిలిచియున్నను యెగవెత్తిచూడకయె నిలిచియున్నావు. నీవెట్టివిరక్తుఁడవో యనుచున్నది. (జితేంద్రియశ్చ) శ్రు॥ ౪౩ "పశ్యత్యచక్షుస్సశృణోత్యకర్ణః" అని, అపాణ్యాపాదో జవనోగృహీతా" అని॥ శ్లో॥ "సర్వేంద్రియైరపివినాసర్వంసర్వత్రపశ్యతి" అనియుండుటంజేసి,లోకులతోసాటిగనుండుటకు వానినిబరిగ్రహించితివి. అంతేకాని లోకులవలె నింద్రియాధీనప్రవృత్తిగలవాఁడవుకావు. (జితేంద్రియః) ౪౪ "దుర్గ్రాహంమనసాప్యన్యైరింద్రియైరపిదుర్జయం' అని, ద్ర॥ "మననుణర్వళవిలన్ పొరియుణర్వైయిలన్"అనియుచెప్పఁబడునట్లులోకులయొక్క బాహ్యాంతరకరణములకు నందకుండునట్లుండెదవనియుభావ

---

ము, గుహాయాం=గుహవలెరహస్యమయినచోట, నిహితం=ఉంచఁబడియున్నది. శుడర్మికు = తేజస్సుచేత వఱిశయించిన, శురుతియుళ్ = శ్రుతియందు, ఉళర్ = ఉండువాఁడు. ౪౨. రామః=శ్రీరాముఁడు, పరదారాంశ్చ=ఇతరస్త్రీలను, చక్షుర్భ్యామపి=కన్నులనైన, నపశ్యతి=చూడఁడు. ౪౩ సః=ఆపరమాత్మ, అచక్షుః, =కన్నులులేనివాఁడై, పశ్యతి=చూచుచున్నాఁడు. అకర్ణః = చెవులులేనివాఁడై, శృణోతి=వినుచున్నాఁడు,అపాణ్యాపాదః=చేతులునుపాదములులేనివాఁడై, జవనః =వేగముగఁబోవువాఁడును, గృహీతా=పట్టుకొనువాఁడును. సర్వేంద్రియైరపివినా=సమస్తేంద్రియములులేకయే, సర్వత్ర=అంతటను, సర్వం=అంతయును, పశ్యతి=చూచుచున్నాఁడు.౪౪అన్యైః-ఇతరులచేత, మనసాపి=హృదయముచేతను,దుర్గ్రాహం=గ్రహింపఁగూడనివాఁడును, ఇంద్రియైరపి=ఇంద్రియములచేతను, దుర్జయం=జయింపఁగూడనివానిని. మననుణర్వు=మనోజన్యజ్ఞానముయొక్క, అళవు=కొలత, ఇలన్=లేనివాఁడును, పొరియుణర్వు=ఇంద్రియజన్యజ్ఞానమనునది,ఇలన్

ము. (త్వంజితేంద్రియః) శ్లో॥ ౪౫ "అహల్యాయామైజారస్సురపతిరభూదాత్మతనయాంప్రజానాథో౽యాసీత్ అభజతగురోరిందురబలాం" అన్నట్లు నామామగారగునింద్రుడు అహల్యాజారుండయ్యెను. అతనికధికుండగు బ్రహ్మసుతాభిలాషమొనర్చెను. ప్రకాశకుండగు చంద్రుడుగురుదారద్రోహియయ్యెను. ఆదిత్యపుత్రుండగుసుగ్రీవుడును ఇంద్రపుత్రుండైన వాలియును నావిషయమున ననుభవించినయవస్థయిది. విశ్వామిత్రుండు మేనకాచపలుండయ్యెను. ఇట్లులోకముస్వాభావికముగ విషయచపలమగుచుండంగా నీవొక్కండవేసుమీవిరక్తుండవై యున్నవాండవు॥ శ్లో॥ ౪౬ "ఇంద్రియైఃకామవృత్తస్సన్ కృష్యసేమనుజేశ్వర" అన్నట్లు, రాజ్యమునుకళత్రమునువదలియుండెడి నీవు ఆయాశచేవచ్చితివోయనుకొంటిమి. (జితేంద్రియః) వానియందుప్రత్యక్షముగ నిస్పృహుండవైయున్నావు. ఇట్లువిరక్తుండవై యున్నవాండు మనలనుశ్రమపెట్టనేల అధార్మికుండోయనుకొంటిమి. (ఉత్తమధార్మికః) ఈవ్యాపారములెల్ల పరార్థముగ నుపకరించుచున్నవిగాన (ఉత్తమధార్మికః) తనకనిచేసికొనువాండు అధమధార్మికుండు. తనకును పరులకునని చేయువాండు మధ్యమధార్మికుండు. పరులకేఅనిచేయువాండు ఉత్తమధార్మికుండు. లేక- ధార్మికః. ఉద్ధార్మికః. ఉత్తరధార్మికః. ఉత్తమధార్మికః. అనియుచెప్పవచ్చును. ధార్మికుండనంగాధర్మసంబంధముగలవాండు. అనంగా॥ శ్లో॥ ౪౭ "వర్ణాశ్రమాచారవతాసమారాధ్యతే" అన్నట్లు, వర్ణాశ్రమధర్మసమారాధ్యుండగుట. ఉద్ధార్మికుండనంగా॥ శ్రు॥

---

లేనివాండును. ౪౫. సురపతిః=దేవేంద్రుండు, అహల్యాయామైజారః=అహల్యకుఱంకుమగండు, అభూత్=అయ్యెను. ప్రజానాథః=బ్రహ్మ, ఆత్మతనయాం=తనకూతును, అయాసీత్=పొందెను, ఇందుః=చంద్రుండు, గురోః = గురువగుబృహస్పతియొక్క, అబలాం=స్త్రీని, అభజత=పొందెను. ౪౬. మనుజేశ్వర=ఓరాజా, కామవృత్తస్సన్=కామవ్యాపారములందువర్తించువాండవై, ఇంద్రియైః=ఇంద్రియములచేత, కృష్యసే=ఈడువంబడుచున్నావు. ౪౭. వర్ణాశ్రమాచారవతా=వర్ణము ఆశ్రమము ఆచారము అనునవిగలవానిచే, సమారాధ్యతే = పూజింపం బడుచున్నాండు.

౪౭ "తమేవంవిదిత్వామృతఇహభవతినాన్యఃపంథాః" అన్నట్లు భక్తిమార్గముచే భజనీయుఁడైయుండువాఁడనుట. ఉత్తరధార్మికుఁడనఁగా॥ శ్రు॥ ౪౮ "శరణమహంప్రపద్యే" అన్నట్లు సర్వలోకశరణ్యుఁడనుట. ఉత్తమధార్మికుఁడనఁగా॥ శ్రు॥ ౫౦ "తేనానుగృహీతోబ్రహ్మలోకంగచ్ఛతి" అనియు॥ శ్లో॥ ౫౧ "ఉపాయోగురురేవస్యాత్" అనియు,పురుషకారవశీకారవశీకార్యుఁడనుట. (ధార్మికత్వమనఁగా) సామాన్యధర్మనిష్ఠకలిమి. ఉత్తరధార్మికత్వమనఁగా అసాధారణధర్మనిష్ఠకలిమి. సామాన్యధర్మమనఁగా॥ ౫౨శ్లో॥ "ఆనృశంస్యంపరోధర్మః" అని నాొచ్చినవారలంగని యయ్యోయనికనికరించుట. అసాధారణధర్మమనఁగా॥ శ్లో॥ ౫౩ "కులోచితమతిక్షాత్రంధర్మంస్వంబహుమన్యతే । వధశ్చధర్మయుద్ధేనస్వరాజ్యపరిపంథినాం । క్షత్రియాణామయంధర్మోయత్ప్రజాపరిపాలనం" అని, తన్నుచేరినవారలకొకయాపదకలిగెనేని వారిశత్రువులనుతీక్ష్ణములగుబాణములచేతఁబరిమార్చుట. అట్లగుటవలన వాలితోవిరోధించి వధించి సుగ్రీవునిరక్షించుటంజేసిధార్మికుఁడగుటమాత్రమేగాక ఉత్తమధార్మికుఁడవునైయున్నావు. (ఉత్తమధార్మికః) ఆర్తుఁడగు సుగ్రీవునిరక్షించి॥ శ్లో ౫౪ "రాజభిర్ధృతదండాస్తుకృత్వాపాపానిమానవాః । నిర్మలాస్స్వర్గ

---

౪౭. తం=ఆపరమాత్మను, ఏవం=ఇట్లు, విదిత్వా=ఎఱింగి, ఇహ=ఇచ్చోటు నమృతః=చావనివాఁడుగా, భవతి=అగుచున్నాఁడు. అన్యఃపంథాః=వేఱుమార్గము, న=లేదు. ౪౮. అహం=నేను, శరణంప్రపద్యే=శరణుసొచ్చెదను. ౫౦. తేన=ఆగురువుచేత, అనుగృహీతః=అనుగ్రహింపఁబడినవాఁడై, బ్రహ్మలోకం=బ్రహ్మలోకమును, గచ్ఛతి=పొందుచున్నాఁడు. ౫౧. గురురేవ=గురువే, ఉపాయః=ఉపాయభూతుఁడుగా, స్యాత్=అగును ౫౨. ఆనృశంస్యం=క్రూరత్వములేమి, పరః సర్వోత్కృష్టమైన, ధర్మః=ధర్మము. ౫౩. అతిక్షాత్రం=మిక్కిలిక్షాత్రమును, స్వరాజ్యపరిపంథినాం=తనరాజ్యమునకు విరోధముసేయువారియొక్క, ధర్మయుద్ధేన=న్యాయమైనయుద్ధముచేత, వధశ్చ=చంపుటయు, కులోచితం=కులమునకుఁదగినట్టి, స్వం=స్వకీయమగు, ధర్మం=ధర్మముగా, బహుమన్యతే=గౌరవింపఁబడును. ప్రజాపరిపాలనంయత్=జనులనురక్షించుట, అయం=ఇది, క్షత్రియాణాం = క్షత్రియులకు, ధర్మః=ధర్మము. ౫౪, మానవాః=ప్రజలు, పాపానికృత్వా=పాపములు

మాయాంతిసంతస్సుకృతినోయథా" అన్నట్లు, అకృత్యకరణముచేతనా రకియగువాలిని॥ శ్లో॥ "తస్యదండోవధస్మృతః"అన్నట్లు, వధదండముచే పరిపూతునింజేయుటచేత ఉత్తమధార్మికుడవుగా నుండెదవనిభావము. ఒకశ్రేయస్సాధన ధర్మముమాత్రమేయుండి యవిఫలపర్యంతముకాకయు న్నదోయనియనుకొంటిని. (అక్షయ్యాకీర్తిశ్చ) శ్లో॥ ౫౫ "తస్యనామ మహద్యశః" అనియు॥ ద్ర॥ "నికరిల్పుకళ్గా"అనియు, చెప్పబడినట్లు తరు గనిగొప్పకీర్తిగలవాడైయుండెదవు. అనగా ప్రబలుడగువాలినిసంహ రించి సంపాదించినకీర్తికి చెట్లసందునడాగియుండికొట్టితివనియు నిరప రాధ తిర్యక్వధమొనర్చితివనియు నిష్ప్రయోజన వ్యాపాదనముచేసితివని యు ఇత్యాదులచేననేకహానులుచెప్పి కొంతగల్గునట్లుచేయుదమనియను కొంటిమి. రాజులకు మొఱగియుండిచంపుటయు నీతియనియు సుహృత్త ముడుగ శరణాగతుడైనవానియెడల తప్పొనర్చియుండుటంజేసి సాప రాధవధమొనర్చితిననియు జనపదములహితార్థముగ దుష్టమృగవధముచే యుటచే సప్రయోజనవ్యాపాదనముసేసితిననియు ఇట్టియుత్తరములు చెప్పి నిరుత్తరులనుగాజేసితివిగనుక మాచేతనునాశముచేయగూడనికీర్తి గలవాడవయితివి.ఇట్లు వినాశ్యమగుకీర్తిబొందుటకు మూలమేమోయని యుంటిమి, (విచక్షణశ్చ) అందుకుమూలభూతములగుకార్యములయందు భవిష్యత్తునాలోచించి సేయుచిరూపకుడవునై యున్నావు.(విచక్షణశ్చ) శ్రు॥ "యస్సర్వజ్ఞస్సర్వవిత్" "స్వాభావికీజ్ఞానబలక్రియాచ" అన్నట్లు, సహజసర్వజ్ఞుడవగు నీకిదియొకగొప్పగాదు. (విచక్షణశ్చ) నీవువచియిం చెడుమాటలలో తప్పులుబట్టుదమన్నను॥ శ్లో॥ ౫౬ "ఉత్తరోత్తరయుక్తౌ చవక్తావాచస్పతిర్యథా" అన్నట్లు, మామాటలుఅడుగుపడునట్లు పైపైని

---

చేసి, రాజభిః=రాజులచేత, ధృతదండాః=దండింపబడినవారై, నిర్మలాః=పా పముసెడబాసినవారై, సుకృతినః-పుణ్యవంతులగు, సంతోయథా=సత్పురుషులవలె, స్వర్గమాయాంతి=స్వర్గమునుబొందుచున్నారు.౫౫.తస్యనామ=వానికి, మహత్= గొప్ప, యశః=కీర్తి. ౫౬. ఉత్తరోత్తరయుక్తౌచ-మీదమీదయుక్తులుచెప్పగా,

యుక్తులుపన్ని మాటలాడునట్టి వావదూకుఁడవుగానుడన్నావు. (విచక్ష ణః) సహజసాదృశ్యము చేత లక్ష్యము మాఱకుండునట్లు ఆశ్రితవధముకలు గకుండుటకుఁగా మెడనొకపుష్పహారము వేసిపంపితివి. ఆహా యిదియేమి చాతుర్యము. (విచక్షణః) నీవు అప్రమేయుఁడవై యితరులకు తెలిసికొనఁ గూడనివాఁడవై యుండినను నీవెల్లవానిని నెఱింగినవాఁడవై కనుపట్టెదవు. (విచక్షణః) రావణుఁడు తనకును నీకునుశత్రువగుటచేత మిక్కిలియాశ పడిమైత్రిఁజేసి సుగ్రీవుఁడుమనకుసహాయుఁడగుననియు రావణునికిమిత్రుఁ డగుటచేత వాలిసహాయుఁడుగాఁడనియునిశ్చయించి యాతనింగూర్చియా తనింజంపుటచేత మంచివారిని చెడువారినిఎఱుంగుటయేగాక ఈలోక తత్వ మంతయు నెఱింగినవాఁడవునైతివి. ఇట్లువిచక్షణుఁడవైతివేని॥ శ్లో॥ ౫౭ "శత్రోశ్శేషంన శేషయేత్" శ్లో॥ "సపుత్రపౌత్రంసామాత్యంసమిత్రజ్ఞాతి బాంధవం।హత్వా" అని చెప్పఁబడినట్లు వచనానురోధము చేసికొనియు న్న యంగదాదులనుగూడనిరన్వయముగ ముగియింతువేమోయనియెంచి తిమి. (క్షితిక్షమావాన్) సహనమునందు భూమివంటివాఁడవైయున్నా వు. వాలినిజంపిన కోపముమారకనిలుచుండునప్పుడు నేనును అంగదుఁడు ను తలలోనిపేనువలె ముందువచ్చినిల్వఁగా వంశచ్ఛేదముగఖండించుటకుఅ నువుపడియుండ మాయెడలనోర్పుగలిగియున్నావు. ఇదియెక్కడియోర్పు. (క్షితిక్షమావాన్) "క్షమయాపృథివీసమః" అన్నట్లు పంచాశత్కోటి విస్తీర్ణమగు నీభూమియొక్క విశాలమైనప్రదేశంబునంగల ఓర్పుఅంతయు నీ యొక్కనియెడల నేయున్నది.(క్షితిక్షమావాన్) మొదటహృదయమునం దు తప్పుదూరి అనంతరముఓర్పుఁగొనుటగాదుస్వభావతఃదోషమునేయెం చని ఓర్పేనిరూపకముగాఁగలదిభూమి. ఆభూమియొక్క ఓర్పుగానున్నది.

---

వాచస్పతిర్యథా-బృహస్పతివలె, వక్తా-వెనుదీయకవచియించువాఁడు. ౫౭. శత్రోశ్శేషం-శత్రువులయొక్క మిగతను, నశేషయేత్-మిగిలింపఁగూడదు. సపుత్రపౌత్రం కొడుకులతోను మనుమలతోనుగూడినవాఁడును, సామాత్యం-మంత్రులతోనుగూడి నవాఁడును, సమిత్రజ్ఞాతిబాంధవం-స్నేహితులతోను దాయాదులతోను చుట్టములు

నీయోర్పు. (క్షితిక్షమావాన్) భూమియొక్క వైశాల్యమున కంతయుఁజే
యఁదగిన ఓర్పును నాయొక్కతెవిషయమునం జేకనఁబఱచుట యేమిచెప్పవ
చ్చును.(క్షితిక్షమావాన్)భూమూర్ధమునందుమతుప్పగనుక, నాయొక్కతె
విషయమునం జేసిన ఓర్పు భూమికంతటికిఁ జాలునట్లున్నదే. నాయెడల
నిట్లుఓర్పుగలిగియుండుటకు కారణమేమోయనియనుకొంటిని. (క్షతజోప
మాక్షః) ద్వి॥ ౫౮ "ఉయిర్కెల్లాం తాయాయళిక్కిన్ఱ తండామరైక్క
ణ్ణన్" అన్నట్లు సర్వరక్షకత్వసూచకమగు నీకన్నులయొక్క వైలక్షణ్యమే
కారణముగఁదెలిసెను. (క్షతజోపమాక్షః) వాలినిజంపునపుడు కోపము
చేఁగలిగినయెఱుపుఇంకను మాఱకుండఁగానన్నునుగోపగించుకొనకఓర్పుఁ
గొనుటయేమిచిత్రము. "శరేణైకేన" వాలిని ఒకబాణముచేతనేచంపితినని
వింటిని. అట్లుకాక "రామోరక్తాంతలోచనః"అన్నట్లు, * కడకన్నుల
యెఱుపుమాత్రముగలిగియున్నాఁడవు. (క్షతజోపమాక్షః) శ్లో॥ ౫౯
"రక్తాస్యనేత్రపాణిః" అనియు, "త్రితామ్రః" అనియు, చెప్పఁబడినట్లు
కన్నులయెఱుపును సాముద్రికలక్షణమయియుండుటచేత ఇంకమీఁదటసా
ర్వభౌముఁడవై ప్రజలనేలఁగలవనితోఁచుచున్నది. (క్షతజోపమాక్షః)క్షత
మనఁగా గాయము. దానివలనంబుట్టినదిక్షతజము. అనఁగా నెత్తురు. అట్లు
ను, "యథాకప్యాసంపుండరీకమేవమక్షిణీ" అని సుప్రసన్నధవళములగు
నీయొక్కకన్నులకు ఎఱుపుస్వాభావికము గాదు.కోపముచేతనదుమఁగలిగి
నట్లు తోఁచుచున్నదియనిభావము. (క్షతజోపమాక్షః)ఈకన్నులుసీతాదే
విని ఎడఁబాసియుండుటచేఁగలిగిన శోకాశ్రుపతనముచేత ఎఱ్ఱనైనవో
వాలియెడల కోపముచే నెఱ్ఱనైనవో సుగ్రీవునియెడల వాత్సల్యముచేతనే

---

తోను గూడియున్నవాఁడునైన శత్రువును, హత్వా - చంపి. ౫౮. ఉయిర్కెల్లాం - ప్రాణులకెల్లను, తాయాయళిక్కిన్ఱ - తల్లియైరక్షించునట్టి, తండామరక్కణ్ణన్ - పద్మపత్రవిశాలాక్షుఁడు ౫౯. రక్తాస్యనేత్రపాణిః - ఎఱ్ఱనిమొగము కన్నులు

---

* వాలినిఁజంపుటకు బాణమక్కరలేదు. ఈకన్నులయెఱుపుచేతనే దగ్ధుఁడైయుండవచ్చునని తోఁచుచున్నదియని చెప్పినట్లు ఈవాక్యమునకుభావము.

యొట్లనైనవో ఇన్నిటిచేతను ఎట్లనైనవోయేయుంగను. ఇందు, అప్రమే
యశ్చ దురాసదశ్చ జితేంద్రియశ్చయనిమొదలుపెట్టి ప్రతిపదమునందును
చకారముంచెను. అదియేలయనఁగా వీనిలోనొక్కొకగుణమే యీతని
గౌరవమునకుఁజాలియుండఁగా ఇన్నిగుణములనుచేరియుండెనేని చెప్పవల
యునా? యనియనుటకు. లేక. ఈచకారములచేత ఈకనఁబఱిచినగుణము
లొక్కొక్కటికిని వేఱేయొక్కొకయాశ్రయముదొరకకుండునట్లు ఇన్ని
గుణములును ఈయాశ్రయమునందేచేరియుండుటయేమిచిత్రము. అని
యనుచున్నదనియైనను చెప్పవచ్చును. అయినను అనేకపదములయందుచ
కారమిడినవాఁడు "క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః" అనుపదములలోను
గూడచకారమిడవలదా? అది యుంచనియెడల రీతిభంగమనియెడితప్పు
కలుగదా?యనఁగా కలుగదు. పూర్వపదములలో అప్రమేయత్వాదిగుణ
తదాశ్రయసంబంధమాత్రవివక్షచేతఁజెప్పఁబడెను. క్షితిక్షమావాన్ అని
యెడిపదములందు పంచాశత్కోటివిస్తీర్ణయగు భూమియొక్క వైశాల్య
మునందుగలక్షమాగుణమంతయు ఈయొకయాశ్రయమునందేఅణఁగియు
న్నదియనుగౌరవముచేత భూమార్థమగుటంజేసిఆశ్రయముననడంగని గుణ
ప్రాచుర్యమును సంధింపఁబడెను. కనుక నింకనీయాశ్రయమునందుగుణాం
తరములకు ఎడములేదు అనినిశ్చయించి పూర్వోత్తరగుణములను మరపి
చెప్పుటచే సముచ్చయాపేక్షలేదయ్యెను అనియైనను జెప్పవచ్చును. లేక క్ష
మావాన్ అని శ్రీరామునియొక్క యోర్పునుఅనుసంధింపఁగానే ఏదేనియప
రాధముండెనేని శ్రీరాముఁడుఓర్చుకొనును. ఓర్చుకొనెనేని దేశీయులునో
ర్చుకొందురు. అని నిర్బంధింపకపోయెననియైనను చెప్పనగును. ఇంతేగాక,
"క్షతజోపమాక్షః" అను దానియందుచకారలోపమునకుగతియేమనఁగా,
క్షతజోపమాక్షః అనునది శరీరములోనిగుణమయి భిన్నాధికరణమగుటచే
తను సముచ్చయముచేయవలసినదిలేదని పరిహరింపవచ్చుననియైనను-లేక
అప్రమేయశ్చ, దురాసదశ్చ, జితేంద్రియశ్చ, ఉత్తమధార్మికశ్చ, అక్ష
య్యకీర్తిశ్చ, విచక్షణశ్చ, అనునివి ప్రథమావిభక్త్యంతములును పరోక్ష

నిర్దేశములునయి యేకరీతిగలవగుటచే చకారాపేక్షగలదు. ఇకట-డత్వం అను దానితో సమానముగ కృతజ్ఞోపమాత్మయని సంబుద్ధ్యంతమయినమధ్య మపురుషమై † రీత్యంతరమైయుండుటచేత సముచ్చయాపేక్షలేదు అనియైనను చెప్పవచ్చును. త్వమప్రమేయశ్చేత్యాది. శ్రీవాల్మీకిభగవానులు॥ శ్లో॥ ౬౦ "జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజాంస్యశేషతః" అని చెప్పినట్లు పరత్వానుసంధానమగు షాడ్గుణ్యమునకు ప్రతిగా పూర్వమున॥ శ్లో॥ ౬౧ "ఆనృశంస్యమనుక్రోశం శ్రుతం శీలం దమశ్శమః । రాఘవం శోభయంత్యేతే షడ్గుణాః పురుషోత్తమం" అని సౌలభ్యానుసంధానముగా నొకవిధమైనషాడ్గుణ్యమునొనంగూర్చెను. ఇప్పుడు అపహతపాప్మత్వాదిగుణాష్టకమునకు ప్రతిగా అప్రమేయత్వాదిచే నొకగుణాష్టకమును గనంబఱచుచున్నాఁడు.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణం ప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణశ్లోకరత్నావళియందు త్వమప్రమేయశ్చ అను శ్లోకముయొక్క-యుపన్యాసము సంపూర్ణము.

---

శ్రీరామచంద్రాయనమః.

---

శ్రీయాంజనేయులు లంకానగరమునం బ్రవేశించి శ్రీసీతాదేవిని వెదకి యశోకవనమున కేగి యచ్చోనామెం గాంచి యామెయుండు దైన్యావస్థితిమనంబునకు అపారమగు దుఃఖవేగమును బుట్టింప శోకపరవశుఁడై యీ క్రిందిశ్లోకము చెప్పుచున్నాఁడు. ఇది సుందరకాండము పదునైదవసర్గములోనిది.

---

గలవాఁడు, త్రితాత్రమః - పూర్వోక్తమర్థము. ౬౦-జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు, ఇవి పరుఁడైన పరమాత్ముని గుణములు. ౬౧. ఆనృశంస్యం-అక్రూరత్వమును, అనుక్రోశం-దయయును, శ్రుతం-శాస్త్రార్థములవినికియు, శీలము-సత్స్వభావమును, దమః-అంతరింద్రియనిగ్రహమును, శమః-శాంతియును నెడ్డి, ఏతేషడ్గుణాః=ఈయాఱుగుణములును, పురుషోత్తమం=పురుషశ్రేష్ఠుఁడగు, రాఘవం=శ్రీరాముని, శోభయంతి=ప్రకాశింపఁజేయుచున్నవి.

---

† కృతజ్ఞోపమాత్మ అనుపాఠప్రకారము ఈయోజన.

శ్లో॥ దుష్కరంకృతవాన్ రామో హీనోయదనయాప్రభుః।
ధారయత్యాత్మనోదేహంనశోకేనావసీదతి॥౧౮॥

టీ॥ రామః=శ్రీరాముఁడు, దుష్కరం=చేయుటకరుదగు కార్యమును,కృతవాన్=చేసినవాఁడయ్యెను.యత్=ఏకారణముచేత,అనయా=ఈసీతాదేవిచే, హీనః=ఎడబాసినవాఁడై, ప్రభుః = తనపనులనుచూచుటకు శక్తుఁడైయున్నవాఁడు. మఱియు—ఆత్మనః=తనయొక్క, దేహం=శరీరమును,ధారయతి=ధరించుచున్నాఁడు. శోకేన=దుఃఖముచేత, నావసీదతి=నశించకయున్నాఁడు.

తా॥ ఈరాముఁడిట్టి సీతాదేవినెడబాసి తనపనులుచూచుకొనుచు దేహమునుధరించియున్నాఁడుగాని యింకనుదుఃఖముచేత మచ్చమాసిపోలేదు. ఆహాయెట్టియసాధ్యమైనపనిచేయుచున్నాఁడీరాముఁడు.

శ్లో॥ ౧॥ "అన్యత్రభీష్మాద్గాంగేయాదన్యత్రచహనూమతః।హరిణీఖురమాత్రేణచర్మణామోహితంజగత్" అన్నట్లు, భీష్మునితోసాటిగాజింకగిట్టంతమైన స్త్రీయొక్కయవయవవిశేషమునఁదగులుకొనక యత్యంతవిరక్తుఁడైయుండు హనుమంతుఁడుగూడ సీతాదేవినినమస్కరించి యామెయొక్కవైలక్షణ్యమును ఆమెయుండెడిదైన్యమునుజూచి యీమెనుయిట్లుకష్టపెట్టుచున్నాఁడేయని శ్రీరామునిశిష్టగర్హణసేయుచున్నాఁడు.(దుష్కరంకృతవాన్ రామః) నేను గొప్పసముద్రమును దాఁటి యత్యంతదుష్కరమైనకార్యముచేసితిననుకొంటిని. శ్రీరాముఁడు నాకంటెదుష్కరమగుకృత్యమునుచేయునట్లు తోఁచుచున్నదిగదాయిప్పుడు. (రామః)ఏకదారావ్రతుఁడయి సీతాదేవియందుఁగాక యితరస్త్రీలయందునువర్తింపని రామునికి (దుష్కరం) ప్రణయగతినెఱింగినవారై పుట్టినవారు చేయనరుదగునొకపనిచేసెను.(దుష్కరం)అరణ్యమునకుఁబోవునప్పుడు కూడవెంటఁదీసికొనిపోయినరాముఁడు తనకు ఇంతకుముందుచేయనరుదుగనుండు నీసంసారమునుజేయఁబూనితప్పిపోయెనో? యనఁగా (కృతవాన్) చేయారఁజేసియున్నాఁడు. ఇట్లు ఈతఁడుచేసినదేమనఁగా (రామః సీతాదేవినెడబాసి కనుగందకయున్నవాఁడు. (రామః) సీతాదేవినెడఁబాసెనేని మన్న

౧- భీష్మాద్గాంగేయాదన్యత్ర=గంగాపుత్త్రుఁడగు భీష్మాచార్యునికంటె నితర

ఱత్వమువూసి కృత్యములుపఱచి మొగము తెల్లఁబాఱి శరీరముకృశించి చేతులుకాళ్లుస్వాధీనములుగాక వ్యామోహితుఁడైయుండవలవదా? దీనిని గుఱించి యేసీతయును॥శ్లో॥౨. "కచ్చిన్నతద్ధేమసమానవర్ణం తస్యాననం పద్మసమానగంధి" అని ముఖమునందు కాంతియును వాసనయునుమాఱి శోకయున్నదాయనియడిగెను.(రామః) నుసిగప్పిననిప్పుగానుండెనుగదా? పైకిమంచితనమగపఱచుచు తీసికొనిపోయి నట్టనడిమియడవిలోత్రోసివేసెనుగదే? కర్మవశమున నపహృతయయ్యోనేకాక యీతఁడు మెడపట్టిత్రోసెనా? యేమి? ఈమెయందుప్రీతుఁడైయుండె నేనితానెడఁబాయునా?(హీనో యదనయా)ఈతఁడు ఈమెనువదలి జింకను వెంబడించిపోయినందునఁగదా యీయపహారముకలిగెను.(అనయాహీనః) "ఇరయుమకలుకిల్లేూ" [క్షణకాలమైనను తననాధునినెడఁబాయను] అని యెదునీ మెనుఎడఁబాయవచ్చునా?(అనయాహీనః)శ్లో॥ ౩"అనన్యభావామనురక్తచేతనాం త్వయావిహీనాంమరణాయనిశ్చితాం" అనిచెప్పినయీమెనుగదా ఎడఁబాసెను. (అనయాహీనః)శ్రు॥౪"శ్రద్ధయాదేవోదేవత్వమశ్నుతే" అనియు॥ శ్లో॥ "అప్రమేయంహితత్తేజోయస్యసాజనకాత్మజా" అనియు॥ శ్లో॥ "అనన్యారాఘవేణాహంభాస్కరేణప్రభాయథా"అనియు, చెప్పఁబడునట్లు సకలవిధములచేతను తనకుఁగనికరింపఁదగిన యీమెనావిడువఁదగును. (ప్రభుః)

---

మను, హనూమతః అన్యత్ర=హనూమంతునికంటె నితరమునగు (అనఁగా వీరిరువురునుగాకతక్కినవారెల్ల వారుఅని భావము.) జగత్ =లోకము, హరిణీక్షురమాత్రేణ-జింకగిట్టంతయగు, చర్మణా=తోలైనయాఁడుదానియవయవముచేత, మోహితం=మోహమునొందినదియే.౨.తస్య=ఆరామునియొక్క,తత్ =ఆ, ఆననం=మొగము, హేమసమానవర్ణం=బంగారమువంటికాంతిగలదియు, పద్మసమానగంధి=కమలమువంటివాసనగలదియునై, కచ్చిన్న=ఉన్నదా? లేదా?.

౩- అనన్యభావాం = ఇతరమునందిష్టములేనిదియు, అనురక్తచేతనాం = అనురాగముతోఁగూడిన మనస్సుగలదియునై, త్వయా = నీచేత, విహీనాం = ఎడఁబాసినదియు, మరణాయ=చావునకు, నిశ్చితాం = నిశ్చయించినదియనగునది సీత.౪, దేవః-పరమాత్మయగువాఁడు, శ్రద్ధయా=శ్రద్ధాశక్తిచేత, దేవత్వం=

_ ఏమియు నెఱుఁగనివాఁడు. ప్రభుత్వమనఁగా నెఱుఁగమియే యనఁబడును. (ప్రభుః) మేలిమిమాత్రమున్నది కానికూరిమి లేదుగదా యాతనికి. (ప్రభుః) ఏనుఁగులను గుఱ్ఱములను గట్టను రాజధానిని ఏలను లెక్కలువినను నేర్చును గాని ప్రణయిత్వమునందు ఏమియు నెఱిఁగినవాఁడుగాఁడు. (ప్రభుః) స్త్రీ యొక్క కష్టము నెఱుఁగనివాఁడు.॥శ్రు॥ ౫ "బహుధావిజాయతే" అనియు॥ శ్లో॥ "బహూనిమేవ్యతీతానిజన్మాని" అనియు ద్ర॥ "పలపిరవి ప్పెరుమాళ్" అనియుఁ జెప్పఁబడినట్లు, పుట్టినట్టిపుట్టుకలయొక్క ప్రవాహములో నొక జన్మమునందైన స్త్రీగాఁబుట్టినఁగదా యాకష్టములననుభవించి స్త్రీలైపుట్టినవారు అనుభవించెడుదుర్భరమగు దుఃఖమిట్టిదని యెఱుంగును. ఇట్లు ప్రభువై యాతఁడు చేసిన దేమనఁగా (ధారయత్యాత్మనోదేహం) సీతాదేవి నెడఁబాసిన శ్రీరాముఁడు సముద్రములోఁబడిసమసిపోయెను అను పేరు పడ్డ యవలదా? (ధారయతి) ధరించియున్నాఁడే. ఇంతవరకుసత్తనశించియుం డవలదా? నిత్యమగుస్వరూపమునశింపదగునాయనఁగా? (ఆత్మనోదేహం) నిత్యమగుస్వరూపముండఁగా॥ శ్లో॥ "ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః" అన్నట్లు, ఆగంతుకమగు దేహమునువిడువఁగూడదో? శ్లో॥ "నిత్యం నిత్యాకృతిధరం" అనియుండుటచే, స్వరూపమువలె రూపముగూడనిత్యముకాదాయనఁగా (రామఃఆత్మనోదేహం) అప్రాకృతశరీరమును జెప్పితినా? లేదు॥౬ద్ర॥ "అతిశయంశోతియురువైయంగువైత్తింగుపిరంద" అని చెప్పఁబడునట్టి దేహమునువిడువఁగూడదా? (ఆత్మనోదేహం) తానొక

---

దేవతాత్వమును, అశ్నుతే=పొందుచున్నాఁడు. యస్య=ఎవనికి, సాజనకాత్మజా= ఆజానకి గలదో, తత్తేజః=ఆతనియొక్క తేజస్సు, అప్రమేయంహి = ఇట్టిదనియూహింప శక్యముకానిదిగదా, ఇట్టిమాహాత్మ్యము సీతవలనఁగలిగినదనుట- ౫ -బహుధా=పెక్కువిధములుగా, విజాయతే=కలుగుచున్నవాఁడు. మే=నాకు, బహూని జన్మాని=పెక్కుజన్మములు, వ్యతీతాని=కడచెను. పలపిరవి ప్పెరుమాళ్=అనేకజన్మములుగలదేవుఁడు.౬. అతిశయంశోదియురువై=విశేషకాంతిగల యాకారమును, ఆపరమపదమునందు, వైత్తు = ఉంచి, ఇంగు = ఈలోకమునందు, పిరందు = జనియించి.

సీతయై॥ శ్లో॥ ౭ "పరాధీనాస్త్రియస్సర్వాః" అనియు॥ ద్ర॥ "మాయుం వర్తై యఱియేన్ వల్వినై, యేన్ పెణ్ బిఱందేన్"అనియు, పరద్రవ్యముగఁ దలంచియున్నాఁడా. లేదేఁతన దేహమునుపోఁగొట్టుకొనఁగూడదా?(అత్మనోదేహం) తన దేహముతనదా? శ్లో॥ ౮ "భక్తానామని" భక్తులదిగానని తరులదిగ దాయనఁగా, ఇతరుల దేహము నేమి సేయమోయుచున్నాఁడు? ఆతఁడేమిసేయును రూపుమాయుటకుసాధనములేదేయనఁగా (నశోకేనావసీదతి) శోకముఁడఁగా మఱియొకసాధనముకావలయునా? (నశోకే నావసీదతి) ౯ "శోకాగ్నిః ప్రధక్ష్యతి" అని శోకమను పెద్దనిప్పుఁడఁగా మఱియొకటిటికావలయునా రూపుమాయుటకు.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణం ప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు దుష్కరం అను శ్లోకముయొక్క యుపన్యాసము సంపూర్ణము.



శ్రీరామచంద్రాయనమః.

హనూమంతుఁడు సీతాదేవిఁగాంచి యశోకవృక్షాగ్రంబుననుండ ప్రభాతవేళకాఁగానే రావణుఁడు సీతాదేవిందలంచి మదనాక్రాంతుఁడై, యామెయుండెడిచోటికివచ్చి అనేకవిధములుగ ప్రలపింపఁగా నాలోకమాత యిట్లుచేసెననియీ క్రిందిశ్లోకముచేఁ దెల్పుచున్నాఁడు. ఇది సుందరకాండమ ఇరువదియొకటవ సర్గములోనిది.

శ్లో॥ తృణమంతరతఃకృత్వా ప్రత్యువాచశుచిస్మితా।
నివర్తయమనోమత్తస్స్వజనేక్రియతాంమనః॥౧౯॥

---

౭ - స్త్రియస్సర్వాః-స్త్రీలందఱు, పరాధీనాః-ఇతరుల కధీనలగువారు-మాయంవర్కై-మృతినొందుమార్గము, అఱియేన్-ఎఱుఁగను. వల్వినై - ఇదిబహువిగ్నగానున్నది. ఏన్=ఏల, పెణ్బిఱందేన్ = ఆఁడుకూఁతురుగాఁబుట్టితిని. ౮ - భక్తులకై యాకారముధరించియున్నాఁడవు అనిదీనితాత్పర్యము. ౯. శోకాగ్నిః=దుఃఖాగ్ని, ప్రధక్ష్యతి=కాల్చుచున్నది.

టీ॥ తృణం=గడ్డిపోఁచను, అంతరతః = రావణునికిని తనకునునడుమ, కృత్వా=ఉండునట్లుచేసి—ఉంచి, శుచిస్మితా = తెల్లనైన చిఱునగవుగలదై, ప్రత్యువాచ=రావణుఁడుచెప్పినమాటలకు బదులుచెప్పెను. (ఏమిచెప్పెననఁగా) మత్తః= నావలననుండి, మనః=మనస్సును, నివర్తయ=త్రిప్పుకొనుము, స్వజనే=స్వకీయమైన యంతఃపురజనమునందు, మనః=హృదయమును, క్రియతాం=చేయుదువుగాక. తాత్పర్యముస్పష్టము.

శ్లో॥ ౧ "ప్రస్తమాల్యాంబరధరో వైదేహీమనుచింతయన్। భృశం నియుక్తస్తస్యాంచమదనేనమదోత్కటః" అన్నట్లు, నిద్రనుండిలేచిరావణుఁడుమదనపరవశుఁడై॥ శ్లో॥ ౨ "దీపికాః కాంచనీః కాశ్చిత్" అన్నట్లు కనకదీపికా కళాచికావాలవ్యజనతాలవృంత భృంగారుచామరరమణీయ ధ్వజచ్ఛత్రాదిపారిబర్హములంగొని యంగనాశతముసేవింపఁగా॥ శ్లో॥ ౩ "రావణస్యోత్తమాస్త్రియః" అన్నట్లు, ప్రధానమహిషులలోఁ గొందఱు వెంబడించిరాఁగా నిద్రావేశమందగతియై యశోకవనికకువచ్చెను. శ్లో॥ ౪ "తతోదృష్ట్వైవ వైదేహీ రావణం రాక్షసాధిపం" అన్నట్లు, ఆతనింగాంచి పెనుగాలిలోఁదగులుకొన్న గొప్పధ్వజపటమువలెమిక్కిలివణఁకి॥ శ్లో॥ ౫ "ఊరుభ్యాముదరంఛాద్యబాహుభ్యాంచపయోధరౌ। ఉపవిష్టావిశాలాక్షీ" అన్నట్లు స్తనతటములువిషదృష్టులకు గోచరములుగాకమఱుఁగు చేయునట్లు రామభోగ్యములగునాభినిఉదరమునుకుచములనుకన్నులనుతన యూరువులచేతను బాహువులచేతను శోకాశ్రువులచేతనుగప్పి ॥ శ్లో॥

---

౧- ప్రస్తమాల్యాంబరధరః=జాఱినపూదండలును వస్త్రములును ధరించినవాఁడును, వైదేహీం=సీతను, అనుచింతయన్=మాటిమాటికి తలఁచుకొనుచున్నవాఁడును, మదనేన=మన్మథునిచేత, తస్యాంచ=ఆవైదేహియందు, భృశం=మిక్కిలి, నియుక్తః=నియోగింపఁబడినవాఁడును, మదోత్కటః=మదముచేతదుర్భరుఁడునైయున్నవాఁడు, రావణుఁడు. ౨. కాశ్చిత్=కొందఱు, కాంచనీః దీపికాః=బంగారుదీపములను. ౩- రావణస్య=రావణునియొక్క, ఉత్తమాః స్త్రియః=ఉత్తమస్త్రీలు. ౪- తతః=అనంతరము, రాక్షసాధిపం = రాక్షసులకురాజైన, రావణం=రావణుని, దృష్ట్వైవ=చూచి. ౫- ఊరుభ్యాం=తొడలచేత, ఉదరం = కడుపును, బాహుభ్యాంచ-భుజములచేత, పయోధరౌ= స్తనములను, ఛాద్య-కప్పి, విశాలాక్షీ

౬ "సంకల్పహయసంయుక్తైర్యాంతీమివమనోరథైః" అన్నట్లు, మిక్కిలి వే
గముగల తనసంకల్పముల నెడి యశ్వములంబూన్చిన మనోరథము నెక్కి
శ్రీరామునిడగ్గఱ॥ శ్లో॥ ౭ "సమీక్ష్యమాణాం రుదతీమనిందితాం సుపక్ష్మళా
మాయతపద్మలోచనాం । అనువ్రతాం రామమతీవ మైథిలీం ప్రలోభయా
మాస వధాయ రావణః" అన్నట్లు, శ్రీరాముఁడెక్కడనని చూచుచు, ఆతఁ
డు కనఁబడనందున నేడ్చుచు పాతివ్రత్యమున నీమెయొక్కటె యధికురా
లని జనులచే స్తుతింపఁబడుచు యథామనోరథముగ రాముని ననుభవింపలభిం
పమిచే॥ శ్లో॥ ౮ "స్తిమితవికసితానాముల్లసద్భ్రూలతానాం" అన్నట్లు,
స్తిమితములయి పులకితములగు కనుఱెప్పలుగలిగి రాముఁడెక్కడనున్నాఁ
డోయని యాతఁడుండెడి మాల్యవత్పర్వతమువంకకును జక్కఁగానతిదీర్ఘ
ముగఁజూపులనిగుడ్చుచు, ఇన్నిటికెనిమూలమగు నాభిజాత్యముగలదియుం నై
క్లేశపడి మెడు సీతాదేవిని సమీపించి విశేషముగ మాటలాడి స్వవినాశ
మునకు హేతువుగ, అదియిచ్చెద నిదియిచ్చెదనని చెప్పి యామె నైజస్థితిని
బోఁగొట్టవలయునని చూచెను. ఈజల్పనముల నెల్లను గాంచి॥ ద్ర॥ ౯ "పా
దునిన్న పొన్నడిక్కళల్" అన్నట్లు, అనుకూలురు ప్రతికూలురు అను భేదము
లేక సర్వస్వాములగుచు॥ శ్లో॥ ౧౦ "వధార్హమపికాకుత్స్థః కృపయా పర్య

---

= వెడలుపుకన్నులుగలసీత, ఉపవిష్టా=కూరుచుండెను. ౬- సంకల్ప=పైపయిం
బోడమకోరికలనియెడి, హయ=గుఱ్ఱములతో, సంయుక్తైః=కూడికొన్నట్టి, మనో
రథైః=మనోరథములనియెడి రథములచేత, యాంతీమివ=పోవుచున్నదానివలె ను
న్నదానిని. ౭- సమీక్ష్యమాణాం=నలుదిక్కులు సూచుచు, రుదతీం = ఏడ్చునదియు
ను, అనిందితాం=నిందింపఁబడనిదియును, సుపక్ష్మళాం = మంచికనుఱెప్పలుగలది
యును, ఆయతపద్మలోచనాం=విశాలములయిన తామరఱేకులవంటి కన్నులుగలది
యును, అతీవ=మిక్కిలి, రామమనువ్రతాం=రాముననుసరించుటయే వ్రతముగాఁ
గలిగినదియునగు, మైథిలీం=సీతను, వధాయ=బాధించుటకు, రావణః=రావణుఁ
డు, ప్రలోభయామాస = వంచించెను. ౮- స్తిమితవికసితానాం = నిక్కఁ
బొడుచుకొని వికాసమునొందినవగు, ఉల్లసత్=ప్రకాశించుచున్న, భ్రూలతానాం
=తీగెలవంటికనుబొమలుగలవి-చూపులు. ౯- పాదునిన్న=మధ్యస్థుఁడుగానిలచిన,
పొన్నడి=స్వామియొక్క, కళల్=అడుగులు, ౧౦-వధార్హమపి=వధకర్హుఁడైనను,

పాలయత్" అన్నట్లు, పరమకృపాళువగు శ్రీరామునికి అంతరంగవేదిని
యయిన మహిషియగుటచే॥ శ్లో॥ ౧౧ "త్వంమాతాసర్వలోకానాం" అని
యు, "అఖిలజగన్మాతరం" అనియు, "ఉపాయభూతాసావల్లభాప్రా
ప్తియోగినీ" అనియు॥ శ్లో॥ "లక్ష్మీఃపురుషకారత్వేనిర్దిష్టాపరమర్షిభిః"
అనియుఁజెప్పఁబడినట్లు,విశేషించినపురుషకారమనియెడుసంబంధముచేత,
తనపరిభవములుండఁగా వానియనర్థములంగాంచిసీతాదేవియు వాఁడుచె
ప్పినమాటలకుప్రతివచనముగావానికిహితముచెప్పుచున్నది. ౧౨ "కామయే
త్వాంవిశాలాక్షి" అని, "యద్యత్పశ్యామితేగాత్రంశీతాంశుసదృశాననే।
తస్మిన్తస్మిన్పృథుశ్రోణిచక్షుర్మమనిబధ్యతే" అనియు, స్వచాపలమును
ఱెఁగించినందుకు॥ శ్లో॥ ౧౩ "నివర్తయమనోమత్తః" అనియు, "సాధు
ధర్మమవేక్షస్వసాధుసాధువ్రతంచర" అనియు॥ శ్లో॥ "యథాతవతథా
న్యేషాందారారక్ష్యానిశాచర" అనియు, చెడుగులువదలి మంచికార్యము
లనుఆచరింపుము అనియు త్తరముచెప్పియు॥ శ్లో॥ ౧౪ "భుజ్క్ష్వభోగా

---

కాకుత్స్థః=శ్రీరాముఁడు, కృపయా=దయచేత, పర్యపాలయత్=కాకాసురునిర
క్షించెను. ౧౧- త్వం=నీవు, సర్వలోకానాం=ఎల్లలోకములకు, మాతా = తల్లివి.
అఖిలజగత్=ఎల్లజగములకు, మాతరం=తల్లియైన. సావల్లభా=అప్రియురాలైనల
క్ష్మి, ఉపాయభూతా = ఉపాయభూతురాలు, ప్రాప్తియోగినీ=చేతనునియొక్క
ప్రాప్తిసంబంధముగలది. లక్ష్మీః=లక్ష్మి, పురుషకారత్వే = పురుషకారముగా
నుండుటయందు, పరమర్షిభిః=మహర్షులచేత, నిర్దిష్టా=చూపఁబడియున్నది. ౧౨-
విశాలాక్షి=వెడలుపులగు కన్నులుగలదానా, త్వాం=నిన్ను, కామయే=కామించు
చున్నాను.శీతాంశుసదృశాననే=చంద్రునిబోలినముఖముగలదానా, తే=నీయొక్క,
గాత్రం=శరీరమును, యద్యత్ = దేనినిదేనిని, పశ్యామి=చూచెదనో, పృథు
శ్రోణి=బటువులగు పిఱుదులుగలదానా, తస్మిన్తస్మిన్ = ఆయాయవయవమునం
దు, మమ=నాయొక్క, చక్షుః=కన్ను, నిబధ్యతే = నిలుపఁబడుచున్నది. ౧౩-మ
త్తః=నావలననుండి, మనః=హృదయమును,నివర్తయ=నివర్తింపుము. సాధుధర్మం
=మంచిధర్మమును, అవేక్షస్వ=చూడుము, సాధువ్రతం=మంచివ్రతమును, సాధు
=మేలుగా, చర=చేయుము. యథాతవ=నీయొక్కకళత్రములెట్లో,తథా=అట్లే,
అన్యేషాందారాః=ఇతరులపెండ్లాలును, నిశాచర=ఓరాక్షసుఁడా, రక్ష్యాః=కా
పాడఁదగినవారు. ౧౪- యథాసుఖం=సుఖముకలుగునట్లు, భోగాన్=భోగము

స్యథాసుఖం” అనియు, “ఏకవేణీధరాశయ్యాధ్యానంమలినమంబరం। అస్థానేప్యుపవాసశ్చనైతాన్యౌపయికానితే” అనియు, చెప్పినందుకు॥శ్లో॥ ౧౫ “అకార్యంనమయాకార్యమేకపత్న్యావిగర్హితం। కులంసంప్రాప్తయాపుణ్యంకులేమహతిజాతయా” అనియు, “నాహమౌపయికీభార్యా పరభార్యాసతీతవ” అనియును త్తరముచెప్పి॥ శ్లో॥ ౧౬ “అసకృత్సంయుగేభగ్నామయావిమృదితధ్వజాః। అశక్తాఃప్రత్యనీకేషుస్థాతుంమమసురాసురాః” అని తనమగఁటిమిచెప్పుకొనినందుకు॥ శ్లో॥ ౧౭ “జనస్థానేమహాస్థానేనిహతేరక్షసాంబలే। అశక్తేనత్వయారక్షః కృతమేతదసాధువై॥ “ఆశ్రమంతుతయోశ్శూన్యంప్రవిశ్యనరసింహయోః।గోచరంగతయోర్భ్రాత్రోరపనీతాత్వయాధమ। నహిగంధముపాఘ్రాయరామలక్ష్మణయోస్త్వయా। శక్యంసందర్శనేస్థాతుంశునాశార్దూలయోరివ” అనియు, శ్రీరాముని యెదుటనిలిచి, నీవుతప్పించుకొనిపోదువా? పదునాలుగు వేలమందినిబంటిగానిలిచిచంపి చిందఱవందరచేసినయేకవీరునికి ప్రతిక్రియఁగామారీచునిఁగొని నీవు పులియెదుటనిలిచినకుక్కవలె చేసినకృత్రిమముచేత తెలిసికొనవా? ఆ పురుషశార్దూలురయొక్కగంధమును మూర్కొనినిలిచినఁగదా

---

లను, భుజ్క్ష్వ=అనుభవింపుము. ఏకవేణీ=ఒకటిగాఁజెనఁచుకొన్నజడయు, ధరాశయ్యా=నేలయందుబరుండుటయు, ధ్యానం=చింతయు, మలినమంబరం=మాసినవస్త్రమును, అస్థానేప్యుపవాసశ్చ=అసమయమునందు పస్తుపరుండుటయు, ఏతాని=ఇవి, తే=నీకు, నౌపయికాని=యోగ్యములుకావు. ౧౫- ఏకపత్న్యా=ఒకభర్తకేపత్నియయి, పుణ్యంకులంసంప్రాప్తయా=పావనమైన రఘుకులమును పొందినదియు, మహతికులే=గొప్పవంశమునందు,జాతయా=పుట్టినట్టిదియునగు,మయా=నాచేత, విగర్హితం=నిందింపఁబడిన, అకార్యం=అయుక్తమైనపని, నకార్యం=చేయరానిది. అహం=నేను, తవ=నీకు, ఔపయికీభార్యాన=యోగ్యయగు భార్యనుగాను, పరభార్యా=ఇతరునిభార్యను, సతీ=పతివ్రతను. ౧౬- సురాసురాః=దేవతలును అసురులును, మమ=నాయొక్క, ప్రత్యనీకేషు=ప్రతియుద్ధములయందు, స్థాతుం=నిలుచుటకు, అశక్తాః=శక్తిలేనివారై, మయా=నాచేత,విమృదితధ్వజాః=విఱుగఁగొట్టఁబడిన టెక్కెములుగలవారై, అసకృత్=పలుమాఱులు, సంయుగే=యుద్ధమునందు, భగ్నాః=అపజయమునొందింపఁబడిరి. ౧౭- రక్షః=రాక్షసుఁ

వెనుక నీశౌర్యమును నీ పౌరుషమునుజూడనగును. అని శ్రీరామునియొక్క శౌర్యధైర్యాదులనుపన్యసించి యుత్తరముఁజెప్పియు॥ శ్లో॥ ౧౭ "లోకేభ్యోయానిరత్నానిసంప్రమథ్యాహృతానిమే। తానితేభీరుసర్వాణిరాజ్యంచైతదహంచతే" అనియు॥ "ఇమాంచపృథివీంసర్వాంనానానగరమాలినీం। జనకాయప్రదాస్యామి" అనియు, "యానివైశ్రవణేసుభ్రూరత్నానిచధనానిచ" అనియు, రాజ్యరత్నధనధాన్యనగరపత్తనాదులనిచ్చెదనని ప్రలోభించినందుకు॥ శ్లో॥ ౧౮ "శక్యాలోభయితుంనాహమైశ్వర్యేణధనేనవా। అనన్యారాఘవేణాహంభాస్కరేణప్రభాయథా" అనియు, శ్లో॥ "యంత్వందేవినిరీక్షసేసశ్లాఘ్యస్సగుణీధన్యస్సకులీనస్సబుద్ధిమాన్"అ

---

డా? మహాస్థానే=గొప్పచోటగు, జనస్థానే=జనస్థానమునందు, రక్షస్సాంబలే=రాక్షససైన్యము, నిహతే=చంపఁబడఁగా, అశక్తేనత్వయా=ప్రతిక్రియసేయశక్తిలేనినీచేత, ఏతత్=ఈ, అసాధువై=అయోగ్యమయినపని, కృతం=చేయఁబడెను, భ్రాత్రోః=అన్నదమ్ములయిన రామలక్ష్మణులు, గోచరం = బయటిప్రదేశమును, గతయోః=పొందఁగా, నరసింహయోః=పురుషశ్రేష్ఠులగు, తయోః=వారలయొక్క, శూన్యం=లేమిగల, ఆశ్రమం=ఆశ్రమమును, ప్రవిశ్య=ప్రవేశించి, అధమ=ఓనీచుఁడా, త్వయా=నీచేత, అపనీతా=అపహరింపఁబడితిని, శార్దూలయోః=పులులయొక్క, గంధం=వాసనను, ఉపాఘ్రాయ=మూర్కొనిన, శునేవ=కుక్కవలె, రామలక్ష్మణయోః=రామలక్ష్మణులయొక్క, గంధముపాఘ్రాయ=వాసనమూర్కొని, సందర్శనే=చూపునందు—ఎదుట, స్థాతుం=నిలుచుటకు, నహిశక్యం=సాధ్యముకాదు. ౧౭. మే=నాయవియయి, లోకేభ్యః=లోకములనుండి, సంప్రమథ్య=చంపి, ఆహృతానివై=అపహరింపఁబడినవికలవో, భీరు=భయస్వభావముగలదానా, తాని=ఆరత్నములు, సర్వాణి=అన్నియు, తే=నీవి, ఏతత్=ఈ, రాజ్యంచ=రాజ్యమును, అహంచ=నేనును, తే = నీవారము. నానానగరమాలినీం = ఎల్లపట్టణములవరుసలుగలదియగు, ఇమాంచసర్వాంపృథివీం=ఈ భూమియంతయును, జనకాయ=నీతండ్రియయిన జనకునికి, ప్రదాస్యామి=ఇచ్చెదను. సుభ్రూ=ఓమంచికనుబొమలుగలదానా, యాని=ఏరత్నములు, వైశ్రవణే=కుబేరునివద్దనుండునో, (తాని=ఆ,) రత్నానిచ ధనానిచ=రత్నములను ధనములను,ఆన్నిటినిచ్చెదను. ౧౮. అహం=నేను, ఐశ్వర్యేణ=ప్రభుత్వముచేతను, ధనేనవా=ద్రవ్యముచేతను, లోభయితుం=వంచింపను, నశక్యా=సాధ్యపడుదాననుకాను, భాస్కరేణ=సూ

నియు, మహాధనము నెడఁబాయకుండెడునన్నా నాలుగుకాసులచే వశప
ఱచుకొనఁజూచెదవు. అని యుత్తరము చెప్పియు, శ్లో॥ ౨౦ "బహుమన్య
స్వమాం" అనియు, "మాంచభుఙ్క్ష్వయథాసుఖం" అనియు, నన్ను ఆద
రించికౌఁగిలించుకొనుమనియన్నందుకు॥ శ్లో॥ ౨౧ "ఉపధాయభుజంతస్య
లోకనాథస్యసత్కృతం।కథంనామోపధాస్యామిభుజమన్యస్యకస్యచిత్"
అనియు॥ ద్ర॥ "అణిమికుత్తామరైకర్వైయ్యోయందోవడిచ్చియోందలమిశై
నీయణియాయ్"అని యెల్లవారునుతలలపైవహింపఁదగిన లోకనాయకుఁ
డగు శ్రీరామునియొక్కమూఁపునందు తలయుంచిననేను వేఱొకతుచ్ఛుని
నంటుదునా? అని యుత్తరము చెప్పియు॥ శ్లో॥ ౨౨ "బహుమన్యస్వమాం"
అనియు, "నహివైదేహిరామస్త్వాంద్రష్టుంవాప్యుపలభ్యతే" అనియు,
"నచాపిమమహస్తాత్త్వాంప్రాప్తుమర్హతిరాఘవః" అనియు, నాచేతఁ
జిక్కుకొన్న నిన్ను శ్రీరాముఁడుచూడనైన సమీపింపనైనశక్తుఁడా? అని
నందుకు॥ శ్లో॥ ౨౩ "అపనేష్యతిమాంభర్తాత్వత్తశ్శీఘ్రమరిందమః। అసు
రేభ్యశ్శ్రియందీప్తాంవిష్ణుస్త్రిభిరివక్రమైః" అని, అసురాపహృతమగు శ్రీని

---

సూర్యునితోడ, ప్రభాయథా=కాంతివలె, రాఘవేణ=శ్రీరామునితోడ, అనన్యా=భి
న్నురాలనుగాను. దేవి=ఓరాణీ, యం=ఎవ్వనిని, నిరీక్ష్యసే=చూచెదవో?. సః=
వాఁడే, శ్లాఘ్యః=కొనియాడఁదగినవాఁడు, సః=వాఁడే, గుణీ = మంచిగుణము
లుగలవాఁడు, ధన్యః=కృతార్థుఁడు, సః=వాఁడే, కులీనః=సత్కులమునందుఁబుట్టి
నవాఁడు. సః=వాఁడే, బుద్ధిమాన్=బుద్ధిమంతుఁడు. ౨౦- మాం=నన్ను, బహుమన్య
స్వ=గౌరవింపుము. యథాసుఖం=సుఖముకలుగునట్లు, మాంచ=నన్ను, భుంక్ష్వ=
అనుభవింపుము. ౨౧- లోకనాథస్య=లోకములకు నాయకుఁడగు, తస్య=ఆరాము
నియొక్క, సత్కృతం=పూజితమగు, భుజం=బాహువును, ఉపధాయ=తలఁగడ
గాఁజేసికొని, అన్యస్యకస్యచిత్=ఇతరుఁడైన యొకానొకనియొక్క, భుజం=బా
హువును, కథంనామ=ఎట్లు, ఉపధాస్యామి=తలగడఁగాఁజేసికొందును. ౨౨-మాం-
నన్ను, బహుమన్యస్వ=బహుమానింపుము. వైదేహి=ఓజానకీ, రామః=శ్రీరాముఁ
డు, త్వా=నిన్ను, ద్రష్టుంవాపి=చూచుటకైనను, నహ్యుపలభ్యతే=లభించువాఁ
డుగాఁడు. త్వాం=నిన్ను, రాఘవః=రాముఁడు, మమహస్తాత్ = నాచేతినుండి,
ప్రాప్తుం=పొందుటకు, నచాప్యర్హతి=శక్తుఁడునుగానేరఁడు. ౨౩- అరిందమః=

మరలసంపాదించుకొన్నట్లు నీయెదుటనన్ను తీసికొనిపోఁబోవుచున్నాఁడు చూడుము, అనియుత్తరముచెప్పియు॥ శ్లో॥ ౨౪ "బుద్ధింమమానుపశ్య త్వంశ్రియంభద్రేయశశ్చమే" అని నాయొక్క యైశ్వర్య సంపత్కీర్తులను చూడుము, అనినందుకు॥ శ్లో॥ ౨౫ "సమృద్ధానివినశ్యంతిరాష్ట్రాణినగరాణిచ । తథేయంత్వాంసమాసాద్యలంకారత్నౌఘసంకులా । అపరాధాత్తవైకస్యనచిరాద్వినశిష్యతి" అని, నశించని యివియెల్లనునశింపఁబోవువిధమునుజూడుము అనియుత్తరముచెప్పియు॥ ౨౬ "నిక్షిప్తవిజయోరామో గతశ్రీర్వనగోచరః। వ్రతీస్థండిలశాయీచశంకేజీవతివానవా॥ అని భ్రష్టైశ్వర్యుఁడై సత్తగూడ ఉన్నదోలేదోయని సందేహించునట్లున్నాఁడనిచెప్పినందుకు॥ శ్లో॥ ౨౭ "క్షిప్రంతవసనాథోమేరామస్సౌమిత్రిణాసహ । తోయమల్పమివాదిత్యః ప్రాణానాదాస్యతేశరైః" అని యాతఁడు తనతమ్మునితోఁగూడవచ్చి నీయొక్క శిరశ్ఛేదముచేసి సుఖపడఁబోవుచున్నాఁడు.

---

శత్రులనణఁచువాఁడగు, భర్తా=నాపెనిమిటి, విష్ణుః=నారాయణుఁడు, త్రిభిఃక్రమైః = మూఁడడుగులచేత, దీప్తాంశ్రియం = ప్రకాశించుచున్నసంపదను, అసురేభ్యఇవ=రాక్షసులవలననుండి తీసికొన్నట్లు, త్వత్తః=నీవలననుండి, మాం = నన్ను, అపనేష్యతి=తీసికొనగలఁడు. ౨౪, భద్రే=ఓమంగళస్వరూపురాలా, త్వం-నీవు, మమ=నాయొక్క, బుద్ధిం=పూర్ణతను, శ్రియం=సంపదను,యశశ్చ=కీర్తిని, అనుపశ్య=చూడుము. ౨౫- సమృద్ధాని=పూర్ణములగు, రాష్ట్రాణి=రాజ్యములును, నగరాణిచ=పత్తనములును, వినశ్యంతి=నశించుచున్నవి, తథా=అట్లు, తవఏకస్యఅపరాధాత్=నీయొక్కరుని యపరాధముచేత, రత్నౌఘసంకులా=రత్నములరాసులచేనిండినదియగు, ఇయంలంకా=ఈలంకానగరము, త్వాంసమాసాద్య=నిన్నుఁజెంది, నచిరాత్=శీఘ్రముగ, వినశిష్యతి=నశింపఁగలదు. ౨౬- రామః=శ్రీరాముఁడు, నిక్షిప్తవిజయః=మిక్కిలితొలఁగింపఁబడిన గెలుపుగలవాఁడును,గతశ్రీః=పోయినశోభగలవాఁడును, వనగోచరః=అరణ్యమునకు విషయమయినవాఁడు—అడవిపాలయినవాఁడును,వ్రతీ=నియమములుగలవాఁడును, స్థండిలశాయీచ=భూమిమీఁదఁబరుండువాఁడునై, జీవతివానవాశంకే=బ్రతికియున్నాఁడో లేఁడోయని సందేహించెదను. ౨౭- సః=ఆ, నాథః = నాపెనిమిటియగు, రామః=రాముఁడు, సౌమిత్రిణాసహ=లక్ష్మణునితోఁగూడ, అల్పంతోయం=స్వల్పమగు

ఆవిధమునుజూడుమనిచెప్పఁగా॥ శ్లో॥ ౨౮ "నరామ స్తపసా దేవినబలేన నవిక్రమైః। నధనేనమయాతుల్య స్తేజసాయశసాపివా" అని భుజబలవిక్రమ ధన తేజోకీర్తులచేత నాకుసాటికానేరడు అనిచెప్పినందుకు॥ శ్లో॥ ౨౯ "వర్జయేద్వజ్రముత్సృష్టంవర్జయేదంతకశ్చిరం। త్వద్విధంనతుసంక్రుద్ధోలోకనాథస్సరాఘవః। రామస్యధనుషశ్శబ్దంశ్రోష్యసిత్వంమహాస్వనం। ఇషవోనిపతిష్యంతిరామలక్ష్మణలక్షణాః" అని శ్రీరాఘవులశౌర్యము నీవేమనితలంచితివి. వారియెదుటఁబడితివేని నిన్ను సజీవునిఁగావిడుతురా. నిన్నుఁజంపుటకు ఆతఁడుకావలయునా? ఆయనవింటి చిఱునారిమ్రోతవిని గుండెలు పగిలిచావక నీవుబ్రతికినఁగదా ఆయనరావలయును. ఆయనపేరిచేగుఱుతుపెట్టఁబడినవైన బాణములురావణునింజూపుచూపుమనియడుగుచున్నవిగదా? అనియుత్తరముచెప్పియు, ఇటువైననువీనిని దుష్కృత్యమునుండి తప్పింపవచ్చునాయని చూచుచున్నదియనియీసర్గముచేఁ జెప్పఁబడుచున్నది. మొదటిశ్లోకమునందు క్రూరుఁడయిన యీయల్పునిమాటలువిని తాను కొన్నిమాటలుచెప్పెననియు, రెండవశ్లోకమునందు ఆమెచెప్పినది॥ శ్లో॥ ౩౦

---

జలమును, ఆదిత్యఇవ=సూర్యుఁడుపీల్చుకొనునట్లు, తవ=నీయొక్క, ప్రాణాన్=ప్రాణములను, శరైః=బాణములచేత, ఆదాస్యతే=తీసికొనఁగలఁడు. ౨౮- దేవి=ఓజానకీ, రామః=శ్రీరాముఁడు, తపసా=తపస్సుచేతను, మయా=నాతోడ, నతుల్యః-సమానుఁడుకాఁడు. బలేన-బలముచేతను,నతుల్యః,విక్రమైః-పరాక్రమవ్యాపారములచేతను,నతుల్యః-ధనేన-ద్రవ్యముచే,నతుల్యః-తేజసా-తేజస్సుచేత,నతుల్యః-యశసాపివా-యశస్సుచేతను,నతుల్యః-సమానుఁడుగాడు. ఉత్సృష్టం-విడవఁబడిన, వజ్రం=వజ్రాయుధము, వర్జయేత్=నీవంటివానినిజంపకవిడిచినను విడుచును. అంతకః=యముఁడు, చిరం = బహుకాలము, వర్జయేత్ = విడిచిననువిడుచును, లోకనాథః=లోకములకుప్రభువగు, సః=ఆ, రాఘవః=రఘురాముఁడు, సంక్రుద్ధః-కోపించుకొన్నవాఁడయ్యేనేని, త్వద్విధంతు-నీవంటివానిని, నవర్జయేత్-విడుపఁడు. మహాస్వనం=అధికధ్వనికలదియగు, రామస్య=రామునియొక్క, ధనుషశ్శబ్దం=వింటియొక్కటంకారధ్వనిని,శ్రోష్యసి-నీవువినఁగలవు,రామలక్ష్మణలక్షణాః-రామలక్ష్మణులగుఱుతులుగలవియగు, ఇషవః=బాణములు, నిపతిష్యంతి=నీమీఁదఁబడఁగలవు. ౩౦- పతిరేకః=భర్తయొక్కఁడే, సదా=ఎల్లప్పుడు, గతిః=దిక్కు. గతిః=దిక్కు.

"పతిరేకోగతిస్సదా" అనియు॥ ద్ర॥ "గతిమ్యెన్నుందానావాక్" అనియు, సమస్తావస్థలయందును రక్షించెడివాఁడు శ్రీరాముఁడుగాన నీవిట్లుపదరి పలుపాట్లుపడక నిన్నురక్షించుకొనుము అనియెననియు, ఈశ్లోకముచేత ఆతఁడుదూరస్థుఁడు. తన్నురక్షించునంతవఱకు హితముచెప్పి వీనిప్రయత్నమును మానుపవచ్చును అనుతలంపుచేత అక్కడనున్నగడ్డిపరక నొకదానినిముందు వేసి నావలననుండి నీ హృదయమునుమరలించుకొని నీకుఁదగిన స్త్రీలతోకలసిమెలసి వర్తింపయత్నింపుము. అనుచున్నదియనిభావము. (తృణమంతరతఃకృత్వాప్రత్యువాచ) మాటలాడునప్పుడు ఒకకసవుపుల్లనుముందుఁబడవేసిచెప్పెను. మాటలాడువారలకెల్ల నుఅంగముకాదే యిట్లుపుల్లగిల్లి వేయుట. ఇందుకువాసనయేమనఁగా॥ శ్లో॥ ౩౧ "ఆసనంచాన్నముదకందేయమితి" అన్నట్లు, రాజులకుపీఁటవేయుట అన్నోదకము లిచ్చుటయుచితముగనుక అందులకుబదులుతృణమునిడి యుపచరించినయెడల ప్రసన్నుఁడై నివర్తించునోయనుశంకచేతను॥ శ్లో॥ ౩౨ "అభావేభూమిరుదకంతృణాని" అనుమర్యాదచేత నాసనమిడెననిచెప్పనగును. (తృణమంతరతఃకృత్వా) శ్లో ॥౩౩ "ఋజుప్రణామక్రియయైవతన్వీప్రత్యాదిదేశ" అన్నట్లు తనహృదయముననుండెడి యభిప్రాయమునకన్యముగ నుపచరించినయెడల నీమెవిరక్తయని నిరాశుఁడగునోయేమోయనియెడితలంపుచేతనైననట్లుచేసెననిచెప్పవచ్చును. లేక (తృణమంతరతఃకృత్వా) శ్లో॥ ౩౪ "సమీపముపసంక్రాంతం" అన్నట్లు, దగ్గఱరానియ్యక రావణుఁడాసన్నుఁడై వచ్చుటచే వ్యవధానముకావలయునని॥ శ్లో॥ ౩౫ "స్తంబేనసలిలేనవా

ఎన్నుం=ఎప్పుడును, తాక్=తాను, ఆవాక్=అగును. ౩౧- ఆసనం=పీఁటయు, అన్నంచ=అన్నమును, ఉదకం=నీరును, దేయం=ఇయ్యఁదగినవి. ౩౨- అభావే=ఆసనములేనియెడల, భూమిః=నేల, ఉదకం=జలము, తృణాని=తృణములు. ౩౩- తన్వీ=ఇందుమతీదేవి, ఋజుప్రణామక్రియయైవ=కౌటిల్యములేని నమస్కారరూపమగుకార్యముచేతనే, ప్రత్యాదిదేశ=అత్తగారగు సుదక్షిణచెప్పినయర్థమును తిరస్కరించెను. ౩౪- సమీపముపసంక్రాంతం=దగ్గరకువచ్చినట్టి. ౩౫- స్తంబేన=గడ్డిదుబ్బుచేత, అనఁగా. తృణముచేతనైనను, సలిలేనవా=నీళ్లచేతనైను, పఙ్క్తిభేదః=

క్తి:- భేదోభిజాయతే" అనియెడిన్యాయముచేత నొకపుడకనునడుమనుంచె సనియుభావము. లేక. (తృణమంతరతఃకృత్వా) వ॥ "నపరముఖనిరీక్షణం నాపిసంభాషణం" అన్నట్లు, స్త్రీలకుఁబరపురుషనిరీక్షణమును పరులతో. మాటలాడుటయు గూడనివగుటచేత తృణమునుముందువేసి దానివ్యాజీ కరించి వానినుపశ్రోతఁగాఁజేయుట కట్లొర్చెనని తాత్పర్యము. లేక (తృణ మంతరతఃకృత్వా) శ్లో॥ ౩౬ "పథ్యముక్తంవిచక్షణైః" "రాక్షసానామ భావాయత్వంవానప్రతిపద్యసే" అని మిక్కిలిహితమునుగొరువారగు అ కంపనమారీచమాల్యవత్ప్రముఖులు చెప్పినమాటలువిన్నవాఁడవుకావు. ఇ ప్పుడును ఈగడ్డిపుడుకప్రతిపత్తిచేయునట్లే నీవు ప్రతిపత్తిచేయుదువు. అని శ్లో॥ ౩౭ "నిదర్శనమసారాణాంలఘుర్బహుతృణంనరః" అన్నట్లు, దృ ష్టాంతీకరించివేసెననియైననుహృదయము. లేక-(తృణమంతరతఃకృత్వా) తాఁజెప్పఁగలయరుదగునర్థములకుఁబ్రతిపత్తకావలయుననె॥ శ్లో॥ "సకులీ నస్సబుద్ధిమాన్" అనియుండుటంజేసి, తాఁగటాక్షించినవియెల్లను బుద్ధి యుక్తములగునుగాన ప్రతికూలింపనితృణమును సచైతన్యముగఁజేయుచ మనుతలంపుచేతనైన నట్లుచేసెననియెఱుంగవలయును. లేక - (తృణమం తరతఃకృత్వా) తృణమునుచేతనముగఁజేసి స్వశక్తినారోపించితిమేని యీ వైభవముచేతభీతుఁడై నివర్తించునేమోయనుతలంపుచేత నట్లుచేసెనని యుతలంపనగును. లేక - ( తృణమంతరతఃకృత్వా ) అజ్ఞుఁడవైయుండెడి నిన్ను॥ శ్లో॥ ౩౮ "తృణమివలఘుమేనె" అన్నట్లు. ఈతృణముతోసమాన ముగఁ దలఁచియున్నానని తెలుపుట కట్లుచేసెననియైన ననుకొనవచ్చు ను. లేక - (తృణమంతరతఃకృత్వా) అనునది, హృదయేకృత్వాఅనునట్లు,

పక్షిభేదము, అభిజాయతే=కలుగుచున్నది. ౩౬- విచక్షణైః=సమర్థులచేత, పథ్యం =ధర్మమార్గమునుండి తొలఁగనిదయినహితము, ఉక్తం=చెప్పఁబడెను. రాక్షసా నాం=రాక్షసులయొక్క, అభావాయ-లేమికి, త్వం-నీవు, నప్రతిపద్యసేవా-యత్నిం చినవాఁడవుకావా?, ౩౭- నరః-మనుష్యునికి, అసారాణాం-సారములేనివస్తువుల లో, బహు-విస్తారముగ, లఘుః - లాఘవముగలదియగు, తృణం-గడ్డిపోచ, నిదర్శ నం-దృష్టాంతము. ౩౮- తృణమివ-గడ్డిపోఁచవలె, లఘు-చులకనఁగా, మే నే-తలం

ప్రతికూలాచరణము సేయకుండుటవలన నంతమాత్రముచేత నే తృణమును హితమనితలంచి॥ శ్లో॥ ౩౯ "నత్వాతృణత్వంమన్యే" "నత్వాతృణాయ మన్యే" అనువిధముగనిన్ను నీతృణమునకు సాటిగాఁగూడఁదలంపను అని రావణుని కెటెంగింపనట్లు వేసెనని తలంపనగును. లేక - (తృణమంతరతః కృత్వా) అజ్ఞుఁడవై యుండెడినీవు॥ శ్లో॥ ౪౦ "జ్ఞానేనహీనఃపశుభిస్సమానః" అనియుండుటవలన, ఈగడ్డినితి నెడిపశువుగదా? అనినైనను అట్లు చేసెననియూహింపనగును. లేక - (తృణమంతరతఃకృత్వా) శ్లో॥ "త్వం నీచశశవత్స్మృతః" అని, శ్లో॥ ౪౧ "యదంతరంసింహస్సృగాలయోర్వనే" అనియు, తిర్యగ్జాతీయుఁడగు నీకుభోగ్యముగడ్డిగదా? శ్లో॥ "నాహమాపయికీభార్యాపరభార్యాసతీతవ" అని నేనుకాదుభోగ్యను. అని తెల్పుటకు వేసెననినైననను కొనగును. లేక - ( తృణమంతరతఃకృత్వా ) శ్లో॥ ౪౨ "విచిత్రాణిచమాల్యానిచందనాన్యగరూణిచ ; వివిధానిచవాసాంసి దివ్యాన్యాభరణానిచ ! యానివైశ్రవణేసుభ్రురత్నానిచధనానిచ " అని నీవు దొంతరలుపెట్టినవానినన్నిటిని ఈతృణముతోసమానములుగఁదలంచి యున్నదానను అని తెలుపుటకై యట్లుచేసెననినైనఁజెప్పవచ్చును. లేక- (తృణమంతరతఃకృత్వా) శ్లో॥ ౪౩ "ధారయత్యాత్మనోదేహంతత్సమాగమకాంక్షిణీ" అన్నట్లు, ఆతఁడువచ్చునే మోయనియెడిప్రత్యాశచేతనుంటిని. అంతేకాక॥ శ్లో॥ ౪౪ "ఉద్బధ్యవేణ్యుద్గ్రథనేనశీఘ్రమహంగమిష్యా

---

చెను. ౩౯- నత్వాతృణత్వంమన్యే-నత్వాతృణాయమన్యే - నిన్నుగడ్డిపోఁచకుసమానముగఁగూడఁ దలఁపను. ౪౦. జ్ఞానేనహీనః - తెలివిలేనివాఁడు, పశుభిః-చతుష్పాత్తులతో, సమానః-సమానుఁడు. ౪౧-సింహస్సృగాలయోః-సింగమునకునునక్కకును, వనే-అడవియందు, యదంతరం=ఎట్టివాసికలదో, ౪౨- సుభ్రు- మంచికనుబొమలదానా, విచిత్రాణి-వింతలగు, మాల్యాని-పూలమాలికలును, చందనాని-మంచిగంధములును, అగరూణిచ-అగరుగంధములును, వివిధాని-నానావిధములగు, వాసాంసిచ-వస్త్రములును, దివ్యాని-దేవసంబంధములగు, ఆభరణానిచ-సొమ్ములును, వైశ్రవణే-కుబేరునియందుఁబడి, యాని-ఏ. రత్నాచధనానిచ-రత్నములును ధనములునుగలవో- ౪౩-తత్సమాగమకాంక్షిణీ=ఆరామునియొక్కరాకనుగోరినదియై, ఆత్మనః=తనయొక్క, దేహం-శరీరమును, ధారయతి=ధరించుచున్నది. ౪౪. వేణ్యుద్గ్రథ

మియమస్యమూలం" అనియు, శ్లో॥ "తృణంశూరస్యజీవితం" అన్న ట్లు, తృణమువలె ప్రాణములలోసత్తలేదు చచ్చిపోఁబోవుచున్నాను. అని యట్లుచేసెననియైనను జెప్పవచ్చును. లేక - (తృణ) లంకారత్నాఘసంకు లా। అపరాధాత్తవైకస్యనచిరాద్వినశిష్యతి" అని నీయపరాధముచేత లంకనశింపఁబోవుచున్నది. అప్పటికి ఈతృణములనుప్రోగుచేసికొని యొక గుడిసె వేసికొందునని తెలుపుటకై యట్లువేసెనని చెప్పనగును. లేక-(తృణ) తృణోపలన్యాయముచేత సామాన్యవిశేషకార్యముల నుపదేశించుచున్నా నని తెల్పను. లేక - (తృణ) నీయుపదేశము ఆతఁడునాతప్పులనుక్షమించి నంగదాయుక్తమగును అని రావణుని తాత్పర్యముగాఁదలంచి యీగడ్డి పోఁచ సముద్రమునందువైచితిమేని ఇది యెట్లుపేరుపడదో అట్లు నీవానర్చి నయపకారములు అయనహృదయమునఁబేరాకానవు॥ శ్లో॥ ౪౫ "నస్మ రత్యపకారాణాంశతమప్యాత్మవత్తయా" అన్నట్లు, తప్పులెఱుఁగనిధర్మ ప్రభువుగదా యాతఁడుఅనుతలంపుతోనట్లొనర్చె. లేక-తృణ†నడుమనుం డెడుతృణమునువ్రత్తివేసె. ఇట్లే॥ శ్లో॥ ౪౬ "ఈర్ష్యారోషౌబహిష్కృత్య" అన్నట్లు, హృదయముననుండెడి రోషాదులనుపోవిడిచి రామునాశ్రయిం పుమీయని తెల్పుటకట్లొనర్చె. లేక-(తృణ)శ్లో॥* "మిత్రమౌపయికంకర్తుం రామస్థానంపరీప్సతా। వధంచానిచ్ఛతాఘోరం" అని, నీకాఁపురమును నీప్రాణములనుగావలసియుండెడవేని ఈగడ్డిపోఁచనుకవ్వుకొని యాపురుష సింహునిపాదములపైఁబడుము. అని తెల్పుటకు వేసెననియనవచ్చును. లేక-(తృణ) ఈగడ్డిపోచకంబముగాఁజేసి యాకంబమువలననుండి రాఘవసిం హమునుబయలుపఱచి చెడుగులుతలంచెడిహృదయమును చీల్పింపవలయు నని యెడితలంపుచే నట్లుచేసెననియైనఁజెప్పనొప్పును. లేక-(తృణ) తృణ

---

ధనేనోద్భృత్య - జడనురిత్రాడుగఁగట్టుకొని, అహం-నేను, యమస్య - యమునియొ క్క, మూలం-స్థానమునకు, గమిష్యామి-పోగలను. శూరస్య-శూరునికి, జీవితం=ప్రా ణము, తృణం=తృణముతోసమానము. ౪౫- ఆత్మవత్తయా = గంభీరుఁడగుటచే త, అపకారాణాంశతమపి=అనేకాపకారములుచేసినను, నస్మరతి=స్మరింపఁడు. ౪౬, ఈర్ష్యారోషౌ=ఓర్వలేనితనమును కోపములను, బహిష్కృత్య=వెలుపలికిఁ

లోష్ఠాదులనుముందుగాఁబడవేసి ప్రతిజ్ఞసేయవలయుఁగదా? ఆమర్యాదచే గడ్డిపోఁచముందుగవేసి॥ శ్లో॥ "క్షిప్రంతవసనాథో మేరామస్సౌమిత్రిణాసహ। తోయమల్పమివాదిత్యః ప్రాణానాదాస్యతేశరైః" అని నీప్రాణములను బాణములు వేసిపొడిచి గ్రుచ్చియెత్తఁబోవువిధమునుజూతువుగాకయని ప్రతిజ్ఞ చేయుచున్నదియనియైనను జెప్పనగును. లేక-(తృణ) శ్లో॥ "నచాపిమముపహస్తాత్త్వాంప్రాప్తుమర్హతి రాఘవః"అన్న, నీయెదుట నేకనఁబడి॥శ్లో॥ "ఆపనేష్యతిమాంభర్తాత్వత్తశ్శీఘ్రమరిందమః"అని,నీతల ద్రుంపఁబోవువిధమునుబూడుము అని చెప్పుచున్నదియనియనవచ్చును. లేక. (తృణ) శ్లో॥ ౪౭ "విప్రపీడాకరంఛేద్యమంగమబ్రాహ్మణస్యతు" అని శాస్త్రముచెల్పుటచేత॥ శ్లో॥ ౪౮ "భృంగారధారారోద్ధుశ్శుక్రస్యాక్షిసదక్షిణం। పవిత్రస్యశిరోగ్రేణక్షోభయామాసవామనః"అని॥ద్ర॥ "శుక్కిరక్కణ్ణైతురుంబాల్కిళరియ" అనియు చెప్పఁబడినట్లుతృణముచేత శుక్రునికన్నులుపొడిచినట్లు॥ శ్లో॥ "యద్యత్పశ్యామి తేగాత్రంశీతాంశుసదృశాననే। తస్మిన్ తస్మిన్ పృథుశ్రోణిచక్షుర్మమనిబధ్యతే" అని పరదారదర్శనముచేసిన నీకన్నుల నీతృణముచేఁబొడిచెదను అని చెప్పుచున్నదనియైనను చెప్పఁగూడును. లేక - (తృణ) శ్లో॥ ౪౯ "సదర్భంసంస్తరాద్గృహ్యహీనస్త్రీస్మసదక్షిణం" అన్నట్లు, దర్భనుగొని దయావిహీనుఁడగు కాకాసురుని కన్నులులేనివానిఁగాఁజేసినట్లు, ఈగడ్డిపోఁచఁగొని నీకన్నులను బొడిపించెదను అనియైచెనఃనైయైననుగ్రహింపవచ్చును. లేక - (తృణ)సర

---

ప్రోసి, ※ ఈశ్లోకమునకు మీఁదట అర్థము వ్రాయఁబడియున్నది. ౪౭- అబ్రాహ్మణస్య=బ్రాహ్మణుఁడుకానివానియొక్క, విప్రపీడాకరం=బ్రాహ్మణులకు బాధకరమగు, అంగం=అవయవము, ఛేద్యం=కోసివేయఁదగినది. ౪౮- సః=ఆ,వామనః-వామనమూర్తి, భృంగార=జారీచెంబుయొక్క, ధారా=నీటిధారలకు, రోద్ధుః = అడ్డపడినట్టి, శుక్రస్య=శుక్రునియొక్క, (కంటిని) పవిత్రస్య = పవిత్రముయొక్క, శిరోగ్రేణ=మీఁదికొనచేత, క్షోభయామాస=కలఁతనొందించెను. శుక్కిరక్ = శుక్రునియొక్క, కణ్ణై=కంటిని, తురుంబాల్ = పుడకచేత, కళరియ=కలియఁబెట్టిన. ౪౯-సః=ఆశ్రీరాముఁడు,సంస్తరాత్=ఆసనమునుండి,దర్భంగృహ్య=దర్భనుగొని,

నారాయణులలో నారాయణుఁడుఇషీకచే దంభోద్భవునింజంపినవిధమున నీగడ్డిపోఁచచే నిన్నుఁజంపించెదను అనివేసెననియుఁజెప్పఁగూడును. లేక-తృణ) ౫౦ "సీతాయాస్తేజసాదగ్ధః" అని, "నత్వాకుర్మిదశగ్రీవభస్మభస్మార్హతేజసా" అని, నాపాతివ్రత్యతేజస్సులోన నీగడ్డిపోఁచవేసిరగిల్చి నిన్నుదహించెదను అనివేసెననియైనఁజెప్పనొప్పును. లేక-(తృణ)"కృతిచ్ఛేదనే" అనిధాతువుగాన అక్కడనుండెడి గడ్డిపోఁచనునడుమత్రుంచివైచి, అట్లే॥ ౫౧ "అంగుళ్యగ్రేణతాన్హన్యాం" అనియు, ద్ర॥ "పొల్లావరక్కనైక్కిల్లిక్కిళండానై" అనియుచెప్పినట్లు, నీతలనుత్రుంచివేయునట్లొనర్చెదనని తెలుపుటకు తృణమునుద్రుంచివేసెననియు చెప్పనొప్పగును. అయినను ఇట్లుతృణముఁద్రుంచివైచి మీఁదటఁజేసినదేమనఁగా (ప్రత్యువాచ) ప్రతివచనమిచ్చెను. (ప్రత్యువాచ) అడిగినందుకుప్రత్యుత్తరముచెప్పెను. వాడుచెప్పినమాటలకుసమ్మతించి ఓం అనిచెప్పినను ఉత్తరమేయగును. అట్లోయనఁగా. (ప్రత్యువాచ) ప్రత్యాఖ్యానముచేసెను. వాఁడుచెప్పినందుకువిరోధముగఁజెప్పెను. అనఁగా॥ శ్లో॥ "నాహమౌపయికీభార్యా" అనియు ౫౨ "నమాంప్రార్థయితుంశక్తస్త్వంసిద్ధిమివపాపకృత్" "అకార్యంనమయాకార్యం" అని, ప్రతిషేధించిచెప్పెను. (ప్రత్యువాచ) నిషేధించుటమాత్రమేగాక ప్రతికూలముగనేచెప్పెను.ఎట్లనఁగా, "ప్రాణానాదాస్యతేశరైః" అనియు, ౫౩ "రాక్షసేంద్రమహాసర్పాన్సరామగరుడోమహాన్॥ ఉద్ధరిష్యతివేగేన" అని, ఆతనికిపరుషము

---

౫౦=కుడికంటిని, హినస్తిస్మ=హింసించెను. ౫౦- సీతాయాః=సీతాదేవియొక్క, తేజసా=తేజస్సుచేత, దగ్ధః=కాల్పఁబడినవాఁడు. దశగ్రీవ=ఓరావణా, భస్మార్హతేజసా=భస్మముచేయుటకుఁదగిన తేజస్సుచేత, త్వాం=నిన్ను, భస్మ = బూడిదగా, నకుర్మి=చేయను. ౫౧- తాన్=ఆరాక్షసులను,అంగుళ్యగ్రేణ=కొనవ్రేలితో, హన్యాం=చంపుదును. ౫౨- త్వం=నీవు, సిద్ధిం=తపస్సిద్ధిని, పాపకృదివ=పాపముచేసినవానివలె, మాం = నన్ను, ప్రార్థయితుం = కోరుటకు, శక్తః = నశక్తుఁడవుకావు. మయా=నాచేత, అకార్యం=చెడ్డపని, నకార్యం=చేయఁదగదు.౫౩- సః=ఆ,మహాన్=గొప్పవాఁడగు,రామగరుడః=శ్రీరాముడనియెడి గరుత్మంతుఁడు,

గా నేయుత్తరముచెప్పెను. (ఉవాచ) వచపరిభాషణే. అనిధాతువుఅగు టచే ఒకమాటచెప్పుటయేకాదు, పరితః పలువిధములుగమాటలాడెను. అదెట్లనఁగా, "సాధుధర్మమవేక్షస్వసాధుసాధువ్రతంచర" అనియు, "యథాతవతథాన్యేషాందారారక్ష్యానిశాచర" అనియు, ఓర్పుమాటలు చెప్పి ౫౮ "ఏవంత్వాంపాపకర్మాణంవక్ష్యంతినికృతాజనాః" అని, "దిష్ట్యైతద్వ్యసనంప్రాప్తోరౌద్రఇత్యేవహర్షితాః" అనియు హృదయ భేదకములుగాఁజెప్పియు ౫౫ "మాంచాస్మైప్రయతోభూత్వానిర్యాత యితుమర్హసి॥ విదితస్సహిధర్మజ్ఞశ్శరణాగతవత్సలః, తేనమైత్రీభవతు" అని జ్ఞానదానమొనరించియు, ౫౬ "అన్యథాత్వంహికుర్వాణోవధం ప్రాప్స్యసి" అనియు, "ప్రాణానాదాస్యతేశరైః" అనియు, దండనీతిని బోధించియు ఇట్లు సామదానభేదదండరూపములగు చతురుపాయముల చేతనుజెప్పెను. ఇట్లు కెరవిచెప్పెడుకాలమునందు ముఖవికాసమెట్లుండె ననఁగా (శుచిస్మితా) ఎదుటివాఁడుకినిసినఁగదా సంరంభముతోప్రవర్తిం పవలయును. తనయనీతిచేత తనకుఁదానేనశింపఁబోవునట్టి వీఁడు ఇట్లు చెప్పుచున్నాఁడేయనినవ్వెను. (శుచిస్మితా) ౫౭ "హసన్నివనృపోహంతి"

రాక్షసేంద్ర=రాక్షసనాయకులనియెడి, మహాసర్పాన్=గొప్పపాములను, వేగేన= వడితో, ఉద్ధరిష్యతి = పెకలింపఁగలఁడు. ౫౪- నికృతాఃజనాః = నీవలన వం చింపఁబడిన జనులు, త్వాం=నిన్ను, ఏవం=ఇట్లు, పాపకర్మాణం=పాపపుఁబనులు చేయువాఁడని, వక్ష్యంతి=చెప్పగలరు. రౌద్రః=భయంకరుఁడవగు నీవు, దిష్ట్యా- దైవవశముగ, ఏతత్ వ్యసనం=ఈచావఁబోవుదుఃఖమును, ప్రాప్తః=పొందినవాఁ డవు, ఇత్యేవ=అనియే, హర్షితాః = సంతుష్టులయిరి. ౫౫- ప్రయతఃభూత్వా= ప్రయత్నమొనర్చినవాఁడవై, మాంచ=నన్ను, అస్మై=ఈరామునికై, నిర్యాతయి తుమర్హసి=ఈలంకలోనుండి వెడలింపఁదగినవాఁడవు, సః = ఆరాముఁడు, ధర్మ జ్ఞః=ధర్మమునెఱిఁగినవాఁడు, శరణాగతవత్సలః=శరణుచొచ్చినవారియందుఁప్రే మగలవాఁడు, తేన=అట్టిరామునితో, తే=నీకు, మైత్రీ=స్నేహము, భవతు=అగుఁ గాత. ౫౬- త్వం=నీవు, అన్యథా=వేఱువిధముగ, కుర్వాణః = చేయుచు, వధం ప్రాప్స్యసి=వధమునుపొందుదువు- శరైః=బాణములచేత, ప్రాణాన్=ప్రాణము లను, ఆదాస్యతే=తీసికొనఁగలఁడు. ౫౭- నృపః=రాజు, హసన్నివ=నవ్వుచునే

అన్నట్లు, రాజులునవ్వుచున్నవారివలెనేకనంబడుచుంగదా తప్పిదమొనరిం
చినవారిని శిక్షింతురు. అట్లు ఈమెయు "అభిజ్ఞారాజధర్మాణాం"
అని, రాజమర్యాదనెఱింగినదియు రాజపుత్రియు రాజమహిషియునయి
గదాయున్నది. వాఁడిచ్చెదనన్న ధనధాన్యరత్నాదులనువిని స్త్రీచాపల్య
ముచేతసమ్మతించి నవ్వెనాయేమియనంగా (శుచిస్మితా) † అప్లునవ్వుట
అర్థచాపల్యనిబంధనముగాదు. వైరాగ్యనిబంధనము అనియెడిభావశుద్ధిన
వ్వునట్టివిధములోనేచూడఁదగియున్నది.(శుచిస్మితా) "ఆశ్రమంతుతయో
శ్శూన్యంప్రవిశ్యనరసింహయోః। గోచరంగతయోర్భ్రాత్రోరపనీతా
త్వయాధమ" అని యాధీరులయెదుటనిలిచి వారలతోఁబోరాడిజయించి
నన్నుఁజెఱఁబట్టలేని యబలుఁడవుసుమా॥ శ్లో॥ "నరామస్తపసాదేవినబ
లేననవిక్రమైః, నధనేనమయాతుల్యః" అని, శ్రీరాముని నేనుజయింపఁగల
ననియనుచున్నాఁడనినవ్వెను, (శుచిస్మితా) వధంప్రాప్స్యసియని గ్రద్దలు
కాకులును ముకుకులతోఁబొడిచియీడువఁగాఁ బడియుండఁబోవువాఁడు
సుమా? "శంకేజీవతివానహి" అని, శ్రీరామునిశరీరమునకు అనిష్టము
చెప్పుచున్నాఁడనినవ్వెను. (శుచిస్మితా) శ్లో॥ ౫౮ "విభీషణవిధేయంహి
లంకైశ్వర్యమిదంకృతం॥ శ్రీమతా రాజరాజేన లంకాయామభిషేచితః"
అన్నట్లు, విభీషణునికి శ్రీరాముఁడిచ్చినయైశ్వర్యము నేసుమీ॥ శ్లో॥ "బుద్ధిం
మమానుపశ్యత్వంశ్రియంభద్రే" అని తనదనిభ్రమించిజల్పించుచున్నాఁడు
అనినవ్వెను.(శుచిస్మితా) "ఉపధాయభుజంతస్యలోకనాథస్యసత్కృతం।
కథన్నామోపధాస్యామి" అనియుండునట్టినన్నుసుమా యీపాతకుఁడు
"మాంచభుఙ్క్ష్వయథాసుఖం" అని మొఱుగుచున్నాఁడు. (శుచిస్మితా)
శ్లో॥ ౫౯ "కుశలీయదికాకుత్థ్సః కిన్నుసాగరమేఖలాం, మహీందహాతి"

హాంతి=చంపుచున్నాఁడు ౫౮. ఇదం=ఈ, లంకైశ్వర్యం=లంకయొక్క ప్రభుత్వ
ము, విభీషణవిధేయంహికృతం=విభీషణునికి స్వాధీనముగాఁగదా చేయఁబడెను.
శ్రీమతా=పూజ్యుఁడగు, రాజరాజేన=రాజరాజగు శ్రీరామునిచేతను, లంకాయాం
=లంకయందు, అభిషేచితః=అభిషేకముసేయఁబడెను. విభీషణుఁడు). ౫౯- కా

† ఈయోజనయందు పరిశుద్ధమగు నవ్వుగలదియనియర్థము.

అన్నట్లు, శ్రీరాముఁడుగుఱుతుచెడకుండఁగానే నేను ఈస్థితిలోనుండు
దునని "తతస్సావ్రీమతివలె" వ్రీడాస్మితముచేసెను. లేక - (శుచి) ౬౦
"తతోమలినసంవీతాం" అనియు॥ ద్ర॥ "మాశుడైయుడంబొడుతలైయు
తరివాయిపురంవెళుత్తు " అని, విరహావిషణ్ణయై తాంబూలచర్వణముసే
యనందున స్మితముచేయఁగా దెల్లనిపలువరుసకాంతి బయలుపడెను.అట్టి
స్మితముగలదియనిభావము. లేక - (శుచిస్మితా) సీతాదేవినపహరించెనని
విన్నప్పుడే॥ శ్లో॥ ౬౧ "కృతంకార్యమితిశ్రీమాన్ వ్యాజహారపితామహః"
అన్నట్లు, ఇఁకరావణుఁడుచచ్చినవాఁడేయని బ్రహ్మసంతోషించినరీతి నీ
మెయు నీతఁడపరాధముచేసినప్పుడేచచ్చెనని ప్రీతిస్మితముచేసెననియుచె
ప్పనగును. ఇట్లుస్మితముచేసిచెప్పినదేమనఁగా (నివర్తయేత్యాది)అకృత్య
ములనువదలి కృత్యములనుచేయుమనుచున్నది. (నివర్తయమనః) మనో
వ్యాపారమాత్రాధీనముకదా అట్లగుటచే హృదయమునుమరల్పుము.అను
చున్నది. (మనోనివర్తయ) మంచిగుఱ్ఱపురౌతులు వేగముగఁబోవుచున్న
గుఱ్ఱమును కశాభిఘాతముతోనిల్పునట్లు మనఃప్రవాహమును నివర్తింపఁ
జూడుము. (మనోనివర్తయ) శ్లో॥ ౬౨ "మనోహిహేతుస్సర్వేషామిం
ద్రియాణాంప్రవర్తనే" అన్నట్లు, మూలభూతమగు మనస్సునుత్రిప్పఁగా
నే బాహ్యేంద్రియములనుతిరుగునుసుమా? (నివర్తయమనః) నీహృదయ
మునుమరలించి ప్రాణములనుమరలించుకొమ్ము. (నివర్తయమనః) శ్లో॥

---

కుత్స్థః-శ్రీరాముఁడు, కుశలీయది-క్షేమముగలవాఁడయినను—బ్రతికియున్నవాఁడ
యినను, సాగరమేఖలాం-సముద్రపర్యంతమగు, మహీం-భూమిని, దహతికిన్ను-కా
ల్చుచున్నాఁడా. ౬౦. మలినసంవీతాం-మురికిగప్పిన దేహముగలసీతను, తతః-అనం
తరము. మాశుడై-మాసినట్టి, ఉడంబొడు-దేహముతో, తలైయుదరి-తలవిరియఁబో
సికొని, వాయిపురం-అధరోష్ఠము, వెళుత్తు-తెల్లనై.

౬౧-శ్రీమాన్ పితామహః-పూజ్యుఁడగుబ్రహ్మ, కృతంకార్యమితి - కార్యము
ముగిసెనని, వ్యాజహార-చెప్పెను. ౬౨- సర్వేషామింద్రియాణాం-సమస్తేంద్రియము
లును, ప్రవర్తనే-ప్రవర్తించుటయందు, మనోహిహేతుః-మనస్సేహేతువుగదా.

౬౩ "ఆత్మైవహ్యాత్మనోబంధురాత్మైవరిపురాత్మనః" అన్నట్లు, నిత్యశత్రువునుజయింపఁజూడుము. (మనోనివర్తయ) లోకమున వేగవంతములగుపదార్థములకు మనోజవమనిదృష్టాంతముచెప్పనొప్పి మిగులవేగముఁగాఁగదాయుండును. చేయిజాఱెనేనిమరలింపఁగూడదు. కరణాధిపుఁడైన నీవు మరలింపఁజూడుము. శ్లో॥ ౬౪ "మమత్వశ్వానివృత్తస్యనప్రావర్తంతవర్త్మని" అని యశ్వహృదయమెఱిఁగిన సుమంత్రుఁడుతప్పుచెప్పెనుగదా? ఉండెడురాజకార్యములు ఒడుదుడుకగునట్లు మనఃప్రవృత్తిని నివర్తింపనగునాయనఁగా (మత్తోనివర్తయ) ఇతరములవలననుండినివర్తింపుమనలేదు. నావలననుండిమరలింపుము. (మత్తోనివర్తయ) శ్లో॥ ౬౫ "పంచాస్యామివపన్నగీం" అన్నట్లు, విషవంతములగుపదార్థములవలె నీకువినాశహేతువగునావలననుండిమరల్పుము. (మత్తోనివర్తయ) శ్లో॥ † "నయంతినికృతిప్రజ్ఞంపరదారాఃపరాభవం" అన్నట్లు, ఏవిధినైనను పరాభవాపాదనశీలురైకదాపరదారలుండుదురు. అట్లగుటచేనాప్రకటనుండి నీచిత్తమునుమరల్పుము. నీప్రకటనుండిమరల్చితినేని మనస్సునిర్విషయమై యుండునామేమియనఁగా (స్వజనేప్రియతాం) యోగ్యమగువిషయమునందు ఆనందపడునట్లుప్రయత్నింపుము. (స్వజనేప్రియతాం) శ్లో॥ ౬౬ "స్వేషుదారేషురతిం నోపలభామ్యహం" అనియెడిబుద్ధినిమార్చి "స్వేషుదారేషురమ్యతాం" అని యగ్నిసాక్షికముగఁజేపట్టిన ధర్మదారలతోరమింపఁజూడుము. (స్వజనేప్రియతాం) విజాతీయులగు మనుష్యస్త్రీలనువిడిచి సజాతీయ్యులగు రాక్షసస్త్రీలనుఅనుభవింపుము. ప్రియతాం అని, రాగప్రాప్తముగ రాఁగలదానిని బలాత్కారముగ స్నేహింపవచ్చునా యనఁగా, ప్రియతాంఅని

---

౬౩- ఆత్మైవహి-ఆత్మయే, ఆత్మనః-ఆత్మకు, బంధుః-చుట్టము, ఆత్మైవ-ఆత్మయే, ఆత్మనః-ఆత్మకు, రిపుః-శత్రువు. ౬౪-నివృత్తస్య-మరలినట్టి, మమ-నాయొక్క, అశ్వాః-గుఱ్ఱములు, వర్త్మని=మార్గమునందు, నప్రావర్తంత - నడవనేరవు. ౬౫- పంచాస్యాం=విశాలమగుమొగముగల అనఁగాపడగయెత్తిన, పన్నగీమివ=సర్పకన్యకవలె. † పరదారాః-ఇతరస్త్రీలు, నికృతిప్రజ్ఞం-వంచనచేయుబుద్ధిగలవానిని, పరాభవం నయంతి-అవమానమునొందించుచున్నారు. ౬౬- అహం-నేను, స్వేషుదారేషు-నాకళ

సాధించుచున్నది. (మనఃప్రియతాం) నీవుప్రియపడితివేని మనస్సుతనకుఁ దానేప్రియపడును. స్వజనేయనివిషయసప్తమిగాక అధికరణసప్తమిచేసిన స్వజనమునందువర్తించెడు మనస్సుప్రియపడునుగాకయనియర్థము. అట్లనఁగా॥ శ్లో॥ ౬౭ "తాస్త్వాంపరిచరిష్యంతి" అనియు॥ శ్లో॥ "యావంత్యోమమసర్వాసామైశ్వర్యంకురుజానకి" అని, నన్ను వారుసేవించునట్లుచెప్పినందుచేత వారునిన్నుజూచి ఈసడించుకొనిగదాయుందురు. అదివిడిచి నీయెడల వారలహృదయములు సరసములగునట్లుచూడుము. అనియుభావము. (స్వజనేమనఃప్రియతాం)స్వజనమునందుమనస్సుప్రియపడునుగాక= స్వజనమునుబొందిన మనస్సనియన్నట్లె శ్లో॥ ౬౮ "పరిభూతవిషణ్ణాచేత్ భార్యాభర్తావినశ్యతి" అన్నట్లు, నీవుచేసిన అనవలోకనముచేతను, ఉపేక్షచేతను నీవారుక్లేశించిరేని నీకనర్థము గలుగును. అదిరాకుండ వారలహృదయముచల్లపడునట్లు "మత్తోనివర్తయ" అనిచెప్పెననియైనఁ జెప్పనగును. (మత్తోమనోనివర్తయ) ౬౯ "ధ్యేయోనారాయణస్సదా" అనియు, "ధ్యేయస్సదాసవితృమండలమధ్యవర్తీనారాయణః" అనియు,

---

త్రకులయందు, రతిం-అనురాగమును, నోపలభామి-పొందను. స్వేషుదారేషురమ్యతాం-నీకళత్రములందే రమింతువుగాక. ౬౭. తాః-వారలు, త్వాం-నిన్ను, పరిచరిష్యంతి-ఉపచరింపఁగలరు. యావంత్యోమమ-నాకెందఱుస్త్రీలుగలరో, సర్వాసాం-అస్త్రీలందఱికి, ఐశ్వర్యం-తలమిన్నవుగానుండుటను, జానకి-ఓసీతా, కురు-చేయుము. ౬౮. భార్యా-పత్ని, పరిభూతవిషణ్ణాచేత్-అవమానింపఁబడి దుఃఖమునొందినదయ్యేనేని, భర్తా - పెనిమిటి, వినశ్యతి-నశించును. ౬౯ నారాయణః-నారాయణుఁడు, సదా-ఎల్లప్పుడు, ధ్యేయః-ధ్యానముచేయఁదగినవాఁడు. సవితృమండలమధ్యవర్తీనారాయణః-సూర్యమండలము నడుమనుండెడి నారాయణమూర్తి, సదా-ఎల్లప్పుడు, ధ్యేయః-ధ్యానింపఁదగినవాఁడు. స్మృతః-స్మరింపఁబడినవాఁడై, శోభనం-మంగళమును, యచ్ఛతి-ఇచ్చుచున్నాఁడు. రామేతిరామేతి-రామరామయని, సదైవ=ఎల్లప్పుడును, బుద్ధ్యా-బుద్ధిచే, విచింత్య తలఁచి. మనసా-హృదయముచేత, రామం-శ్రీరాముని, జగామ-పొందెను. నినైత్తిరుందే-తలంచుచునె, శిరమం-కష్టములను, తీర్ందేక్-పోఁగొట్టుకొంటిని. అడియార్కళ్ - దాసులు, తమ్మడియనై-తమస్వామిని, నినైయుంబడియవర్-తలంచుకొనునట్టివారు.

"స్మృతోయచ్ఛతిశోభనం" అనియు, "రామేతిరామేతిసదైవబుద్ధ్యావిచింత్య" అనియు, "జగామమనసారామం" ద్ర॥ "నిన్నై త్తిరుందేశిరమంతీర్ందేన్" అనియు, "అడియాల్ కళ్ తమ్మడియెన్నై నిన్నై యుంపడియవర్" అనియుఁజెప్పఁబడునట్లు, ఉజ్జీవనమగువిషయమునందు అనవరతభావనచేయుటప్రాప్తము. అంతేకాక అనర్థహేతువుగ నన్నుఁదలంపరాదుసుమీ॥(నివర్తయ) ప్రవృత్తిధర్మమొకనాఁడునుగూడదు. నివృత్తిధర్మమే ఉత్తారకముసుమా॥ (మనోనివర్తయ) "స్వేషుదారేషురమ్యతాం" నివృత్తికివిషయమునిషిద్ధము. ప్రవృత్తికివిషయముసంసారము. అట్లగుటచే, నిషిద్ధమునువదలివిహితములయందుప్రవర్తింపఁజూడుము. ఏతావతా ఈశ్లోకమువలనస్వానర్థమొకతట్టుండఁగా పరానర్థమును తాళఁజాలని సీతాదేవియొక్కహృదయార్ద్రితయుకృపయుచెప్పఁబడెను.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణంప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణ శ్లోకరత్నావళియందు
తృణమంతరతః అను శ్లోకముయొక్క యుపన్యాసము సంపూర్ణము.

---

శ్రీరామచంద్రాయనమః.

---

రావణునిఁగూర్చి సీతాదేవిచెప్పిడివచనము ఇరువదియొకటవసర్గములోనిది.

శ్లో॥ మిత్రమౌపయికంకర్తుంరామస్థానంపరీప్సతా।
వధంచానిచ్ఛతాఘోరంత్వయాసౌపురుషర్షభః॥౨౦॥

టీ॥ పురుషర్షభః=పురుషశ్రేష్ఠుఁడగు, అసౌ=ఈ, రామః=శ్రీరాముఁడు, స్థానం=లంకాదిస్థానమును, పరీప్సతా=కోరుచున్నవాఁడవును, ఘోరం=క్రూరమగు, వధంచ = చంపుటను, అనిచ్ఛతా=కోరనివాఁడవును అగు, త్వయా=నీచేత, మిత్రంకర్తుం=మిత్రునిఁగాఁజేసికొనుటకు, ఔపయికం=తగినవాఁడు.

తా॥ ఓరావణా నీవు లంకాస్థానమును ఏలవలయునని కోరికగలవాఁడవయినయెడలనుఆతనిచే క్రూరమగు వధముచేయఁబడవలయునను కోరికలేనివాఁడవైనయెడలను ఆయనతో స్నేహించుటమంచిది.

అశోకవనికయందు వేంచేసియుండు సీతాదేవిసన్నిధానమునకుఁ బోయి రావణుఁడు అభిజనవిద్యావినోదములందు లోకులకంటెఁ దనకుఁ గలిగియున్న మేలిమిని తెల్పియు, బహువిధ క్షేత్ర ధనధాన్య రత్నవస్త్రభూషణ పరికరపారిబర్హ దాసదాసీజనాదులనిచ్చెదనని చెప్పియు, సీతాదేవిని స్వనియమమునుండి తప్పింపయత్నింపఁగా, సీతాదేవి వీఁడు చెప్పిన వానియందొకటినైనను పాటింపక వీనికిఁగలుగుననర్థమునాలోచించి వీనికి హితబోధము చేయునట్టివారు లేకుండుటం జేసికదా వీఁడిట్లువదరుచున్నాఁడని యెంచి, ఆచార్యపరంపరావధియయిన పరమాచార్యభూతురాలు గాన వీనికిహితము చెప్పుచున్నది. అట్లు చెప్పునప్పుడు తృణమంతరతఃకృత్వా అన్నట్లు పరపురుషముఖావలోకనము చేసి మాటలాడఁగూడదనియెడి మర్యాదచేఁగాని తృణమువలె వాఁడు గౌరవింపఁదగనివాఁడను నగౌరవజ్ఞానముచేతఁగాని అచేతనమగు నీ తృణముప్రతిపత్తిచేసినంగదా నేను చెప్పిన మాటయందు వీఁడు ప్రతిపత్తిచేయునని యెడిభావముచేతఁగాని "యంత్వాం దేవినిరీక్షసే, సకులీనస్సబుద్ధిమాన్" అన్నట్లు, తాఁజూచినవారుబుద్ధియుక్తులగుదురనుతలంపుచేతఁగాని శ్రీరాముఁడుతృణముంగొని కాకాసురునిందణిమినట్లు దీనిచే వీనినిఁదఱుమవలయునను మదిచేతఁగాని సృగాలశశాదులనుంబోలె పశుప్రాయుఁడవగు నీకుభోగ్యమిదెయనునాంతరముచేతఁగాని "శీతోభవహనూమతః" అని యగ్నినిశీతముగాఁజేయఁబోవునట్లు అచేతనమగు తృణమును చేతనముగఁ జేయవలయునను సంకల్పముచేతఁగాని ఆసన్నుఁడైయుండెడి వీనికిని తనకును ఒకవ్యవధానము ఉండవలయునని యెడికోరికచేతఁగాని తృణమును స్తంభముగఁజేసి యాద్దానినుండి రామసింహమును బయలుపఱుపవలయుననిగాని "మిత్రమౌపయికంఅనిచ్ఛతా" అనిచెప్పఁబోవు నీమెవీరపత్నికాఁబట్టి, ఓరిరావణా యీతృణమునునోటఁగఱచుకొని రామునిపాదములపైఁబడుమను దానికి సూచకముగాఁగాని, నన్నువిశేషముగభాషించిన నిన్నును నీవుదొంతరలిడిన ధనధాన్యవస్తు రత్నవస్త్రాదులను ఈగడ్డిపోఁచకుసమానముగసుమీ తలంచియున్నానని

తెలుపుటకుఁగాని ఒకప్పుడుకనునడుమవైచి "నాహంమాపయికీభార్యాపరభార్యాసతీతవ" అని యీదుర్బుద్ధినీకుఁగూడదుసుమా, "స్వేషుదారేషురమ్యతాం" అన్నట్లు నీకుభోగయోగ్యలగు స్త్రీలయొక్క కడుపుమండకుండునట్లు వారలతోఁగలసిమెలసియుండుము అనిచెప్పి "ఇహసంతో న-వాసంతి" అన్నట్లు మాలలుమొదలగు అలబరిజనముగలిగి మిగులవిస్తీర్ణమగు నీదేశములో నొకఁడనర్థమనుభవింపఁబోవునేని యిట్లుచేయఁగూడదనిహితముచెప్పి నివర్తింపించుటకొక్కరైన లేకపోయిరేయనుటకుసరిపడకవాసంతి, శ్రీవిభీషణుఁడుమొదలగుపరమధార్మికులున్నారుగాన "సతోవానానువర్తసే-౧ "ప్రణిపాతేనపరిప్రశ్నేనసేవయాఉపదేక్ష్యంతి" అనియున్నట్లు తమపాదములకెరఁగియనువర్తించెడువారలకేమంచిచెప్పుదురు. అట్లు వారలకెఱఁగియెఱుంగవో, మొదటనుండి నీవీయూరిలోనున్నదానవుకావు నిన్నవచ్చినదానవు నేనుసత్తులకెఱఁగనిదెల్లెఱింగితివంటివేని "తథాహివిపరీతాతేబుద్ధిః" నీబుద్ధియును దుష్కృత్యములును ఎఱింగించుచున్నవి. "దుష్కృత్యమునెఱుంగుటకు నీవంతర్యామివా" యంటివేని ఆచారవర్జితా నీయనుష్ఠానముచేతనే యూహించతగ్గది. యూహించితినని హితబోధనుసేయువారలు బోధింపని యీరావణునిదురాచారముంగనియీసడించి యిఁకయొక్కని ననువర్తింపవలదు అనువర్తనాపేక్షలేకుండనేను నీకు హితముదెల్పెదను, నేనువచించినప్రకారమును అనుష్ఠింపుము అనియనుచున్నది. కూడునేనియనుష్ఠించెదను ఆహితమునుచెప్పఁగూడదాయనగా (మిత్రమౌపయికంకర్తుంరామః) శ్రీరామునితో నీవువిరోధించుటఫలింపదు. ఆతనితోమైత్రిసేయుటకు ఆతనిననువర్తింపుముఅనిచెప్పుచున్నది. (మిత్రంకర్తుమౌపయికం) పరిపూర్ణముగ నపరాధముచేసిన నీకు ఆతని పాదములయందు శరణుచొచ్చుటయేతగినది. మిత్రమనియుండఁగా శరణమనియర్థమెట్లు చెప్పనగుననఁగా, ఉత్తరశ్లోకమునందు "విదితస్సహిధర్మజ్ఞశ్శరణాగతవత్సలః తేనమైత్రీభవతుతే" అని ఆతఁడుశరణాగతవత్సలుఁ

౧. ప్రణిపాతేన-నమస్కారముచేతను, పరిప్రశ్నేన-ప్రశ్నసేయుటచేతను

ము, నీవునుశరణుచొరుము అనియెడియర్థమునందు మైత్రీశబ్దప్రయోగము చేయుటవలన మిత్రశబ్దము శరణశబ్దపర్యాయమగును. “అర్చనంవదనం దాస్యం సఖ్యమాత్మనివేదనం” అని సఖ్యమును భక్తిప్రకారముగ చెప్పఁబడియున్నదికాన నాతనిశరణుచొరుమనుచున్నది. ౨ “శ్లో॥ తమేవశరణం గచ్ఛసర్వభావేనభారత” అని ధార్మికులైయుండెడి మఱికొందఱును ఈ యర్థమును చెప్పియున్నారు. అయినను ప్రత్యక్షముగ సీతాదేవిశరణమని చెప్పక మిత్రమనిచెప్పుటయేలయనఁగా క్షుద్రులగువారు తమ్ముఁదాము గౌరవించుకొని పరులనునీచులనుగాఁదలంతురు-అట్టిగుణములేని సీతాదేవి హృదయమునం దార్ద్రతతోఁజెప్పుచున్నది. ఇట్లుచెప్పినది ఈమెమాత్రమేకాదు. శ్రీరాముఁడును ఒకరాక్షసుని “మిత్రభావేనసంప్రాప్తం” అనియు, ఒకకోఁతిని సఖాచమేఅనియు, ఒకబెస్తవానిని “ఆత్మసమస్సఖా” అనియు, తనకుఁదగినస్నేహితులనుగాఁజెప్పెను. మఱియొకయాకారముచేతను మిత్రశబ్దమునుచెప్పుచున్నది. అదెట్లనిన. “ననమేయం” అని, ఇతరులకువంగనిరాక్షసుఁడును దుర్మార్గియునగువీనితో నీవుశరణుచొరుమని చెప్పితిమేని సమ్మతింపఁడుకనుక స్నేహభావముఁగొనుమని చెప్పినయెడసమ్మతించుననియిట్లుచెప్పుచున్నది. (మిత్రంకర్తుమౌపయికం) మితాత్ త్రాయతఇతిమిత్రం-మితిస్నేహనే-అనుధాతువు-శ్రీరామునికి ద్వేషవిషయము కాకస్నేహవిషయమగుటమిక్కిలిమంచిదిసుమీ? సాక్షాత్తుగా నీతనికిశత్రువైప్రబలుఁడనైయుండెడినేనుసాహేతుఁడనై శ్రీరామునియొక్క ద్వేషమునకువిషయముకాక ఈతనితో మైత్రిఁగొనియాడఁబోవుదునాయనఁగా (మిత్రంకర్తుమౌపయికం) ఇట్లు ప్రాతికూల్యమొనరించిన నీవుసర్వవిధములచేతను మైత్రిచేయవలసినవాఁడవుసుమా? ఇదియొనర్చినం బ్రయోజనమేమియనఁగా (మిత్రంకర్తుమౌపయికం) నీప్రాణములనురక్షించుకొనుట కుపయోగించుకొనవచ్చును. ఔపయికం-ఉపాయమనఁగా నిమిత్తకారణము. నీయొక్కయుజ్జీవనమునకు రాముని చెలిమియుపాయమగును. సూత్రము॥

---

సేవయా-పరిచర్యచేతను, ఉపదేక్ష్యంతి ఉపదేశింతురు. ౨. భారత-ఓయర్జునుఁడా,

ఉపాయేర్హాస్వః అనుటచేత ఉపాయశబ్దము ఉపయశబ్దమగును స్వార్థమునందు ఠక్ప్రత్యయమును ఇకాదేశమును ఆదివృద్ధియును అకారలోపమునుగలిగి ఔపయికమనిపదమయ్యెను. ఇట్లగుటచే ఔపయికమనఁగా నుపాయమనియర్థమయ్యెను. “ స్థానంపరీప్సతావధంచానిచ్ఛతా ” అనియితఃపరము ఫలముచెప్పఁబోవుచున్నది. నేను మైత్రికోప్పుకొనినయెడల ఆతఁడుప్రసన్నుఁడుగాక యుగ్రుఁడై కసరిననేమిసేయవచ్చుననఁగా(రామః) యాచింపకయె కలసి మెలసి యుండునట్టి యార్ద్రభావముగలిగినవాఁడుసుమా! (రామః) కైవర్తకునితోడను కోతులతోడను చెలిమిచేయువాఁడు ఇట్టియోగ్యతగల నీతోఁజెలిమిసేయకపోవునా? (రామః)నీవు ఆతనిచెలిమివలదనినను ౩ “యదివారావణస్స్వయం * ఆనయైనం” అనిరప్పించుటయు, ఆపత్తుమూఁడినప్పుడు గచ్ఛ [హామ్మ్] అనివిడిచితలుముటయు ఆతనిస్వభావము. అట్లుండ నీవును సమ్మతించితివేనివిడుచునా? (రామోమిత్రంకర్తుమౌపయికం) దుర్హృదయులును దురుపదేష్టలునగు ప్రహస్తాదులనువదలి “సుహృదంసర్వభూతానాం” అనియు, ౪ “నివాసశ్శరణంసుహృత్” అనియుచెప్పఁబడు సర్వభూతసుహృత్తగు శ్రీరామునితోచెలిమిచేయఁజూడుము. (రామః) రమయతీతిరామః నిన్నువదలి దూరముననిలిచెడు నీయొక్కచుట్టములను నీప్రాణములను చెదరిపోనియ్యక పూర్వమువలెనే చక్కఁగ చేరియుండునట్లుచేయఁగలవాఁడు.సరి. మదీయములైయుండెడివానిని ఈతఁడుచెదరిపోకఉండునట్లుధరింపఁజేయవలయునా? యనఁగా (స్థానంపరీప్సతా-వధంచానిచ్ఛతా)నీకాఁపురమును నీప్రాణములను ఇంతకుముందునీవేయయినను ఇఁకమీఁదటఁగూడనీవిగానుండవలయునను కోరికగలవాఁడవైతివేని యాతని నాశ్రయించుటయుచితము.

---

సర్వభావేన-సమస్తవిధములచేతను, తమేవ-ఆపరమాత్మనే, శరణంగచ్ఛ - శరణుచొరుము. ౩- యదివారావణస్స్వయం - రావణునితమ్మునిమాత్రమేకాదు, రావణుఁడు తానేవచ్చి శరణుచొచ్చినను గాపాడెదను. ఏనమ్-వీనిని, ఆనయ-తీసికొనిరమ్ము. ౪- నివాసః-వాసయోగ్యనగుచోటును, శరణం-రక్షకుఁడును, సుహృత్-

(స్థానంపరీప్సతా) స్థానమనఁగా ఆవాసము, శ్లో॥ ౫ "అభిషిచ్యచలంకా యాంరాక్షసేంద్రంవిభీషణం" అని, నీతమ్మునికి ఈరాజధానిని ఇయ్యఁబో వుటనిశ్చయము. "అట్లుచేయకయుండను నీవే యీరాజధానినేలవలయు" అనుకోరికగలవాఁడవైతివేని యనిభావము. (స్థానంపరీప్సతా) స్థానమ నఁగాస్థితి. శ్లో॥ ౬ "త్రీన్లోకాన్సంపరిక్రమ్య" అన్నట్లు, కాకివలెకన్న తావులయందును తిరిగియల్లాడక ఒకచోటనుండఁగోరితివేనియనిభావము. (స్థానం) అనఁగాసంస్థానము. అనఁగా చతురంగముయినపరికరమును నీ వునశింపకయుండవలయునని కోరితివేనియనియుభావము. (స్థానంపరీ ప్సతా) స్థానమనఁగానధిష్ఠానము. స్వామ్యమాత్యసుహృత్కోశాదులగు ప్రహస్తాదిమంత్రివర్గమును కుంభకర్ణేంద్రజిత్ప్రముఖులగు భ్రాతృపుత్రాది వర్గమును నీవుసంపాదించినఅర్థము బహుకాలముగ కాఁపురముండిన యీ రాజధానియుఁగలసియుండెడి యీయధిష్ఠానము నశించిపోకయుండవల యునని కోరికగలవాఁడవైతివేనియనిభావము. రాజధానియనధిష్ఠానము నుచూచియున్నాను. వేఱొకచోటికిఁబోయియుండెదనంటివేని. శ్లో॥ ౭ "రసాతలంహిప్రవిశేత్ పాతాళంవాపిరావణ । పితామహసకాశంవా నమేజీవన్ హిమోక్ష్యతే" 'అన్నట్లు భూమిలోదూఱినను కొండగుహల లోదూఱినను నీకుజన్మభూమియగు పాతాళమునకుఁబోయినను వరము లిచ్చినిన్నిట్లువృద్ధిచేసిన బ్రహ్మయొక్క లోకమునకుఁ బోయినను ఆయా చోట్లయందునీవుజీవముతోనుండవీలుపడదు. చుట్టుప్రక్కలఁబోయియుండ వచ్చునని చూచినను ఆతనిమైత్రికావలయునుసుమా? ప్రసిద్ధస్థలములయం దుఁబోయియుండినఁగదా ఆతనిదయకావలయునంటివేని. అజ్ఞాతవాస ముగ నొకచోట దాఁగియుండినను (వధంచానిచ్ఛతా) నిన్ను జీవముతో

స్నేహితుఁడును. ౫- రాక్షసేంద్రం-రాక్షసులకుప్రభువగు, విభీషణం-విభీషణుని, లంకాయాం - లంకాపట్టణమునందు, అభిషిచ్యచ - అభిషేకముచేసి- ౬- త్రీన్లో కాన్-మూఁడులోకములను, సంపరిక్రమ్య - చక్కఁగాతిరిగి. ౭. రావణ-ఓరావణుఁ డా, రసాతలంహిప్రవిశేత్ - భూమిలోపలఁజొత్తువుగాక, పాతాళంవాపి-పాతా

విడిచినంగదా నీవుదాఁగిసంచరింపవచ్చును. అట్లుచచ్చుటకిష్టము లేనివాఁడ వైతివేని యాతనినాశ్రయింపవలయును. (వధమనిచ్ఛతా) వ్యాధిలోనగు వానిచేత నేని మరణమురానేవచ్చునుగనుక మరణమువచ్చినను రానీయుం టివేని, ఒకమరణమేగాక ఒకశత్రువు తనబలముతో నీపట్టణంబునంజొచ్చి నిన్నుఁదలతెగనఱకెననియెడి పరిభవమునువచ్చును. అట్టిపరిభవమురాకుం డఁజేసికొననెంచితివేనియని భావము. వీరునికిశత్రువుచేతఁ జచ్చుటమేలు గదాయనియంటివేని.(ఘోరంవధమనిచ్ఛతా)లోకులవలెసాధారణముగ చచ్చిపోవునప్పుడును ఆతనినాశ్రయించవలయును. (ఘోరంవధం) నిన్నుఁ జంపునప్పుడు సులభముగవిడుచునా? ఒకదూతనుబంపి ఇచ్చోటఁబాదుకొ ల్పి యాదూతంగొని నీనందనవనమును భూమిమట్టముగఁజేయిపి నీసేనను జంపి నిన్నవమానపఱచుచు నీసభయందుఁజొచ్చి తనప్రభువుయొక్కగౌర వమును నీయొక్కలాఘవమును చెప్పి నీరాజధానిని అగ్నికణంబులును పొగ లునెగయునట్లుకాల్చి మసిచేసి మరలఁబోయి యిచ్చటంజరిగిన విశేష ములుచెప్పునట్లుచేసికొని యనంతములగుపరికరములంగొని చూడనివార లంజూచుచు నగాధమగు నీమనస్సులోరాళ్లువేసిక్రుక్కినట్లు నీకుజలదుర్గ మగు సముద్రమునురాళ్లువేసిపూడ్చి పెద్దత్రోవయొనరించి కోఁతులనుకా ల్నడగా నావలిగట్టునుండితెచ్చి నీరాజధానిచుట్టునరికట్టి నీవేలినపరికర మంతయునేలంగలపి నీ సంబంధులముక్కులుగోయుట, బాహువులునఱ కుట, పాదములుతెగఁగొట్టుట, శిరంబులుఖండించుట, తాటిపండ్లురాల్చి నట్లు నీతలలునేలంగూలనేయుట, భుజములభుగ్నంబులంజేయుట, ఒడలఁ గంతలువడంగొట్టుట, ఈరక్తధారలను నీస్త్రీలకుఁజూపునట్లు గచ్చ అని విడిచితఱుముట, ఇట్టి చిత్రవధముచేసిసుఖా నిన్నాతఁడుచంపఁబోవుచు న్నాఁడు. ఇట్టి మహాక్రూరమగువధమునుకోరవేని యాతనినాశ్రయింపు ముఅనిభావము. ఈతఁడుకోపింపఁగా నీపాటు లనుభవించినవాఁడెవఁడైన నఁగలఁడాయనఁగా (త్వయా) ఇట్లువేఱొకఁడునుఇంతయపరాధమొన రించినవాఁడులేఁడు. ఇట్లు ఆతనివలనఘోరవధననుభవించినవాఁడునులేఁ

డు. ఆతతాయియై యసహ్యాపచారముచేసి చిత్రవధపాత్రుఁడవైన
నీకు ఇంతయు కావలసినదే? ( స్థానంపరీప్సతా వధంచానిచ్ఛతా త్వయా )
నీవిక్కడనుండవలయునన్నను చావవలయునన్నను రెంటికినాతఁడు కావ
లయును. ఆతఁడిక్కడ సన్నిహితుఁడుగానుండవలయునేయంటే? దీనిచే
నిక్కడనేయున్నాఁడనుచున్నది. ౮ " అసౌ రామమేవానుపశ్యతి" "రా
మేతి రామేతి సదైవబుధ్యావిచింత్య" అనియు నెల్లప్పుడును శ్రీరామునే భా
వించుటచేత మిక్కిలి ప్రకాశముగఁ దనకెప్పుడు సన్నిహితుఁడైయుండుటం
జేసి యీతఁడని చూపించుచున్నది, ఈ రావణుని కింతకుముందు ఈతనితోడి వా
సనలేమింజేసి స్నేహపూర్వానుధ్యానము సంఘటిల్లక యన్యపరుండగుట
చేతను ఇట్లుతోఁచదుసుమా. ప్రతికూలుఁడగుమారీచునికి పూర్వవాసన
యుండుటంజేసి ౯ "వృక్షేవృక్షేహి పశ్యామి" అన్నట్లు, చూచినవియెల్ల
శ్రీరామరూపములుగా నేకనఁబడెనుగదా. రావణుఁడును యుద్ధమునందు
వాసనగలిగిన వెనుక రామునిబాణములు హృదయంగమములైన ౧౦ "స్మ
రన్ రాఘవబాణానాం" అన్నట్లు, వానినిదలఁచుచునే పోయెనుగదా? (అ
సౌ ) సన్నిహిత దేశవర్తమాన కాలసంబంధినిగదా అయమని చెప్పుదురు.
ఇచ్చటబుద్ధియందు అదూరత్వముచేతను దేశకాలవిప్రకర్షముచేతను అ
దూరవిప్రకర్ష వాచియగుటఁబట్టి అదశ్శబ్దముచేఁ జెప్పుచున్నది. ( అసౌ )
౧౧ " అస్యాదేవ్యామనస్తస్మిన్నస్యచాస్యాంప్రతిష్ఠితం " అనియు॥ ద్ర॥
"ఉన్నైక్కొండెన్నుళ్ వైత్తేన్ ఎన్నైయుమున్నిలిట్టేన్ " అనియు చెప్పఁ
బడునట్లు, ఈమె హృదయము అతనియందే తొట్రుపడుచుండుటంజేసి సీతా

---

ళలోకమును ప్రవేశింతువుగాక, పితామహసకాశంవా - బ్రహ్మవద్దకేగిన నేగుదువు
గాక, మేజీవన్నమోక్ష్యసే = బ్రతికియుండి నాచేతఁదప్పించుకొననేరవు. ౮. అసౌ
ఈసీతాదేవి, రామమేవ = శ్రీరామునినే, అనుపశ్యతి = అనుసరించి చూచుచున్నది.
రామేతిరామేతి = రామరామయని, సదైవ = ఎల్లప్పుడును, బుధ్యా = బుద్ధిచేత, విచిం
త్య = ధ్యానముచేసి. ౯. వృక్షేవృక్షే = ప్రతివృక్షమునందును, పశ్యామిహి = చూచెద
నుగదా. ౧౦. రాఘవబాణానాం = శ్రీరామునిబాణములను, స్మరన్ = తలఁచుచు.
౧౧. అస్యాదేవ్యాః = ఈసీతాదేవికి, మనః = మనస్సు, తస్మిన్ - ఆరామునియందు

దేవికొకవిధముగాఁదోచుటకడ్డులేదుగదా (అసౌ) ఆసన్నునింజేసి యా
తనినాశ్రయించునప్పుడు నేనుచేసినవిరోధములనుదలంచి వికృతుఁడైయుం
డెడివాఁడు నన్నుస్వీకరించునాయనఁగా (పురుషర్షభః)జనులుచేసినయప
రాధములను మనసునఁబెట్టుకొనియుండెడివాఁడుకాఁడు. తప్పులెఱుఁగని
ధర్మప్రభువుసుమా? (పురుషర్షభః) "అవిజ్ఞాతా" [ ఎఱుంగనివాఁడు ]
అనియు, "నస్మరత్యపకారాణాంశతమప్యాత్మవత్తయా" అనియు, ౧౨
"అపరాధానభిజ్ఞస్సన్ సదైవకురుతేదయాం" అనియు, కవిచేస్తుతింపఁ
బడినవాఁడుసుమా? ( పురుషర్షభః ) దోషములనెఱుఁగకయుండుటమా
త్రమేకాదు. శ్లో॥ ౧౩ "దోషోయద్యపితస్యస్యాత్" అనియు॥ ద్ర॥ "కు
ర్యాన్నయకృతంశేయినం" అనియు, చేసినతప్పులనొప్పులుగాఁగొనునట్టి
యుత్తమపురుషుఁడుసుమీ? (పురుషర్షభః) "యదివారావణస్స్వయం"
అనియు, "గచ్ఛానుజానామి" యనియు, ప్రతికూలదశలోనుగూడ నిన్ను
రక్షించుటకొఱకు రప్పించుచువిడిచితఱుముచునుండునట్టివాఁడు నీవనుకూ
లించితివేనివదలునా? ( పురుషర్షభః ) నీవు పురుషులలోపలనధముఁడవై
యుండునట్లు, ఆతఁడుపురుషులలోనుత్తముఁడైయున్నవాఁడు. ( పురుష
ర్షభః) "పురుషోత్తమః" అన్నట్లు, అధముఁడగువాఁడు చేసినయపరాధ
ముల మనసుననేయుంచుకొనిసాధించుచుండును. మధ్యముఁడగువాఁడు అ
పరాధములను గాలక్రమముగమఱచిపోవును. ఉత్తముఁడగువాఁడు అప
రాధమునెన్నఁనేల దానినిమఱవనేలయని మొదటనేయపరాధములనుదలఁ
పఁడు. ( పురుషర్షభః ) ఇట్లు అనుకూలింపనిపక్షమున అతనిశార్ఙ్గవ్యాపా

---

ను, తస్యచ = ఆరామునికి, అస్యాం = ఈసీతయందును, ప్రతిష్ఠితం = స్థిరముగా నిలు
పఁబడెను. ఉపైష్యకొండు = నిన్నుగొని, ఎన్మశ్ = నాలోపల, వైత్తేక్ = పెట్టుకొం
టిని. ఎపైష్య = నన్ను, ఉస్మన్నిల్ = నీయెదుట, ఇట్టేక్ = ఉంచితిని. ౧౨. అపరా
ధానభిజ్ఞస్సన్ = అపరాధములనెఱుంగనివాఁడై, సదైవ = ఎల్లప్పుడును, దయాం
కురుతే = దయచేయుచున్నాఁడు. ౧౩. తస్య = అతనికి, యద్యపిదోషస్స్యాత్ = దో
షముండినను, కుర్యాన్నయకృతంశేయినుం = కొండంతతప్పుచేసినను.

రముచేత నీకువ్యాపాదనముకలుగుననితలంపుము. ( పురుషర్షభః ) ఆతని కోదండముచేత కొనముట్టుదువనితలంచియుండుము. ఈశ్లోకముచేత శ్రీసీతాదేవికి రావణునికిట్టియుపదేశముచేయు హృదయార్ద్రతయు వాత్సల్యమునుకలిగియుండుటయు ఇట్టి యీదయావాత్సల్యములకుంజిక్కక తప్పించుకొనునట్టి రావణునియొక్క పాపప్రాచుర్యమును చెప్పంబడియెను.

శ్రీకృష్ణసూరి చరణౌ శరణంప్రపద్యే.

ఇది తనిశ్లోకియను శ్రీరామాయణశ్లోకరత్నావళియందు

మిత్రమౌపయికం అను శ్లోకముయొక్క

యుపన్యాసము సంపూర్ణము.





శ్రీ - పెరియవాచ్చాంబిళ్లగారు ౪౦౦ శ్లోకములకు ఇట్టివ్యాఖ్యానము చేసియున్నట్లు వినియుండుటగాక ౧౦౦ శ్లోకములకు వ్యాఖ్యానము దొరకియున్నది. అది తెలుఁగున వ్రాయఁబడి యొకొక్క సంపుటముగఁ బ్రకటింపఁబడు చుండును.